

# అరవింద.



## రెండవభాగము.

### ఒకటవ ప్రకరణము.

### కామేశ్వరమ్మ.

అరవిందామహాదేవికి రాజ్యప్రాప్తమై రెండు నెలలైనది. కృష్ణమరాజాదులాశౌచదినములు గడచిన కొలఁదిదినములకే స్వగ్రామములకేఁగిరి దేవేరియనుమతిమీఁదఁ గామేశ్వరరావు మరణశాసనమును బట్టి వారివారికీయవలసినసొమ్ముల నిర్ణీతకాలమునకుఁ బంపివైచెను. భూపతిరాజు తలఁచినట్లరవింద యీనూత్నపదమున కన్నివిధముల దగియున్నది. ఇంత యుచ్చస్థితి నొందితినని యించుకయైన గర్వమొందలేదు. ఆమె పెదతండ్రి చూపిన మార్గమునఁ బోవుచుండెను. మంత్రివర్గముమాట మాఱిని దాల్చదుఁ జట్టాలనెల్ల నెనరుతోఁ జూచుచు, భృత్యులఁ బ్రీతిఁ బెంచుచు, నాప్తుల నాదరించుచు సర్వజనరంజకముగా రాజ్యము చేయుచుండెను. సమస్తనీతిశాస్త్రమర్మజ్ఞుండగు పూర్ణయమంత్రి మంత్రియుగంధరసన్నిభుఁడై సర్వరాజకార్యముల మహానైపుణ్యముతో నెఱపుచుండెను. నరసింహరాజు కూఁతున కన్నిటఁ దోడై మెలఁగుచుండె.

కాండ్రేగులలో దివాణపుటిండ్లు చాలఁగలవు. వానిలోఁ గోట గదుసమీపముననున్న గృహమొకటి ప్రస్తుత మనాక్రాంతమై యున్నది. అందొక ముఖ్యరాజకీయోద్యోగి కాపురముండెడువాఁడు.

అతఁడు కారధర్మ మొందుటచే నతనికుటుంబ మాగీమును విడిచి చనెను, దానిని భాగుచేయించి తగినవారినందుఁ బ్రవేశపెట్టుమని యరవిందాదేవి మంత్రి కాజ్ఞ యిచ్చెను.

ఒకనాఁడు మధ్యాహ్న మరవిందాదేవి చేటికలోలసికొలువ నొక రమ్యమందిరమందుఁ గూర్చుండి యుండెను. ఆమె మంత్రిప్రముఖులగు ప్రధానోద్యోగస్థులంపు కాగితములను బరిశీలించుచు వానికి నదుత్తరములను వ్రాసి పంపుచు, వలసినవానిపై సంతకములఁ జేయుచు రాజకార్యములఁ జక్కఁబెట్టుచుండెను. నరసింహారాజు సొంతపనులఁ దీర్చికొనుటకుఁ జంద్రమపాలెమునకుఁబోయెను. అత్తఱి నొకదాసివచ్చి "అమ్మా! ఎవ్వతెయో సుందరాంగి తమదర్శనముఁ జేయవచ్చినది. సెలవైనఁ దోడ్కొని వత్తు" ననెను. ఆమె యెవ్వరని యరవిందయడుగఁగా నది తానుగూడ నెఱుఁగననియుఁ గాకినాడనుండి వచ్చినటుల మాత్రము తెలియవచ్చెననియుఁ జెప్పెను. అరవింద యామెను సత్వరము లోనికిఁ దీసికొనిరమ్మని యాజ్ఞయిచ్చెను. కొన్ని నిమేషములకొకయువతి యాయగారమునఁ బ్రవేశించెను. దేవి యామెకెదురేఁగి యుచ్చాసనాసీనురాలింగావించి యామె సౌందర్యమున కచ్చెరువొందుచుండెను. ఆమె సాధారణమైన వినిర్మలధౌతవస్త్రముల ధరించియుండెను. మొగమందు దైన్యము పొడచూపుచుండెను. ఆమె యెండులకో పరితాపపడుచుండిన ట్లామెవదనముఁ జూచినవారు తలఁపకపోరు. ఆపె మెల్లఁగ, విస్పష్టముగ మాటలాడఁజొచ్చెను. ముఖమునందే కాక వాక్యములయందును మనోగతఖేదము కనిపించుచునే యుండెను. వారిరువు రిట్లు సంభాషింపఁ దొడఁగిరి.

స్త్రీ—దేవీ! తమరేవియో ముఖ్యమైన రాజకార్యములు చక్కబెట్టుకొనుచున్నారు కాఁబోలు. నేను వృథగా విఘ్నముంగావింతిని. క్షమింపవేఁడెదను.

అర—అమ్మా! నీరాకవలన నారాచకార్యములకేమియు భంగము కలుగలేదు. నీమోముజూడ నాకు జాలి వొడముచున్నది. నీదేయూరు? నీనామధేయమేమి? నీవు వచ్చినపనియేమి? నాకుఁ జేతనైనంత సాయమును జేయ సిద్ధముగా నున్నాను. చెప్పుము.

స్త్రీ—దేవీ! నాకాఁపురస్థలము కాకినాడ. మాయింటిపేరు మాచిరాజువారు. నన్నుఁ గామేశ్వరమ్మయని పిలుతురు. తల్లీ! మీవంటివారు నాకు సాయపడనియెడల నాబ్రతుకేమియగును? కష్టదశలోనున్న నేను మీయండనుజేరి కాలముఁ బుచ్చవలెనని వచ్చితిని. దివాణమువారి దొరయిల్లనాక్రాంతమై యున్నట్లు తెలిసినది. దానిని నాకిప్పింతురేని తగినయద్దెను సమర్పించుకొందును. నామనోవైకల్యమా సుందరమందిరమందుండినఁ బోవునని యాశ కలదు.

అర—అమ్మా! నీవు స్వేచ్ఛముగా నాయింటియందు నివాసము చేయవచ్చును. అద్దెయవిషయమై మాతండ్రిగారు వచ్చిన తరువాతఁ దెలియఁజేసెదము. ఇక్కట్టులలోనున్న నీకధికమైన యద్దె విధింపరు. ఏవియో యిడుమలందుచుంటినంటివే! వానినిగూర్చి నాకుఁ దెలుపవచ్చునా?

కామే—తల్లీ! తమకుఁ జెప్పక యెట్లుతప్పును? చెప్పెదను, వినుఁడు. నాజనకుఁ డొక గొప్పవర్తకుఁడు. నేనొక్కర్తుకనే యాతనికి జనించిన దానగుట నన్నాతఁడు కడుగోమునఁ బెంచుచుండెడివాఁడు. నాపెండ్లిమున్నగు ముద్దుముచ్చటలఁ జూడకుండ నాజనని నాపండ్రెండవయేటనే కాలధర్మమొందినది. ఆమెకు నాపైఁగల ప్రేమ నేమని వచింతును? నాకెఱుకగలిగిన పిదప స్వర్గస్థురాలై యుంటచే నాకామె యాకృతి, చేష్టితములు కన్నులకుఁ గట్టినట్లున్నవి.

ఈనుడులు విని యరవింద కన్నులనీరు నించెను. పాప మామె జనయిత్రి స్మృతికి వచ్చెఁగాఁబోలు. అరవిందాదేవి మొగమువంక [illegible] కామేశ్వరమ్మకూడఁ బొటపొట బాష్పములు రాల్చెను.

అర—అమ్మా! నాపోవకుము. ప్రసంగముమార్చి మఱిగొకి దానినిగూర్చి చెప్పుము.

కామే—దేవీ! నాకథయంతయుఁ జెప్పెనిందు. (కన్నులఁ దుడిచికొని) నాతల్లి గతించినవెనుక నాతండ్రి మొదలునఱికిన తరువువలెఁ గూలిపోయెను. అప్పటినుండియు మంచముఁబట్టి మఱి లేవలేదు. నేను వ్యక్తురాల నగుదునను భయముచే నాసంవత్సరమందే నాకు వివాహముచేయుట తటస్థించెను. నన్ను ధనవంతులు, మానవంతులు, విజయనగరపురాధీశునొద్దఁ బ్రధానవర్గములో నొకరునగు మాచిరాజువారి చిన్నవాని కిచ్చి నాతండ్రి పెండిలిఁ జేసెను. మఱి రెండేండ్లవఱకెట్టులో గాలముఁగడపి భార్యావియోగము చిరకాలము సహింపనోపక, నన్ను మాతృముు వెంటనే కాఁపురమునకుఁ బుచ్చి నాయనుంగు దండ్రి మాయమ్మను గలసికొనుటకు నాకమున కేఁగెను. నేనత్తవారి యింటనేయుండి నిరంతరము భర్తృపాదారవిందసేవ తప్ప నన్యమెుఱుంగక, యంతటి ప్రేమాస్పదులగు జననీజనకుల విస్మరించి మనుచుంటిని. నానాథుఁడు వయసునందుఁ జిన్నవాఁడైనను బుద్ధియందు బృహస్పతియంతవాఁడై నృపాలునిచేతను, బ్రజలచేతను, మిగుల మన్ననల నొందుచుండెను. అట్టివాని పాదసేవచే నాజన్మము ధన్యతను గాంచునని మురియుచుంటిని. ఇంతలో నాదురదృష్టవశమున నామహానుభావుని మహారాజుగారు కొంతసేనతోఁ బఠానువారికి సాయముఁ జేయఁ జెన్నపురికిఁ బొమ్మని యానతిచ్చిరి. హనుమంతుని మించిన రాజభక్తిపరాయణుఁ డగు నాతఁడు వెంటనే వాహినులతోఁ బయనమై వెడలెను. తల్లీ! నాపరితాపమేమని చెప్పుదును? కాఁపురమునకుఁ బోయి యొకయేఁడాదియైనఁ గాలేదే! ఇంకను నలుపురియెదుట మగనితో మాటలాడుట కైనఁ దలయెత్తి తేఱిచూచుట కైన సిగ్గు వదలలేదే! ఇంతలోనే యెడబాటు సంభవించెనే యని పలువితములఁ గుందితిని. ఏమిచేయఁ

గలను ? నన్నాదరించుట కమ్మా, యబ్బా? ఎవ్వరును లేరు. వృద్ధురాలగు మాయత్తగారు నేను మాత్రి మింటనుంటిమి. ఆమెకు లేక లేక పుట్టిన కొడుకు కొడుకు దూరమైపోవుటచేఁ గలిగినదుఃఖ మేమని వర్ణింతును ? కొన్ని దినములవఱకు నన్నము ముట్టలేదు. నీరు త్రాగ లేదు. కొడుకా కొడుకా యని యామె చేసిన పరిదేవనమునకు మితిలేదు.

అని కొంతతడవు చీరచెఱఁగుతోఁ గన్నులద్దికొనుచు నూరకుండెను. నవనీతహృదయయగు నరవిందమనసు కడుజాలినొందెను. ఆమెకూడఁ గనుదమ్ముల నశ్రుపుల వెలార్చెను. మరలఁ గామేశ్వరమ్మను వెనుకటియంశములు తలఁపునకుఁ దెచ్చికొని గుండె పగులఁ జేసికొనవలదని కోరెను. ఐన నామె పదంపడి దేవేరితో నిట్లు వాక్రువ్వ మొదలిడెను.

"నానాథుఁడు మమ్ము విడిచి చనినపిమ్మట నాతనిజాడ యంతేమియుఁ దెలియమి నాయత్తగారు బెంగఁగొని రెండుమాసములు మంచముమీఁదికాలు క్రిందఁ బెట్టక నానాఁటికి శుష్కించినది. నాదుఃఖమంతయు మ్రింగి యామెకు సర్వోపచారములఁ జేసితిని. కాని యవి యన్నియు వ్యర్థములయ్యెను. మహారాజ్ఞిగారు మనుష్యులనంపించుచు నెన్నియో సందేశములఁ బంపిరి. రాజవైద్యులచే నామెకుఁ జికిత్సలఁ జేయించిరి. కాని మనోవ్యాధికి మందులేదుకదా ! ఆమె తుదకొక నాఁడు "హాపుత్రా ! హాపుత్రా" యని దశరథునివలె విలపించుచుఁ బ్రాణముల విడిచినది. నేను దిక్కుమాలినపక్షినై యుండవలసివచ్చె. "నా" యనువా రొక్కరును లేకపోయిరి. నాతండ్రి యరణమిచ్చినదియు నాభర్త సంపాదించినట్టియు నాస్తి కొంతయుండెను. మహారాజ్ఞిగారుగూడ నాకు నెలకు ముప్పదిరూకలు భరణముగ నిమిత్త మిచ్చుచు గౌరవించుచుండిరి. ఎన్నఁటికైన నాభర్తవచ్చి నావంత లన్నియుఁ బాపు

నియుఁ బడినగోడలు పడినట్లే యుండవనియు నాశకోఁ బ్రాణము
ల్పకొంటిని. కాని భగవంతుఁడు నాకష్టములంతటికి నంత మొందింపఁ
లఁచికొనలేదు. ఒకనాఁటిరాత్రి నేనును నాదాసియు నామగని సుగు
ముల స్మరణమునకుఁ దెచ్చికొని మాటలాడుకొనుచుండ వీధిలోఁ
లకలము విననయ్యెను. ఆధ్వని వినినంగోడనే నాగుండెలో ఱాయి
డెను. దాసి నాసద్దేమిరో కనుఁగొనుమంటిని. అవి పోయియరయఁ
మహారాజుచేఁ బంపఁబడినసేన యంతయు శత్రువులచే నాశముఁ
ావింపఁబడెననియు నొక్కఁడైన మిగులలేదనియుఁ దెలిసెను. అది
ద్దపెట్టున నేడ్చుచు నావార్త నాకోఁ జెప్పఁగా నేను నిశితకుఠార
ాతమున నేలఁగూలిన భూరుహమువలె భూమిపై మూర్ఛ నొందితిని"
ఆమెతిరుగ నూపిరిఁ దీసికొనుటకుఁ గొంతవడి యూరకుండెను.
ఁదుఃఖచరిత్రమంతయు వినుటచే నరవింద మనసంతయు నీరైపోయె
 "అమ్మా! ఇఁక నుగింపుము. వినుటకే నాకుఁగష్టముగానుండె
. నీవెట్లనుభవించితివో!" యని యామె యనెను.
కామే—దేవీ! అనుభవింపకతీఱునా? పూర్వజన్మము దేవ
నెడఁ బాపితినో? విధిపరిపాక మవిలంఘనీయముగదా! నేను నిరా
రజీవిని నైతిని. ఇట్లుతిలకాలినేనేడ్చుచుండ నొకనాఁటినడికరేయి
ొంగలువాయిలుసొచ్చినానోట గుడ్డలుక్రుక్కి యింటనున్న సొత్తం
యుదోద్దవోయిరి. ఆపద లొంటరావను వానుడి సుక్కవమ
య్యెను. నాపురాకృతకర్మఫలము నెవరు తప్పింపఁగలరు?
మఱునాఁడు కట్టఁ బుట్టమును, గుడువఁ గూడును లేకుండెను. ఎవ
దరింతురు? ఆదినుండియు నాదరాయత్తచిత్తులై, యుండియు మహా
ాజుగా రేమికారణముననో నాకేసాహాయ్యమును జేయరైరి. నష్ట
మతులయిన దేశకులపై నాకు నెలకుఁ బదునైదురూకలు మా
ము ఇచ్చుట కాజ్ఞయొసంగిరి. పువ్వులమ్మినయూరఁ గట్టెలమ్మ

కలసి వచ్చెను గదా యనివిచారించుచుఁ గొంతకాలమచ్చటనుండి, త
ర్వాత బ్రతుకుపైరోసి యాత్మహత్య చేసికొనవలెనని యత్నము చే
యుచుండఁగా, నాదాసి, నాకు దూరంపుఁజుట్టమగు రాజమ్మ యను కాకి
నాడ నివాసస్థురాలిని బిలిపించి, నన్నప్పఁజెప్పినది. ఆమె నన్ను బతి
మాలి కాకినాడకుఁ దీసుకవచ్చినది. అప్పటినుండియు నాయూరియం
దే యుంటిని. నేనాపట్టణమందుఁ బది నెలలనుండి యున్నాను. ఆమె
యుఁ బేదయిల్లాలు. ఎంతకాలము భారము కలుగఁజేయనని యోచి
నాయంతనేనే బ్రతుకనిశ్చయించి యీయూరువచ్చితిని. మీయనుగ్రి
హమున్న నేదోయింత నాచెక్కలమీఁద సంపాదించి తెచ్చికొని యీ
యింటఁబడియుండి తినుచుందును. తనుచిత్తము, నాభాగ్యము, నాకష్ట
కథ యంతయుఁజెప్పి యేలినవారి మనమునకు నొప్పిఁ గల్గించితిని.
కాని నాహృదయభారమును గొంతవఱకు వదల్చుకొంటిని.

అర—"అమ్మా! నీవు నేఁటినుండియే యీగృహములోఁ బ్రవేశింప
వచ్చును. నేనును మాతండ్రిగారియనుమతినిబుచ్చికొని నీకుచితముగా
వానిసిచ్చు నేర్పాటులు గావించెదను. నీకుఁ బ్రతిదినము నొక 'కట్టడి'
యిచ్చుటకాజ్ఞయిచ్చెదను. నీవుమాకోటకు నీయిచ్చవచ్చినప్పుడు రావ
చ్చును. పోవచ్చును. నీవిషయములో మాబంట్లకుఁ దగిన యుత్తరువుల
నిచ్చెదము నీవబలవు. అనాథవు. నీవంటిదానికి సాయముచేయుట యే
చేయుట." అని యామెను గౌరవించి యుచితసత్కారములఁ గావించి
వీడుకొల్పెను. నరసింహారాజు మరలిరాఁగానే యామె యావద్వృత్తాంత
మాతనికి నివేదించినది. ఆతఁడు మహామోదముతోఁ గూఁతు నేర్పా
టుల కియ్యకొనెను. నాఁటినుండియుఁ గామేశ్వరమ్మ కాండ్రేగుల వ
ర్గియొక్క యాశ్రితవర్గములో నొక్కతె యయ్యెను. మఱియు జేవతి
శ్శహితురాండ్రిలో నొకతె యనిపించుకొనెను.

---

## రెండవప్రకరణము.

### నెయ్యురాండ్రు.

రాజ్ఞియాజ్ఞపైఁ గామేశ్వరమ్మ దివాణపుటింటిలోఁ బ్రవేశించె
ను. ఆమెకు నగరివెచ్చముఁ బెట్టువారు దినమునకుఁగావలసిన సంబార
ములన్నియుఁ బంపుచుండిరి. ఆమె రాజగృహమును గడుశుభ్రముగనుంచి
పెరటిలో మంచిమొక్కలను బెంచెను. 'ఈమె నడుజవ్వనమందొప్పా
రు తరుణి. ఈమె యొంటరిగా నీగ్రామమున నేలయుండవలెను? నీతి
మంతురాలు కాదేమో,' యనిప్రజ లనుమానముపడుదురేమోయని
యామె సదా చుట్టుప్రక్కలనున్న స్త్రీలను బిలిచిపురాణాదులనుండి
పుణ్యకథలను జదివి యర్థముఁ జెప్పుచుండును. వీధిలోనికివచ్చినప్పుడు
వంచిన మొగము వంచినటులేయుంచును. పరపురుషు నెన్నఁడు కన్నెత్తి
చూడలేదు. ఈకారణములచేత నెల్లవారి కామెయందు సద్భావమేకల
దు. ఆమె నిత్యమును గోటకుఁ బోయి దేవిని దర్శించి, వేడుకగాఁ
గొంతతడవు సంభాషించి వచ్చుచుండును. అరవింద యామె కేలోటును
గలుగనీయక సమస్తపదార్థములను బంపుచు నామెను దనసఖీబృందము
లోనొకర్తనుగాఁ దలఁచుచుండెను. అనేకకష్టములపాలై లోకజ్ఞానము
మిక్కిలిగాఁ గలిగియున్న కామేశ్వరమ్మవలనఁ దానెన్నియోవిశేష
ముల నేర్చికొనవచ్చుననియుఁ దనలోపములను సవరించుకొనవచ్చునని
యు నామె యూహించుచుండెను.

అరవింద ప్రతిదిన మాస్నేహితురాలిపలుకులు వినుచుండెను
గాని యామెహృదయమునుమాత్రము గ్రహింపలేకపోయెను. ఆమె
దుఃఖకథను వినినప్పుడమిత కారుణ్య మీమెమనమునం దుదయించెను.
అయ్యో! ఇట్టి కాంతారత్నమును గావకుండిన నాయైశ్వర్యమేలయని
తలపోసి యామెకేమి కావలెనన్న దానినీయ సిద్ధముగా నుండెను. కాని

వారినెయ్యము ముదిరినకొలఁది నరవిందకుఁ గామేశ్వరమ్మ చేష్టలయందు
ను జూపులయందును యాథార్థ్యమంతగా నున్నటులఁ దోఁచుటలేదు.
ఆమెయందు నమ్మికయుఁ గొంత తగ్గ నారంభించెను. కాని తనయభిప్రా
యము తప్పేమో యని మరలఁ బశ్చాత్తాపపడి యెప్పటియట్ల సుహృ
ద్భావముతోనే యుండెను. ఒకనాఁడు కామేశ్వరమ్మ యథాప్రకారము
కోటకువచ్చి దేవితో సంభాషించి వెడలెను. అప్పుడరవింద యిట్లు తల
పోసెను. "ఏమో! ఈ కామేశ్వరమ్మ చర్య వింతగా నున్నదే. ఎన్నివిధ
ములనైన సమర్థించుకొని యామెయందు సదభిప్రాయముఁ గలిగియుండ
వలెనని యత్నము చేయుచుంటిని. కాని మనసొప్పకున్నది. ఆమెకుఁజ
క్కని కంఠధ్వనికలదు. మధ్యాహ్నమందే దేని పుస్తకమును జదివి నామ
నంబున నుల్లాసమును బుట్టించునని సంతోషించుచుంటిని. కాని, యేదియో నాకామెయం దేవను జనింపఁజేయుచున్నది. ఎంతయో కలసిఁ
గొట్టుతనముతో నుండవలెనని యూహించుచుందును. అయినను నామె
కలంకసహితమైన చూపులు తలఁపునకుఁ బాఱి వెనుదీయుచుందును.
తనకష్టకథల నాతోఁ జెప్పినప్పుడు నాకపరిమితఖేదము కలుగుచుండ నా
మెకుమాత్రము నిశ్చయమైన దుఃఖము పొడమినట్లు తోఁచదు. అప్పు
డప్పు డాత్రము నొందినట్లు కాన్పించును, గాని యదిసత్యమైనదగునో
కాదో యని సందేహము కలుగుచున్నది. ఏమో! ఆమెనడత నాకగో
చరముగనున్నది"

అరవింద కీకఁగొంచెము లోకానుభవముండెనేని యింత యాం
దోళితచేతస్కరాలు కాకపోయియుండును. మఱికొంచెము పాటి నిదా
నముతో నామె పరిశీలించెనేని కామేశ్వరమ్మ సత్యవర్తన మంతయు
గ్రహించియుండును. కానియామెకట్టి శక్తి యెక్కడిది? పాప మమా
యకురాలగు నామె జనుల బాహ్యచర్యలఁబట్టియే పవిత్రవర్తనల గ్రహింపఁ
గలను గాని యాంతర్వర్తనముల నెఱుంగుట కింకను బ్రావించి

భవము చాలను. ఇంకను రెండుమూఁడేండ్లు గడవవలెను. ఇదుమలంద వలెను.

చదువరులారా! అరవిందాదేవి మనస్సు మీకువిదితమైనదా? లేక మీరును దేవి కామేశ్వరమ్మవిషయమునవలె తబ్బిబ్బుపడుచున్న దోయటులే యిదమిత్థమని నిర్ణయింపఁజాలకున్నారా? ఆమె కెట్టియును మానములున్నను, గామేశ్వరమ్మను గౌరవముతోనే చూచుచుం డెను. ఏవిషయమునందైన నామె తనయుద్దేశములకు వ్యతిరేకముగా నున్నను, దానేపొరపడినట్లెంచుకొనునుగాని యామెయందు దోషారో పణముఁ జేయకుండెను. తనకంటె నామె ఘనతరమైనబుద్ధి కలదియని నమ్మెను. ఆమెకు లోబడియే వర్తించుచుండెను ఇట్లు వర్తించుటచే నామె యల్పబుద్ధిగలదని తలఁపరాదు. సదయహృదయయగుటచేతను, లోకానుభవమంతగా లేనిదగుటచేతను, ఆరీతిగనున్నది కాని మఱియొ కటి కాదు. విశేషించి యదియామెహృదయపారిశుద్ధ్యమును దెలుపును. నరసింహరాజునకుఁ గామాక్షికున్న మాత్రి మనుమానమును లేదు. అ తఁడు కామేశ్వరమ్మ నిష్కళంకచరితయనియే విశ్వసించెను. లోకులు కూడనామెకష్టములకుజాలిపడుచు, నామెలావణ్యమున కాశ్చర్యపడుచు నామె తెలివిదేటలకు సద్గుణసంపత్తికిఁ గడుసంతసమొందుచు నుండుట చేత నతఁడు నట్టియభిప్రాయమే పొందియున్నాఁడు. ఇంతటిసౌందర్య వతిని, యౌవనవతిని, సద్గుణవతి నేదుష్టులైనఁ జెఱుతురేమోయనిభయ పడుచుండెను. కాని యామె యనుపమానసుగుణములే కవచములై యామెను గాపాడునని నమ్మియుండెను.

ఇట్లు వారిరువురును బరమమైత్రిమైఁ జరించుచుండిరి. మూఁడు మాసములు గతించెను. ఒకనాఁడు వారిర్వురును బూఁలతోఁటలో నడ యాడుచు ననేకవిషయములంగూర్చి ముచ్చటించుచుండిరి. కామేశ్వర మ్మ యకస్మాత్తుగా నొకచోటనాఁగి యరవిందతో "అమ్మా! రాజుగారి

సాంవత్సరికములు ముగిసినపిమ్మటఁ దమకింతతీఱుబడి యుండదు...కాఁ బోలు. ఇంతయనుగ్రహము నాపైఁజూపుటకును వలనుపడదనుకొనెద ను." అని యెనెను.

అర—పూజ్యుఁడగు మాపెదతండ్రి మృతినొందియాఱునెలలు మాత్రమేకదా యైనది? సాంవత్సరికము లింకనాఱునెలలున్నవి. ఈలో పునఁ గోటలోనే వేడుకలు, వినోదములు నుండవుకదా? అటు పిమ్మట మాత్రము నిన్ను విస్మరించునంతటి విశేషోత్సవము లేమియుండును?

కామ—"ఏవైననుండును. అప్పుడు." అని నిశ్చలదృష్టులఁబు డమిపైఁబఱపి, యొక్కనిట్టూర్పునిగిడ్చి, యేదోయోజించుచు నించుక శీఘ్రగమనముతో నడుగిడఁజొచ్చెను. అరవిందయు నామెతో సమాన మైన గతిని నడుచుచు, నాపెదీర్ఘనిశ్వాసము. శీఘ్రగమనము, ముఖవి కారముఁ జూచి వింతపడమొదలిడెను.

కామే—దేవి! నాయభిప్రాయము తమకుఁదెలిసెనా? తమరి డకెగని యానందములో మునిఁగియుండి యుపశ్యాను ష్ఠేయములగు రాజకార్యములకు సైతము కాలముచాలకయుందురు. తమకు మంచి సంతోషదినములే యగును; నాకుమాత్ర మట్టివికావు.

అర—(తనసఖి పలుకుపలుకులఁగుందలి యర్థమును గొంతగ్ర హించి) నాకంతటి యానందముంగూర్చు సమయము నాప్రియసఖ వగుసీకు మాత్రమేలసంతసముఁగల్గింపదు?

కామే—ఏలయన, నాప్రస్తుతస్వభావ మట్టివినోదముల నేమి యుఁజూడ నంగీకరింపదు. నేను గాననికడఁ బడియుండఁదగినదాననే; కాని, నలువురియెదుట ముదముతో మెదలఁజాలను. కావునఁ దమతో నింతస్వేచ్ఛముగాఁ దిరుగవలనుపడదంటిని.

అర—అటులెన్నఁడుఁ దలఁపకుము. వేడుకలవెల్లిలోమునిఁగి

నిన్ను మఱచెదనని యెంచుచున్నావా? నాహృదయ మిట్టిదనియా కని పట్టితివి?

కామే—అమ్మా! క్షమింపుఁడు. తామేమియు కోపముఁ జేయుదురని కాదు. తమకు సమయముచిక్కదనియంటిని. ఏలినవారిహృదయ పారిశుద్ధ్యము నేనెఱుఁగనా? నన్నింతయు పారకృపతోఁ జూచుచుండుటెఱింగియు, దిగంతములవఱకు వ్యాపించియున్న తమకీర్తిచంద్రికలఁదిలకించియు, మఱియుఁ(అని కొంతసేపూరకుండి తడఁబడి) దమ్ముగుఱించి యొకఁడు నాచెవిలోఁ జెప్పిన పలుకు లాలకించియు—

అని మిన్నకుండెను. ఆమె కేదియో స్మృతికివచ్చెను. గుహ్యముగానుంపఁదగినదానిని వెల్లడిచేసినప్పు డెట్లుపరితపించెదరో యట్లు పరితాపపడెను. మనకథానాయిక యామెవంకఁ గ్రమ్మఱ నాశ్చర్యముతోఁజూచెను.

కామే—అయ్యో! చెప్పరానిమాట చెప్పితినే! ఏమిచేయుదును? అమ్మా! మీమనసు నొచ్చునని యింతదనుక నావిషయముంగూర్చి తలపెట్టకుంటిని. ఇప్పుడు నోరుజాఱినది.

అర—నామనసునొచ్చునా? ఏమి? అట్టియంశమెయ్యది?

కామే—ఒకసంవత్సరముక్రిందట—(అని వాక్యముముగింపకయే) అమ్మా! చిన్నప్పటినుండియు మీతోఁ బెరిఁగిన యతని క్షేమసమాచారములు మీకుఁదెలిసి యెంతకాలమయ్యె?

అర—ప్రభాకరునిగూర్చి యనియా నీయభిప్రాయము? ఏమి యిట్లు ప్రశ్నించుచుంటివి? ఏమో చెప్పుము.

కామే—ఎందునకనగా, నాప్రభాకరుఁడు నాకపరిచయుఁడు కాఁడు. మఱియు—

అర—ఏమి? నీవు ప్రభాకరు నెఱుఁగుదువా? నిశ్చయమే?—అని తీవ్రదృష్టితోఁ జూచుచుండెను. మోము వివర్ణమయ్యెను.

వెనుకటివృత్తాంతములన్నియు జ్ఞప్తికివచ్చి వేడినిట్టూర్పులు రాఁదొడఁగెను.

కామే.—అమ్మా! ముమ్మాటికి నిశ్చయమే, గాని యతఁడు చంద్రమహాలెమునువిడిచి చనినపిదప నేమైన సందేశము పంపెనేమో చెప్పరా?

అర.—అట్టి సకంతయు నెఱుకగలదు. ఈయూరు వచ్చిన తరువాతఁ దెలిసెఁగాఁబోలు? తెలియకమాను నా? అట్టి—

కామే.—దేవీ! వానిఁగూర్చి యీ ప్రాంతమునకు రాకమును పే నాకుఁదెలియును. కాని నేనడిగినప్రశ్నమున కుత్తరమొసంగఁగోరెదను. అవల నంతయు నివేదింతును.

అర.—అతఁడు మమ్ము విడిచినదాది యొక్కకుశలవార్తయైనను దెలుపలేదు. అతఁడెచ్చటనున్నాఁడో యేమిచేయుచున్నాఁడో మేమెఱుఁగము.

అని తానేకదా యతనిపోకకుఁ గారణంబని లోలోన వగచుచుఁ బొరలిపొరలి వచ్చుచున్న బాష్పముల వాఁపికొనిశిరమువంచి నిలుచుండెను

కామే.—అమ్మా! ఊరక మీమనంబుఁ గలఁచుచుంటిని. సంక్షామణమును మూర్చుకొందము.

అర.—వలదు వలదు. నీవు చెప్పఁదలఁచుకొన్న దేదియో వెంటనే చెప్పుము. వినువఱకు నా కాత్రముగానున్నది. సుఖమో దుఃఖమో, యేదియైనను దత్క్షణమే దయయుంచి చెప్పుము. ఆలస్యము చేయకుము.

కామే.—అయ్యో! ఎంత తెలివితక్కువదానను! ఊరక నోటినుండి యీమాట జాఱవిడిచితినే! ఆలోచించి మఱిమాటాడుమని పెద్దలందురు. ప్రభువులయొద్ద నెంతయో జాగ్రత్తతోఁ బలుకవలెనని చెప్పుదురు.

అవేమియుఁ బాటించితివిగానే! ఇప్పుడేమి చేయుదు? నన్ను నేను నిందించు
కొనినలాభమేమి ? ఇంతకాల మీ సంగతిని సదుద్దేశముతో దాఁప
ఱికముఁ జేసితిని, ఇప్పుడు వెలిఁబుచ్చవలసివచ్చినది.

అర—(మోమునందు విషాదముదోఁప) నీనుడులవలన నీయభి
ప్రాయము కొంతకొంత తెలియుచున్నది. పాపమా ప్రభాకరున కేది
యో విపత్తుసంభవమయ్యెఁగాబోలును; ఏదైన నాకడ దాఁపురముఁ జేయు
క చెప్పుము

కామే—సరియే. చెప్పక తప్పదు. మతిమీఱి వెడలితిని. వెనుకకు
మరలు టెట్లు ? కానిండు. చెప్పెదను వినుఁడు. తమరుమాత్రము కల
వరపడకుండనుండఁ బ్రార్థింతును—ప్రభాకరుఁడు చనిపోయెనుజుఁడీ !

అర—చనిపోవుటే ? ప్రభాకరుఁడే?—అని వడవడవడఁకుచుఁ
దాను నిలిచినచోటనే కూలఁబడిపోయెను.

కామే—అమ్మా! మిమ్ము మొదటనే కోరితిని. మీరు కలఁతఁ
జెందవలదు. నన్నూఱడించి నాకష్టములన్నియు మఱపించినతల్లివి నీవి
ట్లు విలపింపఁదగునా? నేను ప్రథమమున నాప్రసంగ మెత్తకుండవలసి
నది. అవివేకురాలను. కార్యము మించినతరువాతఁ బశ్చాత్తాపపడు
చున్నాను. ఏమి ప్రయోజనము ?

అరవిందనోటమాటలేదు. కామేశ్వరమ్మవంకఁ దదేకదృష్టితోఁ
జూచుచుండెను. ఆవల గొంతవడిఁ గన్నులుమూసికొని నిర్మలమౌక్తిక
సంకాశములగు నశ్రుబిందువుల నునుజెక్కులవెంబడి జాఱవిడిచెను.
కొన్నినిముసము లట్టులుండి గద్గదస్వరముతో నీవెఱిఁగినదంతయుఁ జె
ప్పుమని మెల్లఁగ ననెను.

కామే—దేవీ ! నాభర్త సమరభూమికిఁబోయినపిమ్మటఁ గొంత
కాలము నేనొక్కర్తుక విజయనగరములోఁ గాఁపురముంటివనితమతో
మనవిచేసియే యున్నానుగదా! సుమారు పదుమూఁడుమాసములక్రింద

నేను గాఁపురమున్న 'ద్వారకావారివీధి' లో నాయింటిప్రక్క నున్న గృహములోనే యొకగది బాడిగకుఁ బుచ్చుకొని ప్రభాకరుఁడు కాఁపురముండెను. అతఁ డెవ్వఁడో మొదట నాకుఁ దెలియదు. దినములలో, "ఖార్ గగీ" శాఖలో నొక లేఖకుఁడని మాత్ర మెఱుఁగుదును. అతఁ డెట్టి పాడుసమయమున నాయింటఁ బ్రవేశించెనో కాని, యందులో నడుగుఁ బెట్టినది మొదలు జ్వరములోనే బాధపడుచుండెను. ఇంటియజమానుఁ డుమిగులఁగఠినుఁడు. పిల్లవానికి జ్వరమువచ్చినదాది లేచిపొమ్మని యే పోరుపెట్టుచుండెను. కాని యతఁడేమిచేయఁగలఁడు? కదలలేఁడు మెదల లేఁడు. నాదాసి యాతనియవస్థయంతయు నాకు నివేదించినది. నేనసమర్థురాలను. ఆఁడుదానను. ఏమిసేయఁగలను? ఒరులేమని నిందించిన సరియేయని యతనిదగ్గఱకుఁజని యుపచారములుచేసితిని. మందులిప్పించితిని నానాఁటికి వ్యాధి యతిశయమయ్యెను. నేనే యాకుఱ్ఱనిపాలిటి దాదినైతిని. అయ్యో ! ఏమిచెప్పుదు వానివేదనము? పదిదినములట్లు బాధలుపడి ప్రాణములువిడిచినాఁడు మధ్యమధ్యమునఁ గొంత తెఱపి కలిగినపుడు నాతో మిమ్ముఁగూర్చియు, మీయింటఁ జంద్రమపాలెములో దయాళువగుమీజనకునియండఁ జేరి బ్రతుకుటనుగుఱించియు, మీయనుపమాదరముంగూర్చియుఁ జెప్పి కంటఁదడిఁబెట్టుచుండెడువాఁడు. మీనామమును వచించునప్పుడంత బాధతోఁ గొట్టుకొనుచుండియు, నించుకవికాసమును ముఖమునందుఁజూపెడువాఁడు.

ఇంతదనుక యరవింద వినుచుండఁగల్గెను గాని కడపటి వాక్యము చెవులఁబడిన పిమ్మట శోకమాఁపుకొనలేక యొక్కసారి కెవ్వున నేడ్చెను. వెంటనే పైఁటకొంగుతోఁ గన్నులద్దికొని "అమ్మా! కామేశ్వరమ్మా! ప్రభాకరుఁడు నీకుఁగడుఁగృతజ్ఞుఁడై యుండి యుండును. కాని వాని కాయువు లేదు. మాకుఁ గడుఁగూర్చునాతనికి నీవవసానకాలమున నంతటికరుణతోఁ జేసిన సపర్యలకిదే నేను వందనములిడుచున్నాను.

నాజనకుఁడును నీవుచేసిన మేలు మఱవఁడు." అని క్రిమ్మఱ రత్నంపుఁ దునుకలవంటి కన్నీటిబిందువులు కపోలదర్పణముల వెంబడి రాల్చెను. తన్ను గులాబిపువ్వడుగుటయుఁ దానుదటస్థభావముతో నూరకుంటయు, నాపై నెట్టియనురాగమున్నదని యతఁడు ప్రశ్నించుటయుఁ దాను సోదరప్రేమనుమాత్రమే వహించితినని మాఱ్వలుకుటయు, మున్నగు నంశము లామెజ్ఞప్తికివచ్చెను. ఒక్కొక్కవిషయము స్ఫురణకువచ్చినప్పుడు, దుఃఖముపొంగుచుండెను. అంతఁ గొంతసే పెదుటనున్న వస్తువుల వంక నిశ్చలదృక్కులతోఁ జూచెను. కానియావస్తుజ్ఞానమామెకు లేదు." అయ్యో! ఈదుర్వార్తవిని నాతండ్రి యెంత క్లేశపడునో! ఆతనిఁ జిన్ననాఁటి నుండి కన్నకొడుకువలెఁ బెంచినాఁడే" యని యాకసమువంక నొకపరి భూమిపై నొకమాఱు చూచుచు నిట్టూర్పులు విడుచుచు నామె కూర్చుండెను.

కామే — దేవీ! మీజనకుని శోకవార్తంబునఁ జెప్పవలదు. సహాయముగనిపట్టి మెల్లగవినిపింపవలెను. తాముకూడ నడలక ధైర్యము వహించియుండవలెను. నేను దిసికూర్చుండలేక యమ్మగారిమనమును కలఁతపెట్టితిని. అమ్మా! ప్రభాకరుఁ డుసురులు విడుచునపుడు ప్రాజ్ఞస్ఫురణతో నున్నాఁడుచుఁడీ. నాయనా! నీగతి యిట్లయ్యెఁదని నీ నెయ్యర కెవరికైన వార్తనంపనా, యనినే నడిగితిని. అతఁడు "వలదు. వలదు. నాయకాలమరణమునుగూర్చి వారువిన్న మిక్కిలిపొక్కెదరు. వృథగా వారేలనాకొఱకు దుఃఖింపవలెను? ఇప్పుడు వారీఘోరవార్త వినకుందురేని నే నెచ్చటనో జీవించియే యున్నానని తలఁచి యూరకయుందురు. కొన్ని యేండ్లయినతరువాత, నన్నుఁగూర్చి వారుతలపెట్టుట మానినపిమ్మట నాచావుమాట తెలిసినను వారి కంతవిచారము కలుగదు. అయ్యో! పాపము! పోయెనా యనిమిన్నకుందురు. కావునఁ దల్లీ నానెయ్యురకుఁ దెలియనీయకుము." అని వచించెను. అతనిమాట

లు పాటింపవలెననియే దృఢముగా నిశ్చయించుకొన్నాను; తమకు నా యందవ్యాజప్రేమ గల్గినతరువాతఁ దమతో భాషించుటకై గడుజాగరూకతతో వర్తించుచుంటిని. మీపలుకులనుబట్టి మీకేమియు వాని దుర్మరణమునుగూర్చి యెఱుకపడలేదని గ్రహించితిని. నాకోరికయును మీరటు లుండవలెననియే. మూఁడుమాసములయ్యెఁ గదా, యొక్క నాఁడైన వానిపేరు తమయొద్దఁ దలపెట్టితినా? నేఁడు బుద్ధిహీనురాల నై, మైమఱచి—

అర—అమ్మా! ఆత్మనింద చేసికొనకు. ఎవ్వఁడో యాకస్మికముగా నెవ్వరినోటినుండియో నాకుఁ దెలియుటకంటె నిప్పుడే సీయట్టి ప్రాణస్నేహితురాలి ముఖమునుండి వినుటయే మంచిది.

కామే—తల్లీ! తమ కాప్రభాకరునియం దనురాగ ముండెడిదా?—అని తాను కేవల మామె హృదయభావములతో నైక్యమొందఁగోరుచుండినట్లు తెలుపుటకుఁ బ్రశ్నఁ జేసెను.

అర—అప్పుడు వానియందు భ్రాతృప్రేమ వహించితిని. కాని యిప్పుడు—

అని కామేశ్వరమ్మచేతిని బట్టుకొని కన్నుల నీరునించి యూరకుండెను. ఆవిషయమై మఱిపల్క ననిష్టముగానున్నట్లు సూచనఁదెల్పెను. వారుభయులు రాయంచలజంటవలె సింగారపునడకలతో భవనమువైపునకుఁ బోయి, యొకకొంతసేపునకు నిందిరామందిరమును జేరిరి. కామేశ్వరమ్మ దేవియొద్ద సెలవుఁ దీసికొని తనయింటికేగెను. అరవింద యేకాంతముగా విలపించుచు, నడుమనడుమఁ దల కుంకించుచు, నొక పడకకురిచీమీఁదఁ గూర్చుండెను. అంత నరసింహరాజు వచ్చి "అమ్మా! ఏమి యట్లాలోచించుచున్నావు? మొగము దీనముగానున్న దేమి?" అని యడిగెను. అరవిందడగ్గుత్తికతోఁ దాను గామేశ్వరమ్మవలన

విన్న దంతయుఁ బూసగుృచ్చినట్లు చెప్పెను. నరసింహారాజు కొంతవడి మాృన్పడియుండి పరిపరివిధములఁ బృభాకరుని గుణములనుగ్గడిం చుచు వాపోయెను. ఇరువురును జాలసేపట్లు దుఃఖించిరి.

---

## మూఁడవ పృకరణము.

### ద్యూతమందిరము.

పాఠకులారా! మనరంగము మార్చుకొందమా? పదునెన్మిది మాసములనుండి గోదావరీమండలమందే చందృమపాలెమునకుఁ గాం డేృగులకు మధ్యసీమనే వర్తించుచున్నాముఁ కొంచెముమార్పు కల్గినఁ గాని మన కానంద మొదవదు. మనమిప్పుడు కళింగరాష్ట్రృములోని దగు విశాఖపురమండలమునకుఁ బోదమురండు. అది గోదావరీమండల మంత ఫలవత్పృదేశము కాకపోయినను, సమస్తేంద్రియానందదాయ కంబులగు శృంగారవనములకు, నుత్తుంగపర్వతశ్రేణులకు, రమణీయదే వాలయములకు నిధానమగుటచే సంతోషమును బుట్టింపకపోదు.

అది భాదృపదమాసము, మిన్నున మొయిళులు దట్టముగ న చ్చుటచ్చుట వ్యాపించియున్నవి. అవి కొన్నిచోటులఁ గుంభదోృణప ర్షముల వర్షించుచున్నవి. కొన్నితావులయందతిస్వల్పమైనవానకురియు చుండెను. చక్కని వర్షములున్న స్థలములఁ బైరులు కలకలలాడుచు భూ రమణిమేనఁదోఁచిన గగుర్పాటులవలెనొప్పుచుండెను. చెఱువులు, వాఁ గులు సలిలపూర్ణములై యుండెను. చర్మములుమాతృమే కలిగియుండి పాృణావశిష్టములై యున్న మండూకములు మరల బలిసి బిగ్గఱగా బెకబెకారావములు చేయుచున్నవి. మంచిపచ్చికను మేసి పశువులు నిగ నిగలాడుచున్నవి. చాతకంబుల పిపాసలు దీఱుచున్నవి. కార్చిచ్చుగర్వ

మంతయు నణఁగి పోవుచున్నది. నీరజబంధుఁడు తొల్లి తనకరాళీవలనఁ బుచ్చుకొన్నతోయమెల్ల మరల నిచ్చుచుండెనోయన వర్షధారలు పడుచుండెను. బీదలు తమ కుటీరము లన్నియు వర్షోదకముచేఁ గప్పఁబడి యుంటచే నిలువ నీడలేక బాధలు పడుచుండిరి. రుగ్ణులు దగ్గుచుఁ జలికిఁ దాళఁజాలక యున్ని దుప్పటముల గప్పికొనుచుండిరి. సూర్యునిఁ జూచినఁగాని భుజింపమని నియమముగలవారు, గడియ గడియ కాకసమువంకఁ జూచుచు, క్షుధ తమ్ముఁ బీడింప నింటం నందఱిపై విసుగుకొనుచు, కొందఱేమాత్రిపు డెల్లమబ్బు కాన్పించిన భానుకిరణప్రసారమే యని భ్రమపడుచు నిరుగుపొరువారలఁ బిలుచుచు వారది యినబింబముకాదని చెప్ప మఱింత నిర్వేదముతో నుండి వంటఁ బాడుసేయుచు, రాత్రి దీపముపై జల్లెడను బోరగించి యా . ంతిని దిలకించి యన్నమునుదినుచుఁ, గొందఱు ఫలాహారములు మాత్రమే కైకొని తృప్తినొందుచు, వేదనలఁ బడుచుండిరి.మబ్బువిడిచి యెండఁగాయ జగమంతయు మనోహరముగాఁ దోఁప జను లవరిమి తాహ్లాదము నొందుచుండిరి. నదీజలములు తనయందుఁ జొరఁ గావరమున మిట్టిపడని ఘనునికిఁ ప్రియజలనిధిఁడిందు పడియుండెను. కొన్నికొన్ని చోట్లఁ జదల జలదములు సాంద్రముగాఁబర్వి లోకమునకుజీవనమీయ సిద్ధముగానుండెను. కాని, ఘనులు సల్పు కార్యముల కనేకవిఘ్నములు తటస్థించుట లోకసామాన్యమే. కదా? ప్రభంజనుఁడు తీవ్రముగావీఁచి వానిని జెలాచెదరు గావించుచుండెను. అయిక్కాల నొక్క నీటిచుక్కయైనఁ బడకపోవుటచేఁ గొందఱువిరాటపర్వమును బారాయణముఁ జేసియుఁ గొందఱు వరుణుఁ బూజించియుఁ, గొంద ఱమ్మవారిని లేవఁదీసి పాటలు పాడుకొనుచు నూరివెంబడిఁ ద్రిప్పుచుండియుఁ బలువిధములగు ప్రయత్నములు చేయుచుండిరి. ఇట్టి ప్రావృట్కాలమున హిందూదేశమున నితరభాగము లెట్లున్నను, విశాఖపురప్రాంతమందుమాత్రము మంచివర్షములు కురియుచునే యుండెను.

భాద్రపదశుద్ధ చతుర్థినాఁడు విశాఖపట్టణమంతయుఁ గడు సంతసముతో నుండెను. సర్వవర్ణములవా రానాఁడు బంగారురేకులు పొదివిన మృన్మయవినాయకవిగ్రహములఁ గొని నానావిధపత్రములతోఁ బూజలుసల్పి, మహామోదముతో మోదకములఁదిని లంబోదరులై మెదలలేకయుండిరి మధ్యాహ్నమం దెల్లవారును భాగవతమునందలి శమంతకమణ్యుపాఖ్యానమును జదివియో, వినియో, యక్షతలు శిరముసందాల్చి సంవత్సరమంతయుఁ దమకు నపనిందలు రాకుండఁ జేసికొనుచుండిరి. ఆదినమున నెట్టులైనఁ దిట్టులు తినుట మంచిదని యెంచి కొందఱు పొరుగువారిండ్లపై నుండ్రములనెగరవైచుచుండిరి. కొందఱు పల్లేరుగాయలను మార్గమునందుఁ బోయుచుండిరి. కొందఱిండ్లముందఱఁ జోళ్ళ యావగింజలోఁ జల్లుచుండిరి. అట్టి మహోత్సాహదినమున రాత్రి పదిగడియల కొకసన్నని సాలువున గప్పికొని, వెండిపొన్నగల్గి యాఁదోఁకగానుండుకఱ్ఱను జేతఁబూని, కఱ్ఱచెప్పులజోడును ధరించి, గుబ్బగొడుగును వైచికొని మన వెంకటపతిరాజు రాజమార్గముననడచుచుండెను. అప్పుడాకాశమందుఁ దోయదములు ఘోరములైయుండెను. కాని తుంపరమాత్రమే పడుచుండెను. అతఁడామార్గమునఁ గొంతసేపు నడచినడచి యొకసందులోనికిమరలెను. ఆసందువెంబడిఁబోయి యనేకమైన చిన్నసందులదాఁటి తుదకు 'సభికులవాడ' యనఁబడు నొకవీధిలోనున్న యొకపెద్దమేడలోఁ బ్రవేశించెను. ఆకాలమునందుఁ బట్టణపారిశుద్ధ్యసంఘము లంతక్రమమైనస్థితిలో లేవు. రాత్రులయందు వీథులలో దీపములుంపఁబడుట లేదు. గొప్పవారియిండ్లముంగిటమాత్రమక్కడక్కడఁ గాచదీపములు వ్రేలాడఁగట్టఁబడెను. అర్ధరాత్రియందు గస్తీలు కొందఱుతప్ప రక్షకభటులైన నిప్పటివలె లేరు. వెంకటపతియాలోగిటిలోనికిఁబోవుచు 'ఈరాత్రి భాగ్యదేవతకు నాయందు దయ కలుగకుండెనేని నేనధోగతిపాలై పోదును.' అని యనుకొనెను. అతఁడు పై

యంతస్తుమీఁదికిఁబోయెను. అచ్చట నెన్నియోదీపికలు వెలిఁగింపఁబడె
ను. పట్టపగటివలెఁదోఁచుచుండెను. చిత్రవర్ణములుగల తివాసులు ప
ఱుపఁబడెను. దీపముల కాంతిని గోడకమర్పఁబడిన నిలువుటద్దములు
మిఱుమిట్లుగొలుపు తేజమున వెదఁజల్లుచుండెను. మహాలులో గుంపులు
గుంపులుగాఁ గొందఱుకూడి పాచికలో, చదరంగమో మఱియేయాట
యోయాడుకొనుచుండిరి. వారెల్లరుఁ బరమవేదాంతులకైవడి బంగారు
నాణెములను జిల్లపెంకులుగాఁ జూచుచుండిరి. అచ్చటఁ బ్రతిదినమును
వేలకొలఁదిధన మొకచేతినుండి మఱియొకచేతిలోనికి మారుచుండును.
పండుగుదినములలో లక్షలకొలఁది సొమ్ము క్రుమ్మరుచుండును. అక్కడ
గూరుచున్నవారిలోఁ గొందఱు సాధారణపుసంసారులు. కొందఱు
ధనవంతులైన వర్తకులు. మఱికొందఱుజమీనుదారులు. అందఱు నఱ
మరికలేకయే వర్తించుచుండిరిగాని తఱుచుగా సమానస్థితిమంతులే
యొకచోటఁగూడియాడుచుండిరి. మనవెంకటపతివచ్చినతోడనే "దయ
చేయుఁడు, వెంకటపతిరాజుగారు! మీరాకకొఱకెదురుచూచుచు
న్నాము. మీరేల యింతయాలస్యముం జేసితిరి?" అని యొకరనిరి. మఱి
యొకరు 'వెంకటపతిరాజుగారు వచ్చిరి. మరల మొదటనుండియు నాడు
దము' అని పలికిరి. ఇంకొకరు "వెంకటపతిరాజుగారూ! ఈదినమున
వినాయకచతుర్థియని మీకుఁదెలియునా? నేఁడు మనలో నొక్కొక్క
రు పదివేలరూపాయలకుఁ దక్కువకాకుండ వెచ్చింపవలయును." అని
నుడివిరి. వెంకటపతి చిఱునవ్వుతో సగర్వముగా "అయ్యా! ఇదిగో ధన
ము. వరాలు, కాసులు, మొహరీలు, కావలసినన్ని తీసికొనివచ్చితిని'
అని చెప్పెను. ఇతఁడు తనకిదివఱకున్న యాస్తియంతయుఁగాక భూ
తిరాజుచే నీయఁబడిన ధనములోఁ జాలవఱకుఁగూడఁ బోఁగొట్టుకొనెను.
అట్లుపోయినధనములో విశేషభాగ మీద్యూతమందిరమందే నాశ
మయ్యెను. అలనాఁడు మాలతీ యీతని వంచించి మరలఁబదివేల

రూపాయలు పట్టుకొనిపోవుట మన మెఱింగియే యున్నాముగదా! ఇప్పుడు వానియొద్ద నీభవనమునకుఁ దేఁబడిన నాలుగువేలు తప్ప మఱి యేగానియైన లేదు. అతఁ డావిధముగ ఘల్లుఘల్లుమని నాణెముల మ్రోయించుచుఁ, బైనిఁగప్పుకొనిన శాలువును దీసి యొక చిలుకకొయ్యమీఁదఁ బెట్టి, జూదమాటకుఁ గడంగెను. వాఁడువచ్చినవేళావిశేష మట్టిదియో కాని యన్నిపందెములందు వానికే గెలుపుగలుగుచుండెను. ఒకగంట లోనతఁడు తానుదెచ్చిన ధనమునకు రెట్టిగా సంపాదింపఁగల్గెను.

వెంకటపతిరాజాదు లాడుచున్న స్థలమునకావల నొకచోట నిద్దఱు ఘనులు చతురంగమాడుచుండిరి. వారిలో నొకఁడు మోఁకాళ్ళ వఱకు వ్రేలాడునంగీని దొడిగి, జరీతలపాగను ధరించియుండెను. అతఁడు దీర్ఘకాయముగలవాఁడు. బుగ్గమీసములును, జేగురురంగుగల నేత్రములును గలవాఁడు. అతఁడు గుడాకుపొగను గొట్టముగుండఁ బీల్చుచు ద[illegible]లను నమలుచు, మధ్యమధ్యమున నొకసారి చతురంగమాడుచుఁ గూరుచుండెను. అతనిపేరు శ్రీకాళరాయఁడు. రెండవవాఁడు స్థూలముగాఁ బొట్టిగానుండెను. వానిబట్టలు మిగులవిలువైనవి. అతఁడు బంగారుగొలుసుగల సులోచనములనుధరించి, పద్మాసనము వైచికొని గుబురుగానున్న మీసములపైఁ జేయినుంచి దువ్వికొనుచు, చతురంగ బలమువంక నిశ్చలదృష్టితోఁ జూచుచు, నడనడ వెంకటపతిరాజాదులపై పరాంగవీక్షణములఁ బఱపుచుఁ గూరుచుండెను. వానిపేరు రామచంద్రుఁడు. వారిరువురుఁ జతురంగమాడుచుండిరే కాని, నిజముగా వారిదృష్టులన్నియు జమీందారులు మున్నగువారాడు నాటయందే నిలిచియున్నవి. వారును స్వర్ణమును గలగల మనిపించుచుండిరి. ఊరక యాటమగట్టినఁ గాసును, ద్రోసిరాజు చేసిన రెండుకాసులును, సు[illegible] అత్రోసిరాజు చేసిన నైదుకాసులును, పరాజయ మొందినవాఁడు రెండవవాని కిచ్చునట్లేర్పఱచికొనిరి.

అచ్చటఁ బాంథికులాతురులై రిట్లు మాటలాడుకొనుచుండిరి.

ప్రథముఁడు—అన్నట్లు రామదేవవర్మగా రెట్లుండిరో?

ద్వితీయుఁడు—ఆయనకేమి ? జబ్బుగా నున్నదా ?

ప్రథ—మీ రెఱుఁగరా ? మొన్న రాత్రి యాయన యిచ్చట జాదమాషీ బసకుఁ బోవుచుండఁగా దారిలో నిద్దఱుదొంగ లడ్డుకొని గట్టిగాఁ గొట్టిరఁట. ఆయనకుఁ బ్రాణభంగముకూడ నచ్చునని భయపడిరఁట

తృతీయుఁడు—మీరు చెప్పిన దంతయు నిక్కువమే. నేఁటి ప్రాతఃకాలమున నాస్పత్రిలోనున్న వారిస్థానమునకేఁగితిని. ఆయన నాతోఁ గొన్ని మాటలుమాత్రమే భాషింపఁగల్గిరి. నేఁటి వైఖరిఁ జూడ నతఁడు బ్రదుకునను వాశ యంతగా నాకు లేదు.

ద్వితీ—ఆచోరు లెవ్వరో తెలిసినదా ?

తృతీ—తెలియలేదు. వర్మగారును వారెట్టిరూపము గలవారో చెప్ప లేకపోయిరి. అశ్వశకట మెక్కి పోవుచుండ నెవరో యిరువురు పాటచ్చరులువచ్చి గట్టిగాఁ గుద్దులఁగొట్టి బండివానిదీపము లార్పిరఁట. సారథి చబుకుతో వారిని గొట్టఁబోవ వారిలో నొకఁ డొకదుడ్డుఁగఱ్ఱతో వాని నెత్తిమీఁద నొక్కపెట్టు పెట్టినాఁడఁట. పాప మాఘాతముచే వాఁడు వెంటనే నేలఁగూలెనఁట. ఆవల వారు వర్మగారిపైఁబడి రెండు మూఁడు దెబ్బలుగొట్టి పడఁగొట్టి బండిలోనున్న ధనమంతయుఁ గొల్లపెట్టిరఁట.

ప్రథ—ఆయన నాఁడు పదుమూఁడు వేలరూపాయలు గెలుపొందెను. వాండ్రది యంతయుఁ దక్కించిరి కాఁబోలు.

తృతీ—తస్కరించిరి. కాని యాధనమంతయు నొక్కరూకయైన వారికిఁదక్కలేదు. ఏలయన, నవ్వాఁడో యొకబలాఢ్యుఁడు, పరోపకారశీలి, యాదారిని బోవుచు నీకలకలము విని. వారి సమీపమునకుఁ

బోయి చోరులను దనయొక్క సన్నలవంటి చేతులతో రెండుచెంపలు చఱచి భూపతనులంగావించి వర్మగారిని గాపాడెనఁట. తస్కరులు తమ పిక్కబలముఁ జూపి పారిపోయిరఁట.

ఈసమయమునఁ జతురంగమాడుచున్న వారిలోఁ బ్రికాశరా యఁడను వాఁడు "రామచంద్రుఁడుగారూ! కాసికొనుఁడు. ఇదేలోసి రాజు, ఆటకట్టు. రెండు కాసులిండు" అని బిగ్గరగాఁబలికెను. రామచం ద్రుఁడు "అన్నన్నా! నను గును స్వార్థముగా నాస్థానమునుండి కదల్చి తిని దానిమూలముననే యీచేటువాటిల్లినది కానిండు. మఱియొక యాట యాడుదము రండు" అని మూర్ఛలికెను. వారిరువురు నాక్రీడ యందే నిమగ్నచిత్తులై యున్నట్లుకన్పట్టుచుండిరి. ఘనతరులు మాట లాడుమాటలేవియు వారిచెవులఁజొరలేదు కాఁబోలు!

... ... ... ... ...

ప్రీథ— ఇచ్చటనుండి యర్ధరాత్రిమందు బయలుదేఱువారు రి క్తహస్తములతోఁబోక నిశితాయుధపాణులై పోవుట లగ్గగు.

వేంకటపతి— ఇదిగో! చూచితిరా! ఇది సాధారణమైన కఱ్ఱ వలెఁ గాన్పించును. దీనిలోనఁ గత్తియిమిడియున్నది. నేను రాత్రిళ్లు వెడలి యీవలకువచ్చినప్పుడెల్ల దీనిని జేతఁబట్టుకొనిదేరాను. కావున నాకెప్పుడట్టిభయము కలుగదు

... ... ... ... ...

ప్రికాశ— రామచంద్రుఁడుగారూ! తలకొట్టఁగా నిటు పోయెదు. రెండుగుక్కలు పిల్చినఁగాని మందిమొత్తు స్ఫురించకున్నది.

రామ— అయ్యా! మీకీగొట్టము నోటనున్నప్పుడు తప్పక జయము కలుగును. మీరీదినమున నక్కతొక్కి వచ్చితిరి.

ప్రికాశ— నిజమే. నాకు నేఁడు పాలకట్ట కనఁబడినది. ఏదో గొప్పలాభము కలుగవలెను.

... ... ... ... ...

పరీక్షి — వెంకటపతిరాజుగారూ! మీపద్ధతిమిక్కిలి మంచిది. కాని యీశస్త్రాస్త్రములను నుపయోగింపవలెనన్న వలనుపడదేమో?

వెంక — లేకేమి? ఇదేచూడుఁడు (అని లేచి కత్తిమొరనుండిశీఘ్రముగాఖడ్గమునూడఁబెఱికిచూపెను) ఈపలుకులకేమిగాని, మనయాటను జూచుకొందము రండు, నేను దైవకృపవలన నాసొమ్మును రెండంతలు చేసితిని. మూడంతలుకూడఁ జేసి మఱిసదనమునకుఁబోయెదను. చూడుఁడు — అని యుత్సాహముతోఁ బదపడి జూదములోనికి దిగెను.

పరీక్ష — అయ్యా! మీరుఁవిజృంభింగనక్కఱలేదు. ఒకయఱగడియలో మాధనమును మేము మరలసంపాదించుకొనుటయే కాక మీధనమునుగూడ లాగికొందుము. ఇదే కాచికొనుఁడు.

ఇట్లు పక్షులు దలుకొని యొండొరులు ద్యూతమునకుఁ గడంగిరి. ధర్మరాజును నలుని మించిన జూదరులెందఱో యుండిరి. ఆపురాణపురుషులగతి యేమైనదో వీరలగతి యట్లేయగును. కాని, వారికీర్తిమాత్రము వీరలకు వేయిపుటంబులు వెట్టిన రానేరదు. కొంతసేపటికి కాణాలో రెండుజాములగంటలు వేయఁబడెను. గస్తుతిరుగువాఁడు పురజనులను జాగ్రదవస్థయందుండుఁడని బిగ్గఱగా నఱచుచు దాడూరావేయుచుండెను. వెంకటపతి యప్పటికిఁ దాననుకొనినయట్లు తనధనమును ద్విగుణముగావింపఁగలేదు ఇంకనాడిన నున్నదికూడఁ బోవునని యెంచి 'మహాత్ములార! రెండుయామములైనది నేటికాటఁజాలింతమా?' యని లేచెను. సరియే యని యందఱనిరి. కొంచెముదూరముగనున్నవారటులే యాడుకొనుచుండిరి.

... ... ... ... ...

పరీక్ష — అయ్యా! ఈపర్యాయమును మీరేయోడితిరి. కాని

యుద్యోగులలోని సిపాయిజను జేసి మీయింట గట్టవలెనని యత్నించితిరి. తగినది కాదు

రామ—మీరు గట్టిగాఁ దలఁచిన నదియుఁ జేయఁగలను. కాని నేనుబోవలసియున్నది. క్రీడఁజాలింతమా ?

పరి కా—వలదు. వలదు. మఱియొక్క యాటయాడి ముగింతము.

రామ—వలనుపడదు. నేఁడు రామినిపూర్ణ తిలక మీవీట దామోదరదాసుగారు హరికథఁ జెప్పుదురట. అనుచు జెండ్లీసిన పైఁడిగొండ కనక రాజుగారు నాకుఁ బరమాప్తులు. వారు నన్ను రమ్మని పలుమారులు వేఁడిరి. వెడలకుండిన బాగుగనుండదు.

పరికాళ—అవును. వారీపురిలోనున్న వారిలో నిక్కువధనవంతులగు వైశ్యశిఖామణులు. ఆమెయు నాయనకు సర్వవిధముల ననుకూలయగు వేశ్యశిఖామణి. దాసుగారును ప్రసిద్ధిగలవారే. సరియే. పొండు. నేనును రావలెననియున్నది. కాని, పిలువని పేరంటమాయని సందేహించుచుంటిని.

రామ—నిజమే. తమరువచ్చుట భావ్యము గాదు. నేను బోవుదును. ఈసరికి సగముకథయైయుండును. నాకు సెలవొసంగుడు.

అని లేచి యీవలకు వచ్చుచుండెను. జయోత్సాహముతో నున్న వెంకటపతి వారినిబిలిచి, "అన్నలార! నేఁడు నాకుఁ బరిపూర్ణముగ జయముకల్గినది. కనుక నాతో ఫలాహారమునకుఁ రా ప్రార్థించెద" నని యొక సేవకుని రావించి యింతకుమునుపే తెప్పించియుంచిన కొమ్మరఁటి పండ్లగెలలను దే నియమించెను. వాఁడట్లు చేయ నందఱును సల్లాపములతో భుజించిరి. భుజించుచు వెంకటపతి "పరికాళరాయఁడుగారూ! ఎంతసేపైన మీచతురంగమే నాదితిరిగాని మా యుక్తులవంక నొకసారియైనఁ జూడరైతిరి. మా వేడుక నడులుబిన రైతిరి. అది యేమికి?" యనియడిగెను.

ప్రకాశ—అయ్యా! వాస్తవమే. నాకును దప్పికవలెనే జయ ముకల్గినది ఇంకను గెలుపొందవలెనను నూహతోఁ దదేకదృష్టితోనే యుంటిని. (అని సేవకుఁడిచ్చుపండ్లవంకఁజూచుచు) ఓయీ! నాకొక్క పండుచాలును. ఎక్కువభుజింపలేను.

ఇట్లు వారెల్లరిగినుకసనీ ఫల్గానసముద్రమునుండి తమతమబసలకుఁ జనిరి. వెంకటపతికి నిర్భరానందముదయించినది. లక్ష్మీదేవికినాయందుఁ బ్రేమము గాదయుతిప్పలేదని యనుకొనుచు, నిలుతోఁ బాడుకొనుచుఁ గత్తికఱ్ఱను త్రిప్పుకొనుచుఁ జీఁకటిలో నడచుచుండెను. కత్యాంతరము లఁగిపోచుచుండెను. తనబస సముద్రపుటొడ్డుననున్నది. ఈలోపున నెన్నియో సందులు దాఁటవలెను. ఒకచోటఁ బిమ్మచీఁకటిగానుండెను. అక్కడ నిర్జనమైయుండెను తోఫు. ప్రాతకిగుడారముల నూమిడిలోఁటగలదు. దానిని బూర్వకాలమునఁ జోక మామిడితోఁపయుండెను. చిమ్మట, యులకోడి మున్నగు వానిధ్వని యచ్చటమిక్కుటముగానుండెను. ఇంతకుఁ బూర్వమే తాము సంభాషించికొనిన రామదేవర్మగారియవస్థ వెంకటపతి జ్ఞప్తికివచ్చినది. భయముచే నాసిమీ సంచుకపులకరించెను అతఁడునలుదిక్కులఁ జూచుచుఁ జెట్లగొమ్మలయందేమాత్రపు సద్దయిన నులికిపడుచు, మరల నెదఁగుదురుపఱచుకొని, గొంతుకసవరించుకొని, యేజావళియో పాడుచు దండముతో నేలనివాఁగఁగొట్టుచు, నడుగిడుచుండెను. ఇప్పుడతఁడొారనుండి కత్తినూడఁదీసి కుడిచేతఁ దాల్చి నడచుచుండెను. తనవంటిధీరున కట్టి వెరపుతగదని యనుకొనుచు, నప్పుడప్పుడు నిసకుఁగల్గుచున్న భ్రమకుఁ దన్నుఁదాను నిందించుకొనుచు, ముందడుగిడి పోవుచుండెను. చీఁకటి, మబ్బు, చెట్లనీడలు, నిర్జనత్వము, దొంగలుకొట్టుదారి, గుఱ్ఱపుబండిలోనున్న సౌమ్యమునుసిఁ బోటచ్చరులుకొట్టినకథ, తనయొద్దనెక్కువసొమ్ముండుట—ఇవియన్నియు వెంకటపతికిఁ దలపునకు వచ్చుచుండెను. మనంబెంతదిక్కుఁబట్టఁదలఁచినను ధైర్యముచాలకున్నది. ఎటులో

యప్రయత్నముగా నడుగులుమాత్రము ముందునకుఁ బడుచున్నవి. అత్తఱి నెవ్వఁడో యొక్కఁడు పరువున వెనుకనుండివచ్చి వానిరెండుచేతులను గట్టిగాఁబట్టుకొనెను. అతఁడొకదెబ్బకును నిలువఁబడకుండ నాదొంగ యాతనిఁ దనచేతులతో నొక్కిపెట్టెను. కాలపాశముచేఁ గట్టఁబడి పోయినవానిగతినుండి వెంకటపతి యొకబొబ్బ పెట్టెను. వెంటనే మఱి యొకఁడువచ్చి వెంకటపతి రెండుకాళ్ళునుబట్టి బలిమిని లాగెను. పాప మతఁడు చాఁపచుట్టగఁబడెను. దొంగ లతనినడఁచిపెట్టి మొలనుగట్టు కొన్న నాణెములసంచినివిప్పఁ జూచుచుండిరి. వెంకటపతి 'భటులారా! దొంగలు, దొంగలు. రండు రక్షింపుఁడు' అని నెలుఁగెత్తి యఱచెను. ఒకదొంగ యాతనినోరు నొక్కుచుండెను. ఇంతలో నొకమహాపురుషు డు దీపముచేతఁబూని శరవేగమునవచ్చి హస్తమందలిదండముతో నా ముచ్చుఁగాండ్రను మోఁదెను. వారు తత్క్షణమే వెంకటపతినివదలి యుఱికిపాఱిరి. ఆనూత్నపురుషుఁ డాతనియాపత్తుఁ బాపఁగలిగినందున కు సంతసించుచు 'అయ్యా! ఆదుర్మార్గులు మిమ్ముఁగఠినముగాఁ గొట్టి రా యేమి?' యనియడిగెను.

వెంక—అయ్యా! నాప్రాణదాతవగు నీకునమస్కారము. వా రు నన్నుఁ గొట్టిరి కాని, తీవ్రఘాతములు తగులలేదు. తమరెవ్వరు?

పురు—మీకంఠధ్వని నేనువినినట్లున్నది. అయ్యా! మీరు వెం కటపతిరాజుగారా?

వెంక—అవును. తమరెవ్వరు? మీమోముం గనిన నటులే జ్ఞప్తి యున్నది. అయిన నానవాలు పట్టఁజాలకున్నాను.

పురు—(వానిచేయిపట్టుకొని) నాతో రండు ఇదిగోదారి—

అని యాతనిని దీసికొని రాజమార్గమునఁ బ్రవేశించెను. అచ్చట నొకరియింటియెదుటనున్న దీపపువెలుతురున నిలిచి తనమొగమును జూపి 'అయ్యా! నేనెవఁడనో యెఱుఁగుదురా' యనెను.

ద్రాపి. ముఖము సహజముగా షోడశకళాపరిపూర్ణమైన చంద్రమండ
లమువంటిదే. కాని, ఇప్పుడేమి కారణముననో యేఘచ్ఛన్నంబైన శశి
బింబము బోలియుండెను. మందహాసశోభితమై యుండవలసిన యావద
నము దీర్ఘాలోచనసూచకమైయుండెను. అతఁడు తక్కిన యాటగాండ్ర
వలెఁ జేరుచుఁ బరిహాసపుమాటలాడుచు నాడక, మూఁగవానివలె, నర
సకునివలె నాడుచుండెను.

సాలూరుప్రభువును జూచినంతనే వెంకటపతి కత్యుత్సాహ
ముదయించెను. వెలుగు నతఁడెంతసంతోషవిరహితస్వాంతుఁడవలెఁ గా
న్పించుచున్నను ధనము స్వాయత్తమగునట్లు నెవఁడీయఁడు తనవలెనే త
ఱచుగా నోడిపోవునని యెంచెను. అప్పుడు వెంకటపతి యాప్రభువునకు
బ్రతిపక్షియై యాడుచుండెను. మొదటిమాటలో సాలూరురాజే గెలిచె
ను. వెంకటపతి యోడెను. నాఁటికి బట్టలాట సంతసముగ ముగిసెను. జ్యోతిష్య
ము నందలి శాస్త్రిగారి నమ్మకమే యడుగు దప్పించి పోగడెను.

ఈసమయమునఁ గొంతదూరమున నిచ్చటియట్లు ప్రకాశరాయ
రామచంద్రులు చదరంగమాడుచుండిరి. వెంకటపతి వారివంక నను
మానపుఁజూపులఁ జూచెను. కాని వారిమోములు నిమ్మళములు
గానే చూపట్టెను. తండ్రి భ్రమయేమని యడుగుదమన్నను వారిరువు
రును, పావులు గొట్టుచు నొండొరులకు మార్చుకొనుచుఁ గ్రీడించుచుం
డిరి.

ఆదిని వెంకటపతియే జయముఁగాంచుచు మొహరీలు దొంతర
దొంతరలుగాఁ దనవశముఁ జేసికొనెను, తర్వాత జయలక్ష్మి సాలూ
రుఁజేరి వరించినది. గెలుపు వెల్లువ యెప్పుడు నొక్కరీతినే ప్రవహించు
నా? అది యిప్పుడు మరలినది. అయినను వెంకటపతి నిరుత్సాహి
గాలేదు. జ్యోతిషము తప్పక నెఱవేఱునని నమ్మికగలదు. సాలూరు
నృపాలునకు జయము కలిగినప్పుడు సంతోషమొదవలేదు. ఓటమికలిగి

నప్పుడు విచారముపుట్టలేదు. అతఁ డుభయావస్థలయందును సామా న్యముగనే యుండెను. వెంకటపతి యింకను వెనుదీయక ఘనముగాఁ బందియములొత్తుచు వాయించుచునే యుండెను వానియొద్దనున్న నాణెముల దొంతులు క్రమముగా క్షీణించుచుండెను వాని ముఖవికాసమును క్షీణించుచుండెను. అందఱు నలసిరి. కొంతవిశ్రాంతిఁ దీసికొనఁదలఁచి ఫలాహారములు తే భటులకాజ్ఞ యిచ్చిరి. వారట్లు తే నెల్లరు భుజించు చుండిరి. అత్తఱి వెంకటపతి తనకు రాత్రి సంభవించిన యాపత్తును గూర్చి సవిస్తరముగ రసపోషణముచేసి తెల్పెను. కాని తన్నుఁగాపా డినవాఁడు తనకుఁ జిరపరిచయుఁడైయుండుట మాత్రము తెలుపకుండెను.

ఒకఁడు—ఏమీ? ఆశ్చర్యము! వాఁడు వర్మగారినటులే యెదు ర్కొనిరి. కాలము విడ్డూరముగా నున్నది.

రెండవ—అయ్యో! మీరాయుధపాణులై యున్నారుగదా. వాండ్రెట్లు మిమ్ము నదిరింపఁగల్గిరి ?

వెంక—మీతోఁ జెప్పితినిగదా. ఒకఁడు వెనుకనుండి వచ్చి తటాలునఁ బట్టుకొన్నాఁడు. వాఁడు నాకన్న బలీయుఁడు కాఁడు. కాని, మంచిపట్టు వానికి దొరకినది. దానిని విడిపించుకొనుటకు నాకు సాధ్య మైనది కాదు.

ప్రకాశ—అయ్యో! చాలవింతగా నున్నది. ఈపట్టణమునఁ జోరులు విచ్చలవిడిగాఁ జరించుచున్నారు కాఁబోలు. నాకును గాడి వారివీథిదివర నిద్దఱు మనుష్యులు కాన్పించిరి. మామిడితోఁటవఱకు నన్ను వెంబడించివచ్చిరి. నేను వెనుకకుఁదిరిగి ధైర్యముతో "ఎవరురా మీరు?" అనియడిగితిని. వాండ్రు 'మేము కాపుల'మని తత్తఱపాటు తోఁ జెప్పుచు నాతోఁటలోఁ దూఱిరి. నేనుగూడఁ బదువెత్తి వారలఁ బట్టుకొనుట మంచిదని తలఁచితినిగాని, దామోదరదాసుగారి హితబోధ మించిపోయెనేమో యని నాదారిని నేఁబోయితిని.

ప్రకాశరాయఁడు హరికథమాట చెప్పఁగానే యందఱును మెచ్చియు, మఱియుఁ బట్టణమందలి యితరస్థలములజరగు గణపతిమహోత్సవములఁ గూర్చియు, సంభాషింపఁదొడఁగిరి. మరల వారాటలోఁ బ్రవేశించిరి. వెంకటపతికింకను బరాజయమే సంభవించు చుండెను. ద్వితీయయామము ముగిసినట్లు గంటలచప్పుడతనికిఁ దెలిపెను. అప్పటికతని దగ్గరనున్న ధనమంతయు వ్యయమయ్యెను. గెలుపంతయు సాలూరురాజుదే. వెంకటపతి "రాజుగారూ! నేను బసకుఁబోయి ధనము పట్టుకొని వచ్చెదను. అంతవఱకు నిరీక్షించుచుండుఁడు" అని యనెను. రాజుగారు "అయ్యో! తమరింటికి వెళ్ళవలెనా? మీకుఁ గావలసినంత సొమ్మును నేను బదులిచ్చెదను. నాయొద్దఁ బుచ్చుకొని యాడుఁడు. రేపు మరల నియ్యవచ్చును. తొందరయేమి?" అని మార్వలికిరి. వెంకటపతి యందులకియ్యకొని మైసువేలరూపాయ లప్పిమ్మని యడిగిపుచ్చుకొనెను, మరల నింకవేడుకతో నాట యారంభమయ్యెను. ఇంకను వెంకటపతికే యపజయము కల్గుచుండెను. వానిమొగమునఁ గత్తివాటునకైన నెత్తురు లేకుండెను. నిర్భాగ్యదేవత తన్నిట్లు పీడించుచున్నందునకు గోపముచేఁ బండ్లు పటపటఁ గొఱుకుచుండెను. రాజుగారి నొకకబళమున మ్రింగవలెనని యున్నది. కాని తన తీవ్రమనోవికారమును జూపుటచేఁ దనకేనష్టమున్నది. డంబములుగొట్టి గౌరవముగా బ్రదుకుచున్నాఁడు. ఇప్పుడు తనగుట్టు బట్టబయలై తాను గానునకుం గతిలేనివాఁడని తెలిసినఁ దన పరపతిపోవును. అందుచే మనసుఁ గుదియంబట్టి యతఁడూరకుండెను. మనోవేదనచే వానికి ముచ్చెమటలు పోయుచుండెను. డగ్గుత్తికతో మాటలాడుచుండెను. వాఁడు నలుగురిలో నగుఁబాట్లకు లోనగుట తటస్థించునని భయపడెనుగాని, లేనిచోఁ దనకుఁగల్గిన గొప్పనష్టమునకు వానిమందిర మంతయు నల్లకల్లోలముగాఁ జేసియుండును. అంత మూఁడవజాము కూడ ముగిసెను. సాలూరుప్ర

భువు సహజమైన మృదుభాషణములతో 'నెయ్యులారా! నేటికి మన
మాటను జాలింతమా?' యని యడిగెను. వెంకటపతి బదులు తెచ్చుకొ
నిన మైదువేలును గోల్పోయెను. ఉడుకుంబోతుదనముతోనుండి మా
టలాడ లేకపోయెను. కొంతవడికి 'ప్రభువుగారూ! తమసెలవైన రేపు
మరల నాడి నేను బోగొట్టుకొనిన ధనమే కాక మఱంతసొమ్మును దమ
యొద్ద గెలువవలెనని యున్నది' అనిపలికెను.

ప్రభు—ఓ, పరమసంతోషము. ఆలాగుననే కానిండు. కాని
యిక్కడగాదు. రేపు నాస్నేహితులైన మూడుగుల రాజుగారు, జయ
పురపురాజుగారును సాయంసకు "మోతీమహాల్"నకు వచ్చెదరు. వారితో
మీరుకూడ నాకతిథులరై మాగృహంబునకు విజయము చేసితిరేని
నాకు మహత్తరమైన సంతోష మొదవును. మీరు కోరిన ట్లాడుకొను
టకును సమయము చిక్కును.

వెంక—తమరంత మహాకృపతో నన్నాహ్వానముఁ జేయు
నపుడు రాకుందునా? తప్పక సెలవుప్రకారము వచ్చెదను. కాని, విస్తార
ధనముతోఁ బ్రభువులు వారేఁగుచున్నారు. కడు జాగరూకులై పో
వలెను.

ప్రభు—శస్త్రపాణులైన నాభటులు శకటముతో నావల
నాకొఱకు వేచియుందురు. నాకేమియును భయము గలుగదు.

అందఱును దమతమ గృహములకుఁ జనిరి. ప్రకాశరాయఁడును
రామచంద్రుఁడును మఱియొక గడియవఱకాడి తమదారిని బోయిరి.
వెంకటపతి బసకుఁబోవుచు మామిడిదొడ్డిదగ్గఱకు వచ్చినప్పుడు, నిన్న
జరిగినదంతయుఁ దలఁపునకు దెచ్చుకొనెను. నేఁడు తనకంటె దరిద్రు
లైనవారుగాని తన్నదుర్కొనరని తలఁచి నిర్భయముగాఁ బోయెను.
ఇంటికిఁజని పాన్పుపై శయనించెను; గాని నిద్దురపట్టలేదు. "అయ్యో!
ఈదుర్వ్యసనమునకు లోనయి సొమ్ము వమ్ము చేసికొంటినే! ఇప్పుడు

నాకేదిదారి! పోయినధనము మరలనాకెట్లు లభించును? గౌరవనీయుఁ
డగు పుడమిఱేని యప్పును దీర్చుటెట్లు? నాయొద్ద మూఁడువేలు
మాత్రమే యున్నవే! తక్కువయగు రెండువేలెచ్చటఁ దేఁగల
ను? ఆడితప్పితినేని నలువురిలోఁ దలవంపులగునే!" అని విచారించుచుఁ
గండ్లు తెఱచికొనియే యుండెను. అంత 'వెంకటపతీ! నీకర్మఫలము నీ
వనుభవింపక దీఱ"దని ముమ్మాఱునొక్కి చెప్పినట్లు 'కొక్కొరొకో"
యని కుక్కుటములు కూయసాగెను, జనుల కలకలము విననయ్యెను.
వెంకటపతి నిద్రపట్టక శయ్యనుండిలేచి యావలకుఁబోయెను. అహ
ర్ముఖోచితకృత్యముల నిర్వర్తించి యొకపడకకుర్చీమీఁదఁ గూర్చుండి
యతఁడిట్లు తలపోయసాగెను. "అయ్యో! నే నవివేకశిరోమణినే; వృథ
గాఁ బదివేలరూపాయలను మాలతికేల యిచ్చితిని? ఇప్పుడవి యుం
డిన నెంతబాగుగనుండును! అది నాకొఱకుఁ బనిచేయుచున్నదా? వట్టి
మాట. అదెక్కడ చేయును? తనపన్నుగడనుగూర్చి యొక్క వార్త
యైనఁ బంపినదికాదు గద! అది సజీవురాలై యున్నదని మాత్రము
వింటిని. ఆహా! ఇప్పుడామెను మొన్నరాత్రి నేను వానిఁ గలసికొం
టను గుఱించి తెలుపుటమేలగునేమో! నిజముగా నామె నాకై పని
చేయుచుండిన,నీవార్త నామె కెఱుకపఱుచుటయే లెస్స ఈసాయంకాల
మునఁ గ్రిందను మీఁదను బడియైన నష్టద్రవ్యమును సంపాదించితినా,
నేను గోటలోఁ బాగవైచితిననుటయే. లేక వేఱువిధంబుగ నుండునేని
యావంక నా యాశలు భస్మముగ నాశమునొందును. (ఆవంక నఁగా
నరవిందవంకయనుట) అప్పుడు మాలతి సుంతసములు మాటఁగల
యును. ఆమెజీత్తు లుత్తవియగును. వెంకటపతి బీదవాఁడై—ధనమం
తయుఁ గోల్పోయి—కాసునకుం గతిలేక—చిప్ప చేతికివచ్చి—వాడ
వాడల బిచ్చమెత్తుకొనుచున్నాఁడని దుర్యశస్సు నాకుఁ గల్గునుగాఁ
బోలు. ఓమాలదైవమా! అడుగుకొనితను యుండకొడుకులను గాపాడి

నావంటి కులీను నుపేక్ష చేసెద వేమిరా? నేను నీ కేమివిషముఁ బెట్టి తిని?"——ఇంతలో నతని సేవకుఁడువచ్చి 'అయ్యా! తమ కొఱకెవ్వరో యిద్దఱు పెద్దమనుష్యులువచ్చిరి. సెలవయినఁ దీసికొనివత్తును.' అని చె ప్పెను. అతఁడు నిర్వేదముతో "సరియే. తీసికొనిరమ్ము" అని వారికై యెదురు చూచుచుండెను. అప్పుడు ప్రకాశరాయ రామచంద్రులతో నొకరు ప్రవేశించెను. 'వీరికి నాతో నేమిపని? ఈప్రభాతమున వీరలు నాయొద్ది కేల రావలె?' నని వెంకటపతి యత్యాశ్చర్యముతో ననుకొనుచు 'స్నేహితులారా! దయచేయుఁడ'ని వారలను దనదగ్గఱనున్న యాసనములమీఁద నాసీనులఁ గావించెను.

ప్రకా——వెంకటపతి రాజుగారూ! ఇంత యరుణోదయమున వచ్చి మీయమూల్యకాలము నాక్రమించినందులకు క్షమింపుఁడు.

వెంక——నాకు మీరాక యేమియు నష్టము లేదు.

వీరలు తన కేమేని సాహాయ్యమును జేయఁగల రేమో యనునాశ యతనికిఁబుట్టెను. వారువచ్చినపని తెలిసినతరువాతఁ దనగోడవ చెప్పు కొనవలెనని యనుకొనుచుండెను. కాని వారికి ముందుగా నల్పాహారము లొసఁగి వారిమెప్పును బొందఁదలచిఁ 'ఓరీ! సేవకా! వంటచేయు వాతని మంచిరొట్టెలుచేసి పట్టుకొనిరమ్మనుము.' అని యాజ్ఞాపించెను. అచిరకాలములోనే రొట్టెలు తేఁబడెను. అతిథులిరువురును మొగమోట మించుకయేనియు లేక భుజింప నారంభించిరి. వంటలవాఁడెన్ని రొట్టెలఁ దెచ్చిన నవలీలఁ దినివైచుచుండిరి. ఆతిండిపోతుల సామర్థ్యమునకు వెంకటపతి వెఱఁగుపడుచుండెను. వారు తమశక్తివంచనము లేకుండ భోజనములుచేసి, చేతులుఁగడిగికొని కూరుచుండి తాముచ్చినపనిఁ దెలుప గమకించుచుండిరి. ఒండొరు లంగీకార సూచకములైన చూపులఁ జూచుకొనిరి. కనుసన్నలఁ జేసికొనిరి.

---

## అయిదవ ప్రకరణము.

ప్రకాశరాయఁడు రామచంద్రులు.

ప్రకాశరాయఁడే మొదట మాటాడనారంభించెను. కాని యతఁడు పెదవి కదల్చుటకుఁ బూర్వ మోరచూపులు తన నెయ్యుని పైఁ బఱపి యతని యనుమతిని దెలిసికొనెను. వారు నేత్రావధానమును జేయసమర్థులు కావునఁ దమమనోభావముల నొండొరుల నయనచలనములనుబట్టి యెఱుఁగఁగలరు ఇప్పుడు తాను బ్రదర్శింపఁబోవు నాటకమునకుఁ బ్రకాశరాయఁడు సర్వవిధముల సర్హమైనపాత్ర. అతఁడిట్లు భాషింపఁ దొడఁగెను.

ప్రకా—వెంకటపతి రాజుగారూ! మీతో మేము మాయయు మర్మమును విడిచి మాటలాడుచున్నాము. ఈనాల్గుగోడల నడుమ మనమాడునుడులు పరమరహస్యముగా నుండవలెనుజుడీ. మన మేమియు భాషింపనటులే వర్తింపవలెను. రామచంద్రుఁడన్నా! మాయభిప్రాయ మంతి యేకదా?

రామ—అంతియే. సరిగా నంతియే. అన్నా! చెప్పవలసినది వేగిరము చెప్పుము.

ప్రకా—అయ్యా! మీకుఁ గొంచెము ధనవిషయమై కష్టములు కలవుగదా? (అ...గా' దస్తుఁకు (నిక్కచ్చి' గానున్నది కాదా?

వెంక—అయిన నేమి? ఈప్రశ్నమున మీయూహ యేమి?

ప్రకా—నాయూహ మీకు సొమ్మునకుఁ (నిక్కచ్చి' గానున్నదని యే. అన్నా! అదియేకదా మన యుద్దేశము?

రామ—అవు నదియే. వెంకటపతిరాజుగారూ! మాయన్న యేమిపలికినను మాయిరువుర యభిప్రాయమని యే నమ్ముఁడు. ఆయన నైపుణ్యముతో నుపయోగించిన (నిక్కచ్చి' యనుమాట సత్యము.

వెంక — (నిర్వేదముతో) ధనమునుగూర్చి చిక్కులే పడుచు న్నాననుకొనుఁడు. ఆసంగతిమీకేల? మీరు నాకేదేని సాహాయ్యము చేయఁగలరా ?

రామ — ఆయభిప్రాయముతోడనే మీకడకు వచ్చితిమి, అం దునుగూర్చి సవిస్తరముగ మాయన్న వాకుృవ్వఁగలఁడు.

వెంక — సరియే. ప్రకాశరాయఁడుగారూ! మీరు చెప్పఁదలఁ చినది త్వరలోఁ జెప్పుఁడు. నాకావలఁ గొంతపనియున్నది.

ప్రకా — అయ్యా! తొందరపడకుఁడు. 'శాంతమ్ భూషణమ్' అని పెద్ద లందురు. అట్లయిన మీరు సొమ్ముపిషయములోఁ జిక్కులు పడుచున్న ట్లొప్పుకొనుచున్నారు. ఒప్పుకొన కేమిచేయుదురు ? నాకు ను మాయన్నకును సేరళసాముద్రికశాస్త్రములు బాగుగాఁ దెలియు ను. నిన్నరాత్రి సాలూరురాజుగారు మీధనమంతయు నాకర్షించుకొ న్నట్లును మీ ముఖవిలాసమును బట్టియే మీయవస్థను మేము గ్ర హించితిమి. అన్నా ! కాదా ?

రామ — అవును. నిశ్చయము. అప్పుడే మీస్థితి మాకవగత మైనది.

వెంకటపతికీసంభాషణ మేమియుఁ గిట్టుటలేదు. కోపముచేత మోము జేవురించుచుండెను. కాని యినితగినయదనుగాదని దాసినడఁచు కొని "మిత్రులారా! మీరిట్లు 'అసావాదిత్యోబ్రహ్మ' యని చుట్టిచుట్టి చెప్పక త్వరితముగఁ జెప్పఁ గోరెదను. వ్యవహారవిషయైక సంభాషణ మతిసంగ్రహముగ నుండవలెను. మఱియు వృథాగాఁ గాలయాపన మగుచున్నది" అని చెప్పెను.

ప్రకా — అయ్యా ! మీకు విసుగు గల్గింపనేల ? చెప్పెద నాకర్ణింపుఁడు. ఇన్నినాళ్ళనుండియు మీగెలుపోటముల శ్రద్ధతో

బరిశీలించుచున్నాము. ఒక్కనాఁడు దక్క మీాకు జయము కలుగలేదు గదా? ప్రస్తుతము మీాయొద్ద మీా మేనమామ యిచ్చిన యేఁబదివేల రూపాయలలో నొక్క దమ్మిడియైన లేదనుట నిర్వివాదాంశము కదా! మీా రేస్వర్ణవిద్యనో యెఱిఁగియున్నఁ దప్ప గౌరవముగా దినములు గడుపలేరు. అన్నా! అంతియే కాదా"

రామ—వాస్తవము. స్వర్ణవిద్య యీాయన కెట్లు రాఁగలదు?

వెంకటపతి లోపల. బంగ్లు పటపటఁ గొఱుకుచు 'అయ్యా! అంతయు నిక్కువమే యనుకొందము. మీారు నలువఁదలఁచిన సాయ మేదియో వెంటనే తెలుపుఁడు' అని యడిగెను.

ప్రకా—అలాగున రండు. మీారు సాలూరురాజుగారి కీయవలసిన మొత్తము మీాయఁగలరా యీాయలేరా? దాఁపక చెప్పుఁడు.

వెంక—ఈలేనని చెప్పితినని యనుకొనుఁడు. మీా రేమిచేయఁ గలరు?

ప్రకా—ఏమియు నియ్యనని యనకుఁడు. మూఁడువేలు మాత్రి మీాయఁగల రనుకొందును.

ఈపలుకులువిని వెంకటపతి యత్యాశ్చర్యపడెను. తనయొద్ద నున్న రొక్కము సంతిసరిగా నెట్లు తెలిసికొనఁగల్గెనాయని యాలోచించుచుఁ గైకిమాత్ర మేమియు మాటలాడక యుండెను.

ప్రకా—అయ్యా! చూచితిరా? మేమెట్లు మీారహస్యములు గ్రహింపఁగల్గితిమో! మాయొద్ద నష్టియద్భుతవిద్యయున్నదని మొదటనే మనవిచేసితిఁ గదా? గతించినరాత్రి మీా వదనవైఖరి, పలుకుల తీరు, నడకనరణిఁ గనిపట్టియే మఁడి యిట్లుకనుంగొనఁజాలితిమి! నిజము చెప్పెదను వినుఁడు. మీారు మొన్నరేయి నాలుగువేలు తీసుకవచ్చిరి. మూఁడంతలు గెలిచిరి. నిన్నరాత్రి సాలూరుప్రభువుతోఁ దొమ్మిది వేలుపెట్టి యాడిరి.మఱియు మీారంతయునోడి యింటికిఁబోయి తావలసి.

సొమ్ముఁ దెత్తుమనిరి. కాఁబట్టి మీరు గెలుపొందిన పండ్రెండు వేలలో
మూఁడుమాత్రము లోఁగిట దిగవిడిచి యుంచురని మేమంచన వైచితి
మి. మాయంచన సరియయ్యె. అన్నా! అంతియే కాదా?

రామ—నిశ్చయముగా నంతియే. మన లెక్కలు తప్పుటయే?

వెంక— అట్లయిన నేను సాలూరురాజున కీయవలసిన యైదువే
లొక్కసారియే యిచ్చుటకుఁ దక్కుఁగల రెండు వేలును బనులిత్తు మం
దురా? లేక యేదైన మార్గమునుజూపఁ దలఁచితిరా?

పరి—బను లీయఁగలమా? అది చేయలేము. ఆధనము
సమకూరు మార్గమును జూపెదము. అన్నా! అదే కాదా మనము
చేయఁగల సాయము?

రామ—అవునదియే, అంతకంటె నేమియుఁ జేయఁజాలము.

వెంకటపతి పూజనీయుఁడగు రాజు ఋణముట్లు తీర్తునా యని
యాలోచించుసమయాన నయాచితముగ నిట్టి సాహాయ్యము తనకు
దొరకినందుల కతిమోద మందెను. నూత్నాగతులును నొండొరు
లపాంగవీక్షణములఁ జూచికొనిరి. వారిమాటల చమత్కృతి, చూపుల
పొంకము చూచి వెంకటపతి వారు సాయమొనర్పఁ గలరా యని
సంశయించుచుండెను.

పరి—అదిగో! మరల నేమో మీ రాలోచించుచున్నారు.
అది యేదియో చెప్పనా? మీకట్టి సంశయ మేల? మీకు సాయము
చేయలేని యెడల నేల మీకడకు మేము వత్తుము? మేమెంత బీద
వాండ్రమైన నామాత్రపుసొమ్ము మీకు బదు లిప్పింపలేమా? అన్నా!
మన కింతమాత్రపుధనమును సంపాదించు టొకకష్టము కాదు కాదా!

రామ—ఏమియుఁ గష్టమైన పని కాదు. కాని యింక నాలస్య
ముచేయక యీ మహమ్మదీయునిగుఱించి చెప్పుఁడు.

పరి— నేనును చెప్పఁబోవుచున్నాను. వెంకటపతిరాజు

గారూ! ఈయూరిలో నొక మహమ్మదీయవర్తకుఁడు గలఁడు. అతఁడు నూటికి కేఁబదిచొప్పున వడ్డి పుచ్చుకొనుటయే కాక, సకాలములోఁ జెల్లింపనియధమర్ణులను గారాగృహమునకుఁ గూడఁ బంపుచుండును. అతఁడట్టి కార్యదక్షుఁడైనను మాయెడ మాత్రము స్నేహభావము వహించి యున్నాఁడు. మేము గీచినగీటు దాఁటఁడు ఇప్పుడు మేమిద్దఱము నతని యొద్దనుండియే వచ్చుచున్నాము. మీస్థితియంతయు నతనికి నివేదించి రెండువే లెట్లయిన మీకప్పియక తప్పదని చెప్పితిమి. నెలలోఁ దీర్చి వైచుపద్ధతిని మూఁడువేలకు మీరు పత్రము వ్రాసిన మీకాధనమిత్తు నని యతఁడు వాగ్దానము చేసియున్నాఁడు

వెంక——సరియే. ఇంతసేపటికిఁ దెచుల్చి చెప్పితిరి కాని మీరి ట్లప్రార్థితముగ నాకు సాయముఁ జేయఁ గడంగుటలో మీయభిప్రాయ మేమి ?

ప్రికా——లౌకికవ్యాపారమన నిట్టిదేకదా ? మేము పరమలౌకికులమని మీ రెఱుఁగరా? మఱియు మీస్నేహము సంపాదించి మనము ముగ్గుర మొక్కటిగఁ జరింపవలెనని కోరికతో నిట్లు వచ్చితిమి.

వెంక——మీయుద్దేశము నాకంతగా ద్యోతకము కాలేదు.

ప్రికా——మీకు మా యభిప్రాయములు తెలిసిన నేమి, తెలియకున్న నేమి ? మీకా తురకయొద్ద బదులు కావలెనా, అక్కఱలేదా ? చెప్పుఁడు.

వెంక——అయ్యో ! చెప్పక కావలెను.

ప్రికా——బాగు అన్నా ! బాగుకాదా ?

రామ——ఇంకను మెల్లఁగా నంటవా ? మిక్కిలి బాగు మిక్కి మిక్కిలి బాగు. మఱి మఱి మిక్కిలి బాగు. ఎన్ని విశేషణములైన జేర్పవచ్చును.

పత్రికా—సరియే. ఇక్కడ కిది తేలినది. అయ్యా! మీకీసాయం కాలమున సొమ్మొందిపోవును. మీరు విందుఁ గుడుచుటకై సాలూరు రాజుగారి లోఁగిటికిఁ బోవునప్పుడు దానినిబట్టుకొని పోవచ్చును. వారు మీయిద్దఱి నాహ్వానముచేసినట్లు కాన్పింపదు. అన్నా! కాదా?

రామ—లేదు. పిలువలేదు. మఱచిపోయియుందురు, అన్నా! వేళ మించిపోవుచున్నది. తరువాతఁ జెప్పవలసిన విషయములఁ జెప్పుము.

పత్రికా—అయ్యా! మీరు 'మోతీమహాల్' లో నాతిథ్యము ను స్వీకరించినపిమ్మటఁ బ్రభువుతో నాటకుఁ గడంగుదురుకదా! మీ రు మరల నప్పుచేసియే యాట ప్రారంభింపవలెనుగదా? ఒకవేళ మీనష్టమును గప్పి పుచ్చునంతటి మొత్తమును మీరు గెలువలేకపో వుటయే కాక, విస్తారధనము నప్పటియ ట్లోడిపోవుదు రనుకొందము. అప్పుడు మీ రేమిచేయ నిశ్చయించుకొంటిరి? అంతటితో వెంకటపతి రాజుగారు 'దివాలా' తీయవలసినదే? మీ రేనూయియో గోయి యో చూచుకొన వలసినదే? అన్నా! అంతియే కాదా?

రామ—అంతకం టె మఱేమి చేయఁగలరు? కానిమ్ము. దీనికిఁ బ్రతిక్రియకూడ వడిగాఁ జెప్పి ముగింపుము.

పత్రికా—ఇదిగోఁ జెప్పుచున్నాను. మిత్రమా! ఓడిన మీకుఁ జాలఁ గష్టము సంభవించును. గెలిచిన నమితానంద మొదవునని నేను వేఱ చెప్పవలెనా? సాలూరురాజున కేమికొదవ? కావలసినంత ధనమున్నది. చక్కఁగా నాడనుం గలఁడు. అతఁడెంతటి యపజయము పొందినను వెనుదీయక తెల్లవాఱువఱకు నాడుచునే యుండునుగదా. అదంతయు మీకు ననుభవమే. ఇప్పుడు మేము జూదమందు జయముఁ గాంచు మార్గమును మీకుఁ దెలిపెద మనుకొనుచుు. మీకు సమ్మత మగునా?

వెంక—(వికసించిన మొగముతో) జయముఁగాంచు మార్గమా? చూపెదరా? నాకు సమ్మతము కాకుండునా? (అని కొంత వడి నాలోచించి) మీయభిప్రాయమిప్పుడు నాకు స్పష్టమైనది. మీకు గెలుపొందుదారిఁ జూపుఁడు; నేను దానివలన లాభముఁ బొందితినేని మీరుకూడ నావలన లాభ మొందఁగలరు. త్రికరణశుద్ధిగ నమ్ముఁడు

ప్రికా—అట్లురండు. లౌక్యమన నట్టిది అన్నా! కాదా?

రామ—అవును. ఇఁకఁ బర్యవసానముం దెల్పుము. వెంకటపతి రాజుగారు మర్యాదవంతులు. వారెప్పుడును లోటుచేయరు.

ప్రికా—నెయ్యుఁడా! ఇటుచూడుము. ఇవిగో! అని జేబులోనుండి యొకజత పాచికలను దీసి యిచ్చెను.

వారిరాకకుఁ గారణమంతయు వెంకటపతికి లెస్సఁగాఁ దెలిసెను. ఇంతకుమును పే యుద్వాహమాడియుండియుఁ బదపడి కపటవృత్తితో మేనమామకూఁతుఁ బెండ్లియాడు యత్నములోనుండు వెనుదీయని వాఁడు, ఆవలనిజస్థితి లోకమునకుఁ దెలిసినపిమ్మటఁ దన భార్యచనిపోయినదని బొంకుటకుఁ గొంకనివాఁడు, అజాతశత్రుసన్నిభుఁడగు పెద్దమేనమామ మరణించెనను దుఃఖమైన లేక యుతసగదిలోనున్న మరణశాసనపత్త్రమపహరింప సంశయింపనివాఁడు, నేఁడు మాత్రి మీయతుములఁగొనుటకు సందేహించునా? దానిని వెంకటపతి కైకొనెను. తరువాత వారికాపాటెలనుగూర్చి జరగిన సంభాషణమంతయు వ్రాయనక్కఱలేదు. అవి సీసముపోయఁబడిన దొంగపాచికలు. ఎల్లప్పుడు గెలుపును జూపువైపునే యవిపడునని ప్రికాశరాయఁడు చెప్పి చూపెననఁ జాలును. అటుతరువాతి మోసకృత్యముచే వెంకటపతి గెలిచి తెచ్చు ధనమెట్లు పంచికొనవలెనో నిశ్చయించుకొని, తురకకడకుఁజని వెనుకఁ దేర్పఁబడిన పద్ధతులమీఁద రెండువేల రూకలును బట్టుక వచ్చిరి. అన్నదమ్ములు మన్ననలఁ గైకొని తమ గుఱ్ఱపులకుఁజనిరి. వెం

కటపతి తాను రెండుదినములక్రింద నొక పూర్వపరిచయునిఁ గలసి
కొనుటయుఁ దాను క్షేమముగా నుండుటయు మున్నగు సంశము లొక
కమ్మయందువ్రాసి యొక కూలివానిచేత దానిని మాలతికిఁ బంపెను.
తానుపురలఁ గొంతనాటికి మాడవచ్చునను తలంపుతోనుండి, యైశ్వర్య
మెట్లు నిముసనిముసమునకు మార్పుచెందుచుండునో, యెట్లు దేవతికింక
ను దనయందు దయ తప్పకయుండెనో తలపోయుచుండెను. అట్టియా
చనలో నొక్కయనుమాన మతనికిఁ దట్టెను. ఈయనుమాన మహాత్రి
కాళరాయ రామచంద్రునింతసేపు పుట్టనేలేదు. అప్పు డేనం
దేహములకు మనస్సునఁ జోటులేదు. రెండుగంటల పూర్వమువఱకు వా
రిరువురెవరో ఘనులనియు, వ్యర్థముగా ధనము పాడుచేయుచున్న వార
నియు నతఁడుతలఁచెను కాని వారితరువాతచర్య జూడ వారే తన్నుఁ
గొల్లపెట్టుటకై నాఁటిరేయి దారికాచిన దొంగలని యతనికిఁ దోఁచె
ను. ఈయూహ యతనికి హృదయమున మెఱపుమెఱయుచాడ్పున నుదిని
దట్టినతోడనే యతఁడు వారితో వ్యవహారములు నలుపుటకుఁ దొందర
పడి కడంగితినని యించుక చింతించెనుగాని యావల నెటులో సమా
ధానపఱుచుకొని యిట్లు తనలోఁ దాననుకొనఁజొచ్చెను—"అవును.
నిజముగా వాండ్రే. అనుమానపడనక్కఱలేదు. నాఁడాఘనునిబండి
నడ్డగించినవారును వారలే. నన్ను నరికట్టినవారును వారలే. ఇప్పుడట్టి
వాండ్రతో వ్యాపారమునకు దిగితిని. దానివలన నపఖ్యాతి రాదుగ
దా? ఏలవచ్చును? వారికే రానప్పుడు నాకెట్లట్టిది సంభవించును? మ
ఱియు నిప్పుడట్టివాండ్రతోఁ జేరినఁగాని కాలము సరళముగా జరగదు.
నాకోరికలన్నియు సిద్ధించుటకు వీరలను బురస్కరించుకొనుటయే లెస్స.
వచ్చినయపకీర్తి యిదివఱకే వచ్చినది. క్రొత్తఁగా నెక్కువ రాఁబోదు.
కావున వెనుదీయక వారితోఁ గలసిమెలసి ప్రవర్తింతుము."—వెంక
టపతి యెంతకైనఁ దగును. వానికి మనస్సాక్షి యెక్కడపోయియున్న

డని యిదివఱకే చెప్పి యున్నాముగదా. మనస్సాక్షిభయములేనివాని కి నీతితో సంబంధమేమి? క్రిందనో మీఁదనో పడి తన యిష్టములు పూరించుకొనవలెననియే యతఁడు యత్నించుచుండెను. మోతీమహాలాపట్టణమందలి రమ్యహర్మ్యములలో నొకటి. అది యొక యెత్తయిన స్థలమందుఁ గట్టఁబడి యున్నది. దానిచుట్టును విశాలమైన శృంగారపు వనముగలదు. అందు సమస్త ఫలవృక్షములును బూలమొక్కలును గలవు. నిర్మల జలపూరితంబులగు కేళాకూళులు, నయనోత్సవదాయకంబులగు జలయంత్రములు నిదాఘశ్రమాపహరణసమర్థంబులగు విచిత్రనిర్మితాచ్ఛాదనంబులును పెక్కులందుఁ గలవు. వేయేల? అయ్యది సర్వేంద్రియ సౌఖ్యాలవాలంబనవచ్చును, సాలూరుప్రభువు జగన్నాథవర్మ వత్సరమునకుఁ దొమ్మిదిమాసములిచ్చటనే కాలముగడపును. అతనిఁగూర్చి యిదివఱకే యించుక తెలిపియుంటినిగదా. అతఁడు బ్రహ్మచర్యదీక్షయందున్నవాఁడనియుఁ జనువరు లెఱుఁగనలసియున్నది. వెంకటపతి యున్నగువారితో ద్యూతవ్యసనమందుఁ దగిలియున్నవాఁడని యతఁడు కేవల వ్యసనపరుఁడని తలఁచకొనుఁడు. అతని చరిత్రము మీకే ముందు తెలియఁగలదు.

సాయంకాలమయ్యెను. పక్షులు కిలకిలారవములు సేయుచుఁ దమతమ కులాయములకు జేరుచున్నవి. బిడ్డలు మేడలమీఁదఁ బరుగులెత్తుచుఁ జదల బర్వెడు కొంగలగుములను జూచి "కొంగా కొంగా! నాగోళ్ళుపుచ్చుకొని నీగోళ్ళి'మ్మని యనుచుచుండిరి. శీతవెన్నెలలం వృక్షాగ్రములయందును, నుత్తుంగహర్మ్యశృంగములయందును బ్రాకుచున్నవి. దాదులు చిన్నబిడ్డల నెత్తుకొని యూరిబైటఁ దిరుగుచుఁ జంద్రమామను జూపుచుఁ, జరిత్రకథలఁ జెప్పుచు, నవ్యక్తమధురస్వరముతో నాశిశువులు సెప్పుపలుకుల కూఁకొట్టుచు బువ్వఁ దినిపించుచుండిరి. దేవాలయములలో జేగంటచప్పుడులు, స్వస్తివాచకుల మనోహర

స్వరములు, వినవచ్చుచుండెను. అట్టితఱిని వెంకటపతి నిలువవలువలు ధరించి తలకలమికొనిన సంపెంగనూనెయొక్కయు, మేనసలఁదికొన్న చందనముయొక్కయుఁ, బుట్టములఁ బూసికొన్న యత్తరుయొక్కయు సువాసనలు గలుగడలకు వ్యాపింప హాయిలుమీఱ నడచుచు "మోతీమహాలు" నఁ బ్రవేశించెను. భటులాతనికి వినమ్రులై సలాములొసఁగి దారినొసంగిరి. భవనమధ్యమునందున్న విశాలమైన యాగారమునందుఁ గొందఱు అతిథులతోఁ బ్రభువుగా రాసీనులై యుండెను. అతఁడు వెంకటపతికి సాదరముగ స్వాగతమిచ్చెను. వెంకటపతియుఁ గొంతసేపు కుశలప్రశ్నాదికముల జరగించి తానతనియొద్ద బదులుపుచ్చుకొనిన మైనువేల రూకలును నిచ్చివేయుచు 'ప్రభువువారికిఁ గడుఁ గృతజ్ఞుఁడ'నని వినయపూర్వకముగ మనవిచేసికొనెను.

ప్రభు—అయ్యా! తమరిట్టి స్వల్పవిషయములోఁ గృతజ్ఞతను దెలుపనక్కఱలేదు. మనము మామిత్రవర్గముతోఁ గూడి భుజించి యావల సారెల నాడుకొందము. నిన్న మీరుచేసిన ప్రతిజ్ఞ మఱువలేదు.

వెంక—చిత్తము. అట్లయిన, నాలస్యముచేయక భోజనములకు లేచెదము.

ప్రభు—అట్లనే కానిండు. అందఱును వచ్చిరి. (గుమ్మముఁ జూచి) ఓహో! ఆయన రాలేదు కాఁబోలు.

వెంక—ఆయన యెవరు?

ప్రభు—ఒక ఘనుఁడు. నూతనపరిచయుఁడు. పేరుమాత్రము జ్ఞప్తికివచ్చుటలేదు. నా "దివాను"నకుఁ దెలియును. (అంతద్వారము వంకఁ జూచి) అదే! ఆయనయు వచ్చియున్నాఁడు.

ఆక్షణమందే యొకసుందరవిగ్రహము లోనికిఁ జొచ్చెను. జగన్నాథవర్మ యాయతిథినిగూడ సమానాదరమున గౌరవించి కూర్చుండ

నియమించెను. అక్కడనున్న తక్కిన ఘనులాతనిం జూచిన తోడనే 'ఓహో! సుగుణవర్మగారా! దయచేయుం' డని పలికిరి. వెంకటపతి యాసుగుణవర్మను జూచి యచ్చెరువొందిన కొయ్యబొమ్మవలె గాపడి యట్లె కూర్చుండి యుండెను.

---

## ఆ అవ ప్రి క ర ణ ము.

### సు గు ణ వ ర్మ.

సుగుణవర్మ పూర్ణ యౌవనముననుండెను. అంగసౌష్ఠవమును దగ్గఱ నుండి పరిశీలించిన నేమైన లోటు కనుపించునేమో కాని దూరమున నున్న మిగుల సుందరరూపుండుగనే యతండు కాన్పించును. అతండు ధవళాంబరములు ధరించి మూర్తిం గైకొన్న నైర్మల్యమువానుండెను. అక్కడ నున్నవారిలోం జాలమంది కతండు పరిచయముండని వారాతని కిచ్చిన స్వాగతమునుబట్టియే తెలిసికొనవచ్చును. జగన్నాధవర్మగారా తనిని దక్కినవారికిం దెలియంజేసి యతని సుగుణాతిశయముల నింపుగఁ జెప్పెను. అతండు తన సహజసౌశీల్యమును వలసినప్పుడు వెల్లడిచేయు చుం, గులీనగర్వ మేమియుం జూపక, యాత్మగౌరవముం గాపాడుకొను చు మాటలాడుచుండెను.

ఈతండు తన్ను వాండు ఘనులైన ప్రికాశరాయ రామచంద్ర నామకచోరులనుండి రక్షించినవాండే యని తెలిసి వెంకటపతి వెనుకం జెప్పంబడినరీతి ఆచ్చెపడియెను. ఇదివఱ కాతనిస్వభావ మంతయు మనకు విశదమేకదా! హృదయస్థితాభిప్రాయములను ముఖమునందుం గ నృడ నీకుండ దాంగురింపం గలండని వేర చెప్పవలయునా? సాటూరు రాజుగారు సుగుణవర్మ సుగుణములను గూర్చి యించుక ప్రిస్తుతించి, "వెంకటపతి రాజుగారూ! ఈనా స్నేహితులు సుగుణవర్మగారు మా

కి పరిచయము కాఁబోలు." అనియెను. వెంకటపతి "అయ్యా! ఈయన
సామాన్యుఁడు కాఁడు. ఇతని సౌజన్యము మీ రెఱుఁగుదురు. వాఁడు
నన్నుఁ దొంగల బారినుండి రక్షించిన మహాత్ముఁడే" యనిపలి
కెను. ప్రభువు "ఏమీ! మీరా మిమ్ముఁ గాపాడినవారు?" అని యాశ్చ
ర్యమునొందెను. వెంకటపతి తనకుర్చీ సుగుణవర్మ పీఠము దగ్గఱకీ
డ్చుకొని, యతని నెక్కుడుచనవుతో మాటాడవలెనని చూచెను
గాని, యేమో కాని సుగుణవర్మ తటస్థభావముతో నూరకుండెను. అ
తని కేమి కారణము లున్నవో మన కెట్లు తెలియును? ప్రభువు లంతట నంత
త్వరపడి మహాత్మా పురుషునితో నెయ్యముగా గల్పించుకొని కలసిమెలసి
మాటాడుట కిచ్చగింపఁ డనుకొనుచును. అతఁడు "మొన్న రాత్రి వెం
కటపతి రాజుగారికి నేను జేసిన చిన్నసాయమున కంతగా సంస్తవనీయుఁ
డనుగాను. అట్టి యాపదయందున్నప్పుడు సమీపవర్తులగు వారెవ్వరు చూ
చుచుండ నూరకుండఁగలరు?" అని మాఱుపలికెను.

అంతలో నొక సేవకుఁడు వచ్చి భోజనమునకు సర్వము సిద్ధ
మయ్యెనని చెప్ప సందఱును లేచిరి. భోజనములకు గాను వెండియరఁటా
కులు వరుసగాఁ బెట్టిరి. ఒక్కొక యాకు చుట్టు నెన్నియో వెండిగిన్నె
లుంపఁబడెను. ప్రతిఘనునకు బంగారుపూలుగల వెండికోళ్ళపీఁటలు కూ
ర్చుండుటకుఁ జేరఁబడుటకును నమర్పఁబడి యుండెను. ఒక్కొక పీటకడ
సుగంధతైల పూరితమగు గాజుదీప మొక్కొకటి యుంపఁబడెను. అం
దఱును దత్కాలోచిత పరిధానధారులై వచ్చి యాసీనులైరి. వెంకట
పతి సుగుణవర్మ ప్రక్కనున్న పీఠముపైఁ గూర్చుండి యతని మాటల పొంక
ము, పుట్టువుల నాగరకత, మున్నగునవి శ్రద్ధతోఁ దిలకించుచుండెను.
కాని సుగుణవర్మ మితభాషియై యతనివంకఁ దఱుముగాఁ జూచుటయైన
లేకుండెను. వెంకటపతికిఁ జూడఁజూడ నంతయు నాశ్చర్యముగా నుండె
ను. తానను కొన్న మనుజుఁ డౌనో కాదో, తాను బొరబడెనేమో యని

మూఁడు నాల్గుసార్లాతనివైపు చూచెను. తుదకుఁ దనలో "అతఁడేమై యుండవలెను, కానిచో మొన్న రాత్రి యేల తన మొగముఁ గనఁబఱచి వెంటనే, యిఁక నతిప్రసంగముఁ జేయనొల్లనివాని కైవడి, మాయమైపోయెను. కాని, యీమాయేమి? ఇది యెట్లు కలిగెను? అదృష్టము! కానిమ్ము. నేనుమాత్రము మౌనముద్రవహించి యుండవలెనుగాని వానినిగుఱించి యేమియు నితరులతోఁ బల్కరాదు. పల్కితి నేని నారహస్యములన్నియు బయటఁ బెట్టఁగలఁడు."అని యనుకొనెను. వెంకటపతి కేమి హేతువుచేతనో గాని యేమియుఁ దోఁచుట లేదు. అపరాధములు పెక్కు లాచరించిన వానిమనస్సట్లు ప్రతివిషయమందును భయపడుచు నాందోళనముం గాంచుచుండుట సహజమే కదా! ఇట్లితఁడు చిత్తమునఁ దబ్బిబ్బుపడుచుండ, సుగుణవర్మ యథాపూర్వముగానే యుండెను. అతని ప్రవర్తనమందు విశేష మెద్దియును లేదు. తన్నుఁగూర్చి వెంకటపతి యేమియు సాహసించి వెల్లడిచేయఁ జాలఁడని యాతఁ డెఱుఁగునేమో? లేక తన రహస్యములు వెలిబడినను దన కేమియు భయములేదని యూహించియే యారీతి నిర్మల భావముతో నుండియుండవచ్చును.

భుజించుతఱి నందఱు వేడుకనుడు లాడుచుండిరి. పదార్థము లతిరుచ్యములుగ నుండుటచేఁ గొందఱు వానిని బొగడుచుండిరి. ఒకపంక్తిలో నడుమను గూర్చుండిన సాలూరునరపాలుఁడు తన స్నేహితుల హాస్యరసపూరితవచనముల కప్పుడప్పుడు ప్రత్యుత్తరము లిచ్చుచుండెనుగాని, యంతగాఁ జొరఁబడి విస్రంభాలాపము లాడుటలేదు. అతఁడెవ్విషయముం గూర్చియో దీర్ఘవిచారమునఁ దో నుండి, స్నేహితుల మానసోల్లాసమునకై కల్పించుకొని యించుక సంతోషము తెచ్చికొని సల్లాపము లాడుచుండినట్లు కాన్పించుచున్నది. అతనికి రాజ్యప్రాప్తి

కాకపూర్వమే చిరకాలముక్రిందనే భార్యావియోగము సంభవించిన దని నానుడి కలదు. అప్పటినుండియు నిటులే చింతాకులస్వాంతుఁడై యున్నాఁడని కొందఱందురు. కాదు కాదతని స్వభావమే యంతయని కొందఱందురు. ఏది సత్యమైన నతఁడుల్లాసముగాఁ బ్రకృతిను సంభాషించుట లేదని మాత్ర మెఱుఁగవలయును. వంటకములన్నియు మిగుల రుచికరముగానుండుటచే నందఱును బాగుగా భుజించిరి. కాని సుగుణ వర్మయు వెంకటపతియుఁ దక్కిన వారివలెఁ గాక మిగుల నల్పముగా స్వీకరించిరి. సుగుణవర్మ స్వభావముచేత మితాహారమును దినువాఁడు. వెంకటపతి నేఁడుమాత్రి మట్లు దినఁదలఁచినవాఁడు. భోజనానంతర మెల్లరుఁ దాంబూలాదికముల నైచుకొని యొక రమ్యమందిరమున నుచి తాసనముల నాసీనులై యుండిరి. అందఱును గలసి ముచ్చటగాఁ గొంతవడి సంభాషించుకొని యెవరికిఁ దోఁచినరీతి వారు చదువుకొను టో, చతురంగ మాడుకొనుటయో, లేక పూర్వగాథలు చెప్పుకొను టో చేయుచుండిరి. సుగుణవర్మమాత్రి మొకపుస్తకమును దెఱచి చదువుకొనుచు నొక్కవాల్కుర్చీమీఁదఁ బండుకొని యుండెను. ఇదియే తగినయదనుకొని వెంకటపతి జగన్నాథవర్మగారి సమీపమునఁ గూర్చుండి "అయ్యా! తమ యతిథులలో నాసుగుణవర్మ మిగుల సుందరాకారుఁడుగను గుణసంపత్తి గలవాఁడుగను నుండినట్లు కాన్పించుచున్నది." యనెను.

జగ—నాకు నటులే తోఁచుచున్నది. కాని యతనికింతగా లోకానుభవమున్నట్టు చూపట్టదు. అల్పవయస్కుఁడగుటచే నట్లున్నాఁడు. ముందుముం దక్కఱకు వచ్చువాఁడగును.

వెంక—అతనికిని దమకును బరిచయ మెచ్చటఁ గల్గినది?

జగ—ఈయూర నానందరావుగారను మహారాష్ట్రక్షత్రియుఁడున్నాఁడు. మీరును వారినెఱిఁగియే యుందురు. వారు ధనవంతులైన

వర్తకులు. దీపావళిపండుగనాఁడు వారిబసకు నాహ్వానముచేయఁబడి మేమెల్లరమును బోయియుంటిమి. అప్పుడాయనయే సుగుణవర్మగారి తో నాకించుక పరిచయముఁగూర్చిరి. అప్పటినుండియు దఱచుగా మేము గలసికొనుచుంటిమి.

వెంక—ఆనందరావుగారిని నేనుగూడ నించుక యెఱుఁగుదును. కాని యితఁడాయన బంధుఁడా?

వెంకటపతి యింకేమైన వానినిగూర్చి రాజుగారినోటినుండి రాఁ బట్టవలెనను నుద్దేశముతో నట్టిప్రశ్న వైచెనుగాని మఱియొకటి గాదు. తానిదివఱకే యాతనిగుఱించి యెఱుంగును. అతఁడానందరావుగారికిఁ జుట్టము కాఁడని బాగుగాఁ దెలిసియుండెను.

జగ—కాఁడు. బంధువుఁడుకాఁడు. ఆనందరావుగారి కాతని తో స్నేహమెట్లయ్యెనో చెప్పెదను వినుఁడు. ఒకనాఁడానందరావుగా రొక యశ్వశకటమెక్కి భార్యాసమేతులై సింహాచలయాత్రకుఁ బోవు చుండిరి. అప్పుడు జాముప్రొద్దైనఁ గాలేదు. సగము దూరమేఁగ కుండఁగనే యిరువురు పాటచ్చరులాబండి నరికట్టి బండిలోనుండి స్త్రీ నొకరు పురుషునొకరు బలాత్కారముగ లాగి వారియొద్దనున్న సొ మ్ముల దోఁచ వయత్నించుచుండఁగా నొకగుఱ్ఱపురౌతు శరవేగమున వచ్చెనఁట. వానిని జూడఁగానే కాళ్లకుఁ బుద్ధిచెప్పి పాఱిపోవలసిన యాదొంగలు నిర్భయమున నిలిచి కృపాణప్రయోగముఁ జేసిరఁట. కాని యతినైపుణ్యముతో నాయోధుఁడా వ్రేటుఁ దప్పించుకొని తనచేతి లోనున్న చబుకుతో వారిని దీవ్రముగాఁగొట్టెనట. వారు నేలఁగూలిపో లుచు నుండిరఁట. ఇఁక వారి భయములేదని యానందరావుగారిని వారి సతీమణిని సమీపించి వారిని క్షేమముగా బండిలో నెక్కించెనఁట. ఇం తలో వాండ్రెట్టులో బలముఁగూర్చుకొని లేచి పాఱిపోయిరఁట. ఆ యోధుఁడు సుగుణవర్మయే. అతఁడంతటితో వెనుకకుఁ బోవక వారి

తోఁగూడ సింహాచలమువఱకుఁ జని సురక్షితముగ గమ్యస్థానమును జేర్చెనఁట. అప్పటినుండియు వారిరువురకమితమైత్రి సంఘటిల్లె నఁట. నీకు అటులేకదా యతనితో నెయ్యము వాటిల్లె ?

వెంక — అవును. అతఁడు మంచి సాహసికునివలెనే కాన్పించుచున్నాఁడు. ఇట్లిందఱి ప్రాణములఁ గాఁచినాఁడఁట. అతఁడు సద్వంశ సంజాతుఁడనుకొందును.

జగ — అతనివంశమునుగూర్చి నేనేమియు వినియుండలేదు. ఆతనివైఖరిని బట్టి చూడ నటులే నాకును దట్టుచున్నది. అతఁడంత యూవనమందున్నను స్వతంత్రజీవనమే చేయుచున్నట్లు గాన్పించుచున్నది. ధనముగలవాఁడనియే వినుచున్నాను. బాహ్యవేషమునందంతిని స్థిరపఱుచుచున్నది.

వెంక — ఆనందరావుగారికి లోకచక్కని కూఁతురున్నదని వింటిని. ఆయన యీతని నల్లునిగాఁ దీసికొందురేమో?

జగ — కావచ్చును. ఆయనకతనియందుఁ జాల ప్రేమ. సరియే. ఈమాటలకేమి ? మనము పాచిలాడుకొందమా?

వెంక — అయ్యో ! ఆమాటయే మఱచిపోయితిని. ఆసంగతియే జ్ఞప్తియందున్నఁ దమకీయవలసిన మొత్తమే కాక మఱికొంత ధనము కూడఁ బట్టుకవచ్చియుందును.

అని దనయొద్ద ధనముండియు మఱచిపోయినట్లు నటించెను.

జగ — లేకపోయిననేమి ? మీకుఁ గావలసినంత నేనిత్తును. ఆవల మీరు తీర్చివేయవచ్చును.

ఒకభటుఁడు సారెలుమున్నగునవి తేనాజ్ఞాపింపఁబడెను వాఁడట్లానర్చెను. వారిరువురు నాటలోఁ బ్రవేశించిరి. ఎప్పటియట్ల వెంకటపతికే

నష్టము రా మొదలుపెట్టెను. వెంకటపతి తాను దెచ్చిన దొంగపాచికల ను జేబునుండి యెప్పుడు తీయుదునాయని కనుపెట్టి చూచుచుండెను. కాని ప్రభువు కనుగలిగియుండుటచే సమయము చిక్కుటలేదు. సుగుణ వర్మకు నిద్రాసమయమగుటచే బసకుం బయనమయిపోవుచుం బ్రభువు నొద్ద సెలవుం గైకొనవచ్చెను. జగన్నాథవర్మ వానియం దమితగౌరవ ముంచినవాఁడుకావున, లేచి రెండడుగులు నడచి కూడవెడలి సాగనంపి వచ్చెను. ఇదియే తగినయదనని వెంకటపతి యతుముల మార్చివైచెను. ఆసమయమంఁదే సుగుణవర్మ తనచేతికఱ్ఱ మఱచిపోవుటచే వెనుకకు వచ్చుటతటస్థించెను. కంగారుపడుచు వెంకటపతి పారెలమార్చుట యుం తయు నతనికన్నులంబడియెను. కాని వెంకటపతియతఁడుచూచియుండఁ డని మనస్సులోసమర్థించుకొని యూరకుండెను. అంతఁ దక్కిన యతిథు లెల్ల రొక్కొక్కరు తమతమయిండ్లకుంబోవ నారంభించిరి. గృహ మేధి యందఱను సాగనంపివచ్చి విశ్వలచిత్తముతో మరలఁ గేళికై కడం గెను. వెంకటపతి ప్రభువు సుఖవిలాసము నట్టె తిలకించెను. కాని యందేమియు మారుపు కాన్పింపలేదు. సుగుణవర్మ చూడలేదనియుం జూచియుండిన నితనితోఁ జెప్పక మానఁడాయనియు నతఁడూహించి మనస్స్వస్థతతోఁ బదకుడు నాడ నారంభించెను. ఈపర్యాయము వెంకట పతికి గెలుపువచ్చుట మొదలిడెను. అన్ని పందెములును దానే గెల్చిన బాగుగ నుండదని జాగ్రత్తగాఁ గొన్ని పందెములను రాజుగారికి విడిచి పెట్టి తక్కినవి తానే జయించుచుండెను. ఇట్లొక గడియలో వెంకటపతి తాను బోఁగొట్టుకొన్న మొత్తమేకాక, మఱి పదివేలుకూడ గెలుపొంద గలైను రెండుయామములైనది. ఇఁకఁ జాలింతమని లేచి రాజుగారు ప్రమత్తులై యుండునటు చూచుచుండ మరలఁ దననొద్ది పాచికలను మార్చి తేనిదగ్గఱ సెలవు పుచ్చుకొని యపరిమితానంద భరితుఁడై మరి

యుచు, రామచంద్ర ప్రకాశరాయల యుక్తదేశమునకు నొప్పుకొను చు, వెంకటపతి యింటికేగెను

---

## ఏడవ ప్రకరణము,

### ఆ నం ద రా త్రి.

సముద్రపు టొడ్డుననున్న హర్మ్యములలో నిందిరామందిర మను నది మిగుల రమ్యమైనది. అది యన్ని ఋతువులయందును మిక్కిలి సౌఖ్యదాయినియై యున్నది. వేసవికాలములో నందున్న వారికిఁ గలుగు నానంద మనిర్వాచ్యమైనది. ఆ సౌధమధ్యమందున్న విశాలాగారమున నలుబదియేండ్ల పురుషుఁ డొకఁడు పదునేనేండ్ల ప్రాయముగల యొక సుందరాంగితో నేదియో ప్రసంగించుచుండెను. సుందరి యొకసోఫా మీఁద విలాసలీలఁ బండుకొనియుండెను. పురుషుఁడు 'హాలికాసనము' వాఁడబడు చెక్కడపుఁబనిగల దంతపుఁ గుర్చీమీఁదఁ గూర్చుండి ముందునకు వెనుకకు నూఁగుచు నామెతో మాటాడుచుండెను. అతఁడు మిగులముగ్గిన జామిపండువంటి దేహచ్ఛాయఁ గలవాఁడు, మిగులఁ బొడగరియును గాఁడు, పొట్టివాఁడునుగాఁడు. లేమిడిమిని సూచించు చిన్న బొజ్జ యతనికుండెను. అతఁడు తన దేశాచారప్రకారమే బట్ట కట్టు, జుట్టు కలిగియుండెను. అతఁడు కట్టిన నల్లని యంచుగల మువ్వాలువయు, విశాల నయనములకుఁ బెట్టుకొనిన సూక్ష్మ చపములును వింతయందము నాతనికిఁ దెచ్చినవి. అతనిపోలిక యే బాపనితనముఁ గూడ నుండెను. మొగముతీరు కన్నులయందము, మేనిచాయ, యచ్చుగ నాతనివే. ఆమె తెల్లచారల జరిగచీరఁ గట్టుకొని చెఱఁగు విలాసము గా మేలిప సుఁగు వైచికొని, కన్నులు మిఱుమిట్లు గొల్పు గాంతులు

గల కరకంకణములతోఁ గమలాలయ కాలవాలమహామోముఁదమ్మి
తో, నఱచేతిమీఁదఁ దలనూనుకొని రెట్టిగిలి పండుకొని పురుష
పుంగవునితో భాషించుచుండెను. అప్పుడు వారి నొకమూఁచి చిత్ర
కారుఁడు చూచెనేని, వెంటనే వారివిగ్రహము లొకపత్రముపై లిఖ
యించి, యాదర్శముగాఁ దన చిత్రలేఖనప్రదర్శనాలయమునఁ గూర్చు
కొని యుండును. పురుషుఁడే యానందరావు. తలోదరి యతని కూఁ
తురు, మోహినీబాయి. ఆమె యెంతయందమైనదో యంత గుణవతి.
ఆమెకును నామె జనకునకును సౌందర్యము, కలిమి, సుగుణసంపత్తి,
సద్విద్య—యన్నియు నబ్బినవి. ఆనందరావున కామె యొక్కతెయే
బిడ్డ; తల్లిదండ్రు లిరువురామెను గడు గారాబముతోఁ బెంచిరి. ఐన
నామె కేమియు గరువము లేదు. హిమవత్పర్వతమందలి నీహారముకంటె
నామెహృదయము స్వచ్ఛమైనది షోడశకళాపూర్ణమగు రాకాసుధా
కరబింబముకంటెఁ బవిత్రమైనది. ఆమె యభిప్రాయములు మేరువును
మించిన యౌదార్యముగలవి. ఆకుటుంబమువా రిప్పటి యింగ్లాండునఁగల
యీపట్టణమందే కాఁపురముండుచున్నారు. వారి వేషభాష
లు చాలవఱకు నాంధ్రులనుబోలియే యుండెను. వారప్పుడప్పుడు మ
రాటభాష మాటలాడికొన్నను దఱచుగాఁ దెనుఁగే వాడుదురు.

ఆనందరావు సుగుణవర్మతో స్నేహముఁ జేసి కొలఁదిదినములు
మాత్రమే యైనది. గుణవర్మ యంత యందఁగాఁడు కాఁడని చదువరుల
కుఁ జెప్పియేయుంటిమి. అతనిసౌందర్య మెట్టిదియున్న, గుణములుమాత్ర
మతిసంస్తవనీయములు. ఒకఁ డాతని సద్గుణములను గ్రహించినపిమ్మట
నతనిని విడువఁజాలఁడు. ఆనందరావున కతని గుణములే యాకర్షణ
కారణము లయ్యెను. సుగుణవర్మ తన దేశస్థుఁడు కాకపోయినను దన
కు జామాతయైన, సత్స్వభావయుతు నతని కనుకూలవతిని దెచ్చినవాఁ

డై కృతకృత్యుఁడు కావచ్చునని యానందరావు వూహించుచుండెను. మోహినీబాయియు నాతనిసత్ప్రవర్తనమునకు మెచ్చుకొనుచునే యుండెను; గాని భర్తగాఁ గైకొనవలయునను దలంపామెకు లేదు. తన జననీజనకులను మృత్యువునోటఁ బడనీక కాపాడిన యానందరావుఁ డనియు, సుస్వభావసంపన్నుఁ డనియు గ్రహించి యతనియందు సర్వసాధారణమైన ప్రేమ మాత్రమే యామెయుంచెను. క్రమముగా నీకృతజ్ఞత, యీగుణగణశ్లాఘనము, ఈసాధారణప్రేమ—యివియే శిరీషకుసుమకోమలమగు నామె హృదయమున నాఁటి నానాఁటికిఁ బెంపొంది భర్తృకప్రేమముగా నికి మారవచ్చును. సాధారణస్నేహమే వర్ధిల్లి వర్ధిల్లి పవిత్రమై, యేకాంతగానుభవనీయమై దంపతీస్నేహముగా మాఱ్పాటగుట మనము కనుచునే యున్నాముగదా! ప్రకృతము చదువరుల కామెను బ్రదర్శింపఁ బోవుతఱిని మాత్రము మామె యందలి పరమపవిత్రస్నేహము నాతనియెడ నింకను వహించి యుండలేదు. ముందుముందు చిన్నెలుమాత్రము పొడచూపుచున్నవి. ఇట్లు క్రమపరివర్ధితంబైన నెయ్యమే యెప్పుడో యొకనాఁడు పూర్ణత్వమును వహించి యామరణాంతము జీరస్థాయియై యుండును. ఆమె తలవు లింక నావంకఁ బాఱలేదు.

జగన్నాథవర్మగారు స్నేహబృందమునకు విందొనర్చిన మఱుచటి దినమున మధ్యాహ్నమందే యానందరావును గోపాలమూర్తియు వారీతి మేడపైఁ గూర్చుండి సంభాషించుచుండిరి. వారు చాలసేపు విద్యావిషయమై ప్రసంగించుచు నడుమ సుగుణవర్మ ప్రసక్తిరాఁగా నతని గుణోన్నతిని బ్రస్తుతించుచుండిరి. ఆసమయమందే సుగుణవర్మయానందరావుగారి దర్శనముచేయునిమిత్తము వచ్చెను. అతఁడు ప్రతిదినము మధ్యాహ్నమునవచ్చి యొకటిరెండు గడియలవఱకు నానందరావుగారితోను, వారి యొద్దువాండ్రతోను భాషించి పోవుచుండును. అనంద

రావునకతని యొక్క స్నేహమైనది మొదలు లోకజ్ఞుఁడైన సతఁడు తనకడకు రాకుండినఁ గళవళపడుచుండువాఁడు. వారియింట నందఱాతనిని స్వజనవర్గములో నొక్కనిగా భావించి చనవుతోఁ బ్రసంగించుచుందురు. అతఁడు వచ్చినతోడనే మోహినిబాయి మఱింత వికసితవదనయై లేచి కూరుచుండెను. ఆనందరావు ముదముతో "నాయనా! రమ్ము! నీకొఱకే యెదురుచూచుచున్నాను. నీవొక్కనిమునసమాలస్యము చేసిన నాకేమియుఁదోఁప" దని పల్కి హృదయపూర్వకమైన స్వాగతమొసంగెను. అతఁడు గృహమేధికి సమీపముననున్న పీఠమధిష్ఠించెను. వారిట్లు మాటాడుకొనిరి.

ఆనంద—నాయనా! నిన్న సాలూరిరాజుగారిలోఁగిటికి విందుఁగుడువఁ బోయితివిగదా! అచ్చట జరగినవింత లెవ్వి?

సుగు—వింత లేవియును లేవు. నేనట్టిఘనులయిండ్లకుఁబోవుట, వారి నాగరికత, దినచర్య, మున్నగునవి గ్రహించుటకేయని తమకుఁ దెల్పినవిషయమే కదా! నేనట్టిఘనసంఘములోఁ జరించుచున్నను, నాగరికభావములంతగాఁ గల్గియున్నవాఁడనుగాను. నాకు వారి మర్యాదలు, పరివర్తనములు బాగుగాఁ దెలియవు. వానిని గొంతవఱకు గ్రహింపఁ గల్గితిని.

ఆనం—నీకుఁగల యీలోపము నింతకుఁబూర్వమే నాతోనీవు చెప్పియున్నావు. నీవు ఘనసంఘచర్యానుభవము పొందవలెనను నుద్దేశముతో సాలూరునరవరునకు నీచరిత్రమంతయుఁ జెప్పితిని. నేను జెప్పినమీఁదనే యాతఁడు నిశానస్నేహముఁ బంపియున్నాఁడు. ఆభూపాలుఁడు నాకును నే నాభూపాలునకును బహుళోపకారముల నొనర్చుకొనియున్నాము. అతఁడు పూతచారిత్రుఁడే; కాని యుంచుకసుర్వ్యసనలోలుఁడని వినుచున్నాను. అట్టివానితో నీకుఁ బరిచయముం

గల్గించియుండకుందును; కాని, యనేకులు భాగ్యవంతులు, కుశీనులు తఱచుగా నాయింటికి వచ్చుచుందురు. వారివారివర్తనములం జక్కఁగ నీవు పరీక్షించి కొంతవఱకుఁ బ్రపంచవృత్తిఁ దెలిసికొనఁగలవని యట్లుచేసితిని. మఱియు సాలూరు రాజుగారు వ్యసనాసక్తులైనను, నినుఁబోలువానినిఁ జెఱుపరు. నీవు పరుల సుగుణములననుకరించు స్వభావముగలవాఁడవు కావనియు నేనెఱుఁగుదును. నీవంటి కాఁగల వాండ్రు తఱుచుగా నట్టి ప్రభువులనన్నిధికిఁ బోవుచుండవలయునని యే నాకోరికయును. అట్లుపోవుచుండినఁగాని నీవంటివాని మేధ సహజముగా విస్తృతముఁగాంచదు.

సుగుణ—మీ కరుణచే నచ్చటి ఘనులనెల్లఁ జూడఁగల్గితిని. సద్విషయముల నేర్చికొనఁగల్గితిని. ప్రభువు నన్ను మిగుల గౌరవించెను.

ఆనం—నాయనా! నాకుఁ జాలసంతసమయ్యె. భగవత్కృపచే నీవింకను లోకజ్ఞానపరిపూర్ణుఁడవై, నీగుణములకుఁ దగిన స్థితినిఁ బొందఁగలవని నాకుఁదోచుచున్నది.

సుగు—తమ యాశీర్వచనఫలముచే నాకట్టిశుభంబులైనఁ జేకూరు. తమ సాంగత్యమే నాకు శ్రీరామరక్షయగును.

ఆనం—కుమారా! నిన్నుఁజూచినదాది నీయందు నాకుఁ బుత్త్రప్రేమ జనించినది. నీవు నాప్రాణదాతవైనను నీయందువాత్సల్యమే నిలుప మనస్సగుచున్నది. నేను ముఖప్రీతివచనము లాడువాఁడనుగాను. నీకు నామాటయందంత యాదరమున్నందులకు నా కమితానందమయ్యెడిని. నీకుఁగల లోపము నానాఁడంతనిమ్మళంకహృదయముతో వెల్లడించినప్పుడే నీసద్భావములు నాకుఁ దేటతెల్లమయ్యె. ఈమన స్నేహమే యింకను బరిపూర్ణత్వమువహించి, నీవు నాదగ్గఱచుట్టమవై, కుటుంబములో నొకఁడవైయుండ తటస్థించునా? నీచారిత్రమంతయు, నీబాల్యమునుండియు వినవలతును.

సుగు—తమ యభిప్రాయము నాకు వ్యక్తమైనది. నన్నుగుఱించి యింకను దమతోఁ జెప్పవలసిన యంశములు కొన్నిగలవు. కాని నేనువానిని వెల్లడిసేయవలనుపడదు. నేనొకమహాత్ముని యాజ్ఞానువర్తినై యుండవలెను. అతనితో నేవాగ్దానముఁ జేసినప్రకారముగా నాస్థితిగతులు కొన్ని ప్రకటింప నసమర్థుఁడను, అయ్యా! తమతో నింతకుఁ బూర్వమే మనవిచేసియుంటిని. నేను జన్మఁనాటినుండియు నిట్టియైశ్వర్య స్థితిలో నుండలేదు.

ఆనం—సుగుణఖనీ! నీవంతయుఁ జెప్పితివి. ఇంకను నీకుఁ జెక్కు ప్రశ్నలనైచి నీవాగ్దానమునకు భంగము రానీను. నిస్నేహము నేను నాస్నేహము నీవు లెన్నఁగా నొందియున్నాము. అదియే నాకుఁజాలును. మనసంగతి దినదినప్రవర్ధమానంబై, నామనోరథ సిద్ధిదాయకంబై యమరుఁగాక.

ఈసమయమందే సేవకుఁ డొకఁడువచ్చి సాలూరురాజుగారు వచ్చిరనియు 'కచేరీ' గదిలో యజమానునికొఱ కెదురుచూచుచుండిరనియు మనవిచేసెను. ఆనందరాయసుగుణవర్మలు తమసంభాషణమును వెంటనే చాలించి రాజుగారికడకుఁ జనిరి. జగన్నాథవర్మ తాను వారి రహస్యప్రసంగమున కభ్యంతరముకలుగఁ జేసితినని యించుక నొచ్చుకొనెను. కాని యానందరావతివినయప్రవృత్తితోఁ దమకేమియు నడ్డంకి లేదని చెప్పి కడుగౌరవముఁజూపి స్వాగతమొసంగెను. వారు మువ్వురు నుగలసి కొంతసేపు లోకాభిరామాయణమును జెప్పుకొనిరి. నడుమ సాలూరుభూకాంతుఁడు సుగుణవర్మతో నిట్లనెను.

జగ—వర్మగారూ! నిన్నరాత్రి నేను వెంకటపతిరాజుగారితోఁ దీవ్రముగాఁ జాచికలాడుచుండఁగా మీరేఁగుదలఁచి నాయొద్దకువచ్చితిరి. మీరట్టియాటలయందు వేడుకలేనివారుగాఁబున మిమ్ములబలవంత పెట్టి యాపనైతిని.

ఆనం—ప్రభూ! తమరు మంచిపనియే చేసితిరి. తమకు లోకానుభవము పూర్ణముగాఁ గలదుగావున నట్టి వ్యసనములకు లోనైనను మితిమీఱియుండరు. తోఁటవనమందున్న వారట్లుగాదు. వారాడుట కారంభించిన నన్నిపనులును మానుకొని మైన వారుచుందురు.

జగ—నేనైన నెల్లప్పుడాడు వాఁడనుగాను. హృదయక్లేశములు పైకివచ్చి బాధించినప్పుడు మనోవృత్తి మార్పుటకై యట్లు చేయుచుందును. కాని యితరుల ననుసరింపుఁడనికోరను. అదియునుగాక యందు నాకైనను ధనలాభము కలుగుటయరుదు. ప్రాయికముగా నోటమియే కల్గుచుండును. తత్కాలికమానసోల్లాసము నపేక్షించియే యెట్టి నష్టమునకైన నియ్యకొనుచుంటిని. వర్మగారూ! నిన్నరేయి నాకుఁ జాల నష్టమాసంభవించెనుజూఁడీ! మొదట భాగ్యదేవత నావంకనే శీతలకటాక్షములఁ బరపుచున్నట్లు చూపట్టి యంతలోఁ దిరిగిపోయినది. ఆనుచాంచల్యము ప్రసిద్ధమేకదా! అవలకు మీఁదు చసినది మొదలు నాకపజయమును వేంకటపతిరాజుగారికిజయమును గలుగ నారంభించెనుజూఁడీ!

ఆనం—ఆహా! వెంకటపతిరాజుగారా! ఆతని దుష్ప్రవర్తనముం గూర్చి పెక్కుసారులు వినియున్నాను. కాని యతనితో నాకుఁ బరిచయ మంతగాలేదు. అర్యా! తమకువచ్చిననష్ట మెంతయుండును ?

జగ—పదివేలురూపాయలుమాత్రమే! నాస్థితిగతులనుబట్టి యదియొక గొప్పనష్టము కాకపోయినను వ్యర్థముగా నాధనముట్లుపోయెనని యించుక ఖేదపడితిని.

సుగు—పదివేలే! ఏమీ! వెంకటపతి గెలుచుటయే? వానికి సాధ్యమయ్యెనా? అని సుగుణవర్మ యానసమువంకఁ జూచుచుఁ గొంతసేపు యోజించి తల పంకింపసాగెను. ప్రభువు తనకుఁగలయాద్యూతాభిలాషయను దోషమునుగూర్చి యింకను ముచ్చటింపనిచ్చగింపక సంభాషణముమార్పఁదలంచి "అయ్యా! మన మావిషయమై యింకఁ

గట్టిపెట్టుదము !" యని చమత్కారముగా మఱియొక ప్రసంగమెత్తెను. ఆనందరావు దానిని వినుచుండె. సుగుణవర్మమాత్రము పరాయత్త చిత్తుఁడైనట్లుండె. అతఁడు హఠంబున లేచి "అయ్యా! నాకు సెలవొసంగెదరా? నాకుఁ గొంచెము తొందరపనియున్న" దని యచ్చోటువాసి చనెను. అతఁడు తిన్నఁగా వెంకటపతి యింటివైపునకుఁ బోయెను.

---

## ఎనిమిదవ ప్రకరణము.

### దొంగపాచికలు.

వెంకటపతి తనగదిలోఁ బడకకుర్చీమీఁదఁ గూరుచుండి, గడచినరాత్రి యక్రమముగాఁ దాను సంపాదించిన ధనము నేప్రాపుకారము ప్రకాశరాయరామచంద్రులకుఁ బంచిపెట్టు నుద్దేశ్యముతో వారికొఱకెదురుచూచుచుండెను. అతఁడొకవిధముగా సంతోషము నొందుచుండెను. నిన్నటియుదయమున దనయవస్థనుగూర్చి మరల దృష్టము తనవంకఁదిరిగినదని తలంచుచుండెను. కాని యొకనీతిశల్యత యతని యంతరంగమున నాట్యముచేయుచున్నది. ఎంతనీతిబోధములు లేనివాఁడైనను, బుద్ధిపూర్వకముగా నొకయపచారమొనర్చినప్పుడు తానాదోషస్మృతిఁబూర్ణముగాఁబొందియున్నప్పుడు మనస్సాక్షి తేలుకుట్టినట్లుకుట్టి బాధపెట్టుచుండఁగాఁ దానిఁ దప్పించుకొనఁగలఁడా? ఎట్టివానికేని తనగుట్టు బట్టబయలగున నపాయమువాటిల్లునేమోయను భయముండకపోదు. మోతీమహాలుందాదుర్ఘాత సమయమునఁ దాను పాచికలుమార్చినపుడు, సుగుణవర్మచూచినట్లు తనకనుమానము పొడముటమాత్రము వెంకటపతి మఱవలేకుండెను. రాత్రియందును గూర్చియే స్వప్నములఁగనెను. దివాస్వప్నములుగూడ నామనుగుఱించియే. అవియే యాతనిహృదయమున కంటకప్రాయములగుచున్నవి. ఏ నాహ్మా

ము కొంచెము పైకిఁ బొక్కుచునేయున్నది. సుగుణవర్మ యాతనికి సర్వ విధముల నడ్డంకిగాఁ గాన్పించుచున్నాఁడు. సుగుణవర్మతనతో సమాన సంఘమందుఁ దిరుగఁ దగుస్థితిగతులు లేనివాఁడని బాగుగఁ దానెఱుఁ గును. ఎట్లు వానికంతయుచ్చస్థితి వచ్చెనని యనుమానించుచుండెను. కాని సాహసించి వానినిగూర్చి పెదవివిప్పి యేరితోనేమియు వచింపఁ జాలకుండెను. అతనిచిత్తము సంపూర్ణమైన సంతోషమునుం బొందఁ జాలదు. ఖేదపశ్చాత్తాపములును బొందఁజాలదు. స్వభావముచేత నతఁ డొకమాత్రపు ధనసంపత్తిచేఁదృప్తినొందువాఁడు కాఁడు. ఒకపర్యా యము మాదొంగపాచికలతో జయముఁగాంచితిమిగదా, యిఁక నేల యిట్లు పలుమాఱు జయమొందరాదని యూహించుచుండెను. నైజగా ఢ్యముగలవానిబుద్ధి సదా వక్రమార్గమునఁ నే పోవుచుండునుగదా! ఇట్లతఁడుసంతోషాకులావస్థలమాధ్యస్థమునఁదపాతపాడుచుండి, కుర్చీ మీఁదనుండి లేచి యిటునటు నడయాడి యొకపెద్దనవ్వునవ్వి "నేనెంత మూర్ఖుఁడను! ఆసుగుణవర్మ నన్నేమిచేయఁగలఁడు? ఊరక లేనిపోని భ యముఁదెచ్చికొనుచుంటినే! నావెఱపునకేమైన సర్థముగలదా? ఔరా. వెంకటపతి! మెరుపునుమించిన ధైర్యముగల నీవే యిట్లు పిఱికివగుచుంటి వేల? భయమా! నన్నువిడిచిపొమ్ము. నాహృదయములో నీకుఁ జోటు దొరకదు. అబలాభావముగల మఱియొకని నాశ్రయింపుము." అని తనలోఁదానను కొనుచు జేబులోనున్న బంగారునాణెములను గలగల మనిపించుచు మరలఁగూర్చుండెను. పరిశాళరాయరామచంద్రులువచ్చి వఱకుఁ దనమదినుండి జూదపుఁదలఁపుల నావలకుఁ బాఱఁదోలవలెనని యాతనియూహ. కాని యతఁడు జేబులోఁ జేతులుపెట్టునరికి మగల దొంగపాచికలు చేతికిఁదగిలి వానిమనమును గలఁచినవి. వాని నతఁడు పైకిఁదీసి తనయెదుటనున్న బల్లమీఁద నాడనొదలిడెను. ఉభయపక్ష ములఁ దానేనిలిచెను. ఇట్లతఁడతిక్రీడాయత్తచిత్తుఁడై యుండ సుగుణ

వర్మను వెంటఁగొని యొకసౌకయ లోనఁ బ్రవేశించెను. వెంకటపతి వెలవెలఁబోయెను. చప్పున బల్లమీఁది పాచికలను జేబులో వైచికొన యత్నించెఁగాని, మఱింత యనుమానమునకు హేతువగునని యెంచి వానినటు లేయుంచి "ఓహో! మీరా? రండు. ఈపీఠముపైఁ గూర్చుండు" డని పలికెను. కాని ప్రత్యుత్థానమొనర్చి యెదురేగి సాదరముగ స్వాగతమీయ లేదు. సుగుణవర్మ వాని వైఖరియంతయుఁ గనిపట్టియు నేమియు ననక యాసీనుఁడయ్యెను. అతని కెట్టయెదుట నే పాచికలున్నవి. వాని వంకఁ దదేకదృష్టితో నతఁడు చూచుచుండ వెంకటపతి దిల కించి తనకుర్చీ వానలకు లాగి కూర్చుండెను. వాఁడు పండ్లు పటపట కొఱుకుచు నప్పుడే సుగుణవర్మను మ్రింగివైచునంతటి కోపము తోనుండెను. కాని, సాహసించి యేమియుఁ జేయఁజాలకుండెను. తుదకు మనసు కుదురుపఱచుకొని యిట్లనెను.

వెంక—మిత్రుఁడా! దయయుంచుటచే నా బసకేఁ వచ్చితివి. మనము ప్రీతనెయ్యురముగదా! నిన్నుఁ జూచుటచే నాకుఁ గడుసంతో షముగానున్నది. నీదుస్థితియంతయుఁ దరలి యనుకూలస్థితి నీకొదవినం దునకు నాకు మిగుల నానందముగలుగుచున్నది.

సుగు—అయ్యా! మీకిట్టి సద్భావమే నాయెడనున్న సంతస మే. కాని యిప్పుడు నేను గేవలము మన పూర్వస్నేహమును బునర్జీవిత ముగాఁ జేయుటకు రాలేదు. ఒక ముఖ్యవ్యవహారమునిమిత్తము వచ్చి తిని.

వెంక—ముఖ్యమైన వ్యవహారమా!—అని వెలవెలఁబోవుచు నంతలోనే విన్నఁదనమును దన నైపుణ్యముచే దాఁపురము చేయుచు నాతో నీకంత ముఖ్యవ్యవహారమేమియున్నదో నాకుఁ దెలియకున్నది! ఏమది?

సుగు — అయ్యా! నేనువచ్చినపని మీకుఁ దెలియకపోలేదు. మీచూపులనుబట్టి మీహృదయగతాభిప్రాయములను నేను గ్రహింపకపోలేదు.

వెంక — ఏమీ! క్రొత్తమాటలాడుచుంటివి. నీవు —

సుగు — (మాటకడ్డమువచ్చి) నేను వ్యర్థముగా వాక్యములను మాటుటకు రాలేదు. కిస్త్వాంశముకుఁ గడంగెదము. గతరాత్రి మీరు సాలూరురాజగారిని మోసముచేసి యనంతధనమును లంకించుకొన్నారుగదా!

వెంక — సుగుణవర్మా! (మొగము కోపమును భయమును గూడఁ దెలుప) వానిమీఁద నీవు మోపిన యీనింద —

సుగు — నిశ్చయము. అందులో నేమియు నసత్యము లేదు.

వెంక — కేవలమసత్యము — అనుచుఁ బీఠమునుండి లేచెను. క్రోధముచేతఁ వానిమేను గజగజ వణఁకెను. మాట తడఁబడెను.

సుగు — (నిశ్చలుఁడై)నాపలుకులు సత్యేతరములు కావని నుగళ నొక్కి వక్కాణింపఁగలను. మీవైఖరియే మీనేరమును స్థిరపఱచుచున్నది.

వెంక — ఏమీ! నోటికివచ్చినట్లు వదరుచున్నావు! — అని క్రోధఘూర్ణితమానసుఁడై పెట్టెచు బల్లమీఁది సారెలను గ్రహింపఁబోయెను.

సుగు — వలదు. వలదు. వానిని దీయవలదు — అనుచుఁ దటాలున వానిని సంగ్రహించి తనయొద్ద నుంచుకొనెను.

వెంకటపతి మిగులఁ గలవరపాటుతో నొక్కుమ్మడి వానిపైఁ బడి “ఓరీ! దొంగా! నాపాచికల దొంగిలింపవచ్చితివా” యని యూతని పిడికిలిని సడలింపఁబోయెను. కాని వానికి సాధ్యము కాదయ్యెను.

నిశ్చల మనస్కుఁడై, ఋజుమార్గప్రవర్తకుఁడై ధర్మైకబుద్ధితత్పరుఁడై యుండువాఁడు శారీరబలమంతగా లేనివాఁడైనను, జపలచిత్తుఁడగు శత్రువుని నవలీలగా నిర్జింపఁగలఁడను నార్యోక్తికిదె తార్కాణమయ్యెను. సుగుణవర్మ యనాయాసముగా నొక్క త్రోపుతో వానిని దూరముగాఁ బడఁజేసి తత్క్షణమే పాచికలఁ దన జేబులో భద్రపఱచెను. వెంకటపతి మరల లేచి వానిపై నుఱుక గమకించెను; గాని, యున్నగోమును జెడి చుట్టుపట్టుల నున్నవారు పోగుపడి యల్లరిచేయుదురేమో యని భయపడి, నిట్టూర్పు విడుచుచు, వడవడ వడఁకుచు, వెలవెలఁబోవుచు మిన్నకుండెను. సుగుణవర్మ చేతులు వక్షంబున కడ్డముగాఁ గట్టివైచుకొని తన కురిచీమీఁదఁ గూరుచుండి, వెంకటపతి ముఖవికారములఁ బరికించుచుండెను. కొంతసేపట్టులుండి వారిరువురకు మ్మఱనిట్లు భాషింపఁదొడఁగిరి.

సుగు—అయ్యా! నిన్నుఁ బాధచేయవలెనని నాకుఁ దలఁపు లేదు. నీయందు లేకపోయినను, నీకుటుంబమందైన నాకు గౌరవభావముగలదు. అందుచే నీకవమానము రానీయను.

ఈమాటలు వెంకటపతికిఁ గొంతవఱకు మనశ్శాంతిఁ గల్గించినవి. కాని యతఁడు తనపై నారోపింపఁబడిన తప్పునుమాత్రమొప్పుకొనలేకుండెను.

సుగు—వెంకటపతిరాజుగారూ! పెక్కుమాటలేల? మీరు నిన్నరాత్రి జగన్నాథవర్మగారియొద్దనుండి గ్రహించినవిత్తమును వ్యయపఱచితిరా? ముందుగాఁ జెప్పుఁడు.

వెంక—ఓయి! నీప్రశ్నకుఁ బ్రత్యుత్తరమిచ్చుటకుఁ బూర్వము నినొక్క ప్రశ్నవైచెదను. నీవిచ్చటకువచ్చి ఋట్టినుడులు పల్కుటలో నీయుద్దేశమేమి?

సుగు—చెప్పెదనువినుము. నీవా ధనము నన్యథా యుపయో గింపకుండ నుంటివేని, మరల దానిని సాలూరు ప్రభువునకు నిప్పింప వలెనను నూహతో నట్లడుగుచుంటిని. నీకుటుంబవ్యయమునిమిత్తము కొంత ధనమవసరముండిన నేను నీకీయఁగలను. నీదుష్ట చేష్టితములను గూర్చి నేనెవ్వరితో నింకను జెప్పలేదు. ప్రభువుకూడ నెఱుఁగఁడు. నీవు పాచికలనుమార్చుట కన్నులారఁజూచితిని. అక్రమ కార్యముం జూచియు నెట్లూరకుండఁగలను? మఱియు నిన్నుఁగూర్చి వింటిని. దానినంతయు నెల్ల డింపనేల? ఇంత మోసపుఁ గృత్యమునకుఁ గడంగెదవని నే ననుకొన లేదు. ప్రత్యక్షముగా సాక్షులఁగాంచువఱకు నీయకార్యమును నమ్మ లేదు. ఇప్పుడంతయు స్పష్టమయ్యె.

వెంకటపతి చెదరిన మదిని సమకూర్చుకొనెను. తాను సుగుణ వర్మయధీనమునందున్నానని గ్రహించెను. వానిదయ సంపాదించుట తప్పనింకఁ దెరువులేదని తెలిసికొనెను. అతఁడాడిన వాక్యములనుబట్టి తన కేహానియుఁ గలుగదనియు నమ్మెను. ముందుముందు తన యవస్థ నుబట్టి నడతనుదిద్దుకొన నిశ్చయించుకొనెను. కొంత వడి యోజించి యిట్లుల నెను.

వెంక—వర్మా! నేను గెలిచిన మొత్తమంతయు మరల రాజు గారికిప్పింపవలయుననికదా నీయుద్దేశము? నీవు నాపై మోపిన యప నిందను నేను సరకుచేయకుండిన నేమిచేయుదువు?

సుగు—అట్లైనచో వెంటనే నీదౌష్ట్యముంగూర్చి రాజుగారికి నివేదించెదను. ఈపాచికలతనిచేతులలోఁ బెట్టెదను. అతఁడు న్యాయా ధికారులతోఁజెప్పి నీకుఁ దగిన శిక్షఁజేయించును.

వెంక—(ఒకమాటు పండ్లు పటపటకొఱికి చేయునది లేక) నిజ ముగా నే నేదో యకార్యమును జేసియుంటినేమో యనుకొని, నాపయిని నీయపవ

జేశ మనుసరింపఁదలఁచి నేనాసొమ్మును రాజుగారికిత్తుననుకొనుము. ఎట్లు వానికి డకుఁబోను? ఎట్లువిత్త మీా సాధ్యమగును?

సుగు—ఈవిషయముంగూర్చి యిక్కడికి రాకపూర్వమే యా లోచించితిని.నీవు సాలుగారురాజుగారి పాదములఁబట్టి కృతాపరాధము నకుఁ బశ్చాత్తాపమును దెలుపుటకన్న వేరొండు మార్గములేదు. అ తఁడు కృపాసాగరుండని వేఱుగ వక్కాణింపనక్కఱలేదు. నిన్నుఁ దప్పక క్షమియించి యాదరించును.

వెంక—ఏమీా! అతని పాదములపైఁబడమందువా?

సుగు—అవును. దానిని మించిన దారిలేదు. నీవు నీయకార్య ములను గుప్తముగా నుంపుమనియు నాతని వేఁడితివేని యాదయా శీలుఁ డట్టులొనర్చును.

వెంకటపతికి మనంబులో నొకవిధంబగు నాందోళనంబుదయిం చెను.ఆతఁడా యగారమున ముందునకు వెనుకకుఁ బ్రచారముచేయఁ దొడఁగెను. కొంతసేపైనతరువాత దీనముగా "సుగుణవర్మా! నాకెంతయవమానముఁదెచ్చిపెట్టితివి?" అని పలికెను.

సుగు—నేనవమానమును దెచ్చిచితినందువా? ఊరకున్న జేఁడు మఱింత యవమానమునకుఁదేకుండునా? న్యాయాధికారియెదుట నీ నేరమును స్థాపించి నిన్ను శిక్షింపఁజేయఁడా? కావున నాతని శరణుఁ జొచ్చుటకన్న నిరపాయోపాయము లేదు.

వెంక—సరియే. రాజుగారు నన్ను మన్నించి యంతయు రహ స్యముగానుంతురనుకొనుము. అతఁడుమాత్రము నాయందు దురభి ప్రాయము సదా కలిగియుండఁడా? నేనతనిసమక్షమునఁ దలయెత్తి తిరుగఁగలనా?

సుగు—పదిమంది యెదుటఁ దలయెత్తికొనఁజాలకుంటకంటె నొక్కనియెదుట నట్లుండుట మేలు కాదా?

వెంక — అయ్యో! ఆతఁడు వానితో మునుపటివలెఁ గలసిమెలసి మాటాడఁడు. నేను నిర్జీవప్రతిమవలె నుండవలెఁగాఁబోలు.

సుగు — అటులెన్నఁటికిఁ జేయఁడు. నీవుమాత్ర మతఁడు చరించు ఘనసంఘమునకుఁ దఱచుగాఁ బోకుము.

వెంక — ఓయి! నీవు నన్ను ధ్వంసముచేయుచున్నావని నీకుఁ దెలియునా? నేను రాజుగారితోఁగలసి మాద్యూతమందిరమున నాడు చుందును. ఇప్పు డేమొగముపెట్టుకొని యతని సమక్షమున నితరుల తోనైన నాడఁగలను?

సుగు — అవును. నిజమే. నీవింక నాడుట మానవలెనని యే నా తలంపు. ఇప్పుడీరీతిని నీరహస్యమును బ్రకాశముచేయుటలో నాయు ద్దేశమదియునై యున్నది. వెంకటపతీ! నిన్ను నాసాధ్యమైనంతవట్టు కాపాడెదను. నీవుమాత్రము మోసపుమార్గము విడిచి వర్తింపవల యును.

వెంకటపతి మరలఁ బలుక లేదు. ఇంకొకపర్యాయమాగదియుం దుఁ బ్రచారముచేయ మొదలిడెను. కుమార్గసంపాదితంబగు ధనం బును గ్రిమ్మఁజ నరపరునకిచ్చివైచుటయనఁ దాను బిచ్చమెత్తుటకు సిద్ధ ముగానుండవలసినదేయనియు,భూపాలునికడఁ దన తప్పు నొప్పుకొనుట యనఁ దానిఁక ద్యూతమందిరమునకు వెడలుట కట్టిపెట్టి ఘనసంఘ ముతో నెయ్యము సలుపుటమాని చరింపవలసినదేయనియు, నతఁడు తలపోయుచుండెను! ఇది యిట్లుండ నతఁడు వరికాశరాయరామచం ద్రులతో ననుకొనినరీతి వ్యవహారము పరిష్కరించుకొనవలసియున్నది. వారు సాధారణులుకారు. చెప్పెడిమాటలచేఁ దృప్తినొందువారుకారు. వీరి దుఃఖకథనువిని యుపకారమొనర్ప యత్నించునంతటి సరసులు కారు. వెంకటపతి బ్రతుకింతదుఃఖప్రదముగ మును పెన్నఁడును లేదు.

రాజ్యముఁగోల్పడినప్పుడయిన నింత మనఃక్లేశ మతనికిఁ దోఁపలేదు. ఇప్పుడథోగతిపాలు కావలసివచ్చెను. అతఁడు సుగుణవర్మ సదుపదేశము విని దాని ననుసరింపలేఁడు. అనుసరింపకుండ నుండను లేఁడు. తుదకు హృదయమును సమాధానపఱుచుకొని యిట్లనియె.

వెంక—ఓయి! నీవు నాయందు స్నేహభావమును వహించి పలికిన వాక్యములకుఁ గృతజ్ఞుఁడను. కాని నన్నెట్లయిన నవమానము బారినుండి తప్పింపఁగలవా?

సుగు—నీవు నాసోదరుండవయిన నింతకన్న వేఱుపనిచేయు లేను. అపరాధివని తెలిసినపిమ్మటఁ గిమ్మని యూరకుండఁజాలను. ఊరకుంటినా, స్నేహద్రోహము చేసినవాఁడనగుదును. సత్యద్రోహము చేసినవాఁడనగుదును.

వెంక—సరియే. నీవు నాకిట్లు మానభంగముచేయ నిశ్చయించుకొంటివికదా! కానిమ్ము. నీవు సత్కులజులసంఘమునుఁ దిగుచున్నావుగదా! నీసంబంధమగు రహస్యమును నాపెదవులనుండి వెలి విడిచిన నేమిచేయుదువు? అప్పుడు నిన్నును నన్నువలెనే ఘనులు నిరాకరించు యోగ్యత పట్టునుగాదె!

సుగు— నీవు నావిషయమై యెట్టి యపనిందలు పలికిన బాధకలనుపడదు.

వెంక—పలికిన నన్నాటంకపెట్టువారెవరు?

సుగు—లేరు కానినీవుదానిఁజెప్పినంతమాత్రమున నాకేభంగము రానేరదు. మనమున కించుక సిగ్గుమాత్రము తోఁచును. నేనును వెంటనే నీగోప్యాంశముల వెల్లడింతును. అప్పుడు నీవెంత దుర్గతిఁ జెందుదువో? నీ వేయేటికిఁ జూచుకొనవలెను గాని నిరుబత్తుకు దెబ్బలు దునా? ఓయి! నీవు నాకుఁజేసినయుపకారములకిందను నీతో సరసముగా మాటలాడవలసినదా? నీయెడ సరళభావమూనియుంటకు నాకే యా

శ్చర్యముగాఁ దోఁచుచున్నది. నారహాస్యమును వెల్లడిచేయుదునను భయ ములో నీకడ నింతచనవుగా మాటాడుచు, నీ కుతర్కములకు లొంగినవాఁ గ డంగుచుంటిననుచుంటివేమో! అటులెన్నఁటికిని దలంపకుము. నేనంత నీచుఁడనుగాను. మరలఁ జెప్పెద, వినుము. నీకుటుంబమునైనను సు గౌరవాతిశయముచే నిట్లు నీకొఱకు దేవులాడుచుంటినిగాని స్వంతము కటిగాదు. పెక్కురకు బహుళోపకృతులొనర్చు నాసింగన్న దీవాన ముపేరుఁ జెప్పుకొని నీవు బ్రతుకవచ్చును. ఇప్పుడు నేనుచేయఁ జూపు మన్ననలు నీకుఁగాదు. నీఘనతరకుటుంబమునకు, అంగనలకైన నా సర్వశక్తి ధారవోసి యేమిచేయుమనిన దానిని జేయుదు.

వెంకటపతిరాజు నోరెత్తలేక పోయెను. మాంత్రికునిచేఁ గట్ట బడిన త్రాఁచుపామువలెఁ గదలక మెదలక యట్లె యుండెను. సుగుణ వర్మ చెప్పిన పద్ధతుల కొడంబడుటయే మంచిదని యూహించెను. ఈ యూహాయందును గపటము లేకపోలేదు. వర్మ ధనసంపన్నుఁడుగా గా న్పించుచున్నాఁడు. మఱియు 'నీకుటుంబ వ్యయములకైనను కొంత ధన మవసరముండిన నేను నీకీయఁగల" ననియుఁ జెప్పుచున్నాఁడు. కావున వానివలన నేమాత్రమైన సంపాదింపవచ్చుననియు నతని స్నే హముచేఁ గ్రమముగాఁ బెద్దలను బట్టుకొనవచ్చుననియుఁ దలఁచెను. పదపడి ముందునకు వెన్కకుఁ దిరుగనారంభించెను. వానికొక యభి ప్రాయము తట్టెను, దాని నెట్లు రసవంతమైనభాషతో వర్మతోఁ జెప్ప వలెనో పరిమాచుకొనుచుఁ గొంతసేపు సదయాత్మ సుగుణవర్మతో సంభాషింపవలెనని యతనివంకఁ దిరిగెను. అతఁ డింతవఱకుఁ దన మొ గముతీరును గనిపట్టుచునే యుండెనని మెఱుఁగఁడు. కాని సిగువచేసి యేమియుఁ బలుకనేరకుండెను. ఋజుమార్గప్రవర్తకుఁడగు నాతఁడా వనునిఁజూచిన నొకవిధమైనభయ మాతనికిఁ గల్గెను. మనస్సాక్షి పీడింప మొదలుపెట్టుటచేతను, చాపల్యము హెచ్చరించుటచేతను నోరు

గాని మధ్యావస్థయందతఁడుండెను. తుదకెట్టులో మొద పదిలపఱుచు
కొని, కార్యావేగము తన్నుఁ బ్రేరేప దీనదృష్టులతో నిట్లనెను.
"సుగుణవర్మా! నీయుపదేశప్రకారము చేయుట కభ్యంతర మేమియు లేదు.
అంతకంటెఁ జేయునదియును లేదు. కాని జగన్నాథవర్మగారికిచ్చుట
కాసొత్తంతయు నాయొద్ద లేదు. చాలవఱకు వ్యయమయ్యెను."

సుగు — వెంకటపతీ! నీ వబద్ధమాడుచున్నావు. నన్ను మోస
చేయఁజాలవు. నేనును సర్వమును గనుఁగొంటిని. నీయొద్దకు రాకము
నుపే భటుని నీవెచ్చటికైనఁ బోతివాయనియు, నితరులెవరైనఁ బ్రా
తఃకాలమందు వచ్చిరాయనియుఁ బ్రశ్నించితిని. అతఁడు రెండుప్రశ్న
ములకు వ్యతిరేకమైన యుత్తరమే యిచ్చియున్నాఁడు. కావున నీవు
లిచినధనమును హరిస్వామిఱచినమాట కల్ల. మఱియు—

వెంక—(నివ్వెఱపడి) సరియే, సరియే. నీవుచెప్పినటులే చేసి
దను. కాని పాచికలనిచ్చి మఱిపొమ్ము.

సుగు—వానితో నాకేమియుఁ బనిలేదు. కాని వానినిప్పుడు
నీచేతిలోఁ బెట్టను. నీయెదుట వానినగ్నిజ్వాలలోఁ బడనైతును. నీవు
జగన్నాథవర్మగారికిఁ జెల్లింపవలసిన సొత్తంతయుఁ జెల్లించువఱకు
వానిని యథాప్రకారముగనే యుంచెదను.

వెంక—ఎట్లు? ఎట్లు? అంతపనిఁజేసినఁగాని నీవుతృప్తినొందవా?

సుగు—అంతియేకాదు. నీవు రాజుగారితోఁ బలుకువాక్యము
లకుటనిలిచిరో, చాటుగనిలిచియో నేను వినవలయును. వాకన్ను
లో చెవులోఁ బరితృప్తినొందువఱకు నిన్ను నమ్మను. ఈ యెదుటిగదిలోఁ
దలుపుచాటున నుండవచ్చునా? దీనిలోనుండి మార్గముచొచ్చుటకుఁ
గలదు?

వెంక—ఉండవచ్చును. ఈగది యావలిక వాటముఁ దెఱచినఁ
జెరటిలోనికిఁ బోవచ్చును.

సుగు—మేలు. రాజుగారు నేఁడు గ్రామములో నేయున్నారు. వారితో నేదియో ముఖ్యవిషయము ప్రసంగింపవలసియున్నదనియు, జాము రాత్రిలోపున నొక్కసారి దర్శనమీయ వేఁడుచుంటిననియు నొకజాబును వ్రాసి వెంటనే యొకసేవకుని మోతీమహాలునకుఁ బంపుము. నేనుగూడఁ బెందలకడ వచ్చెదను. అసమయమున నాయునికి ద్వివిధమైన లాభమునిచ్చును. నీవు ప్రభువులకీయ వలసినమొత్తమీయఁగాఁజాలి తృప్తిపొందింతురుగాక ప్రభువునీయందుఁ గోపముగాని నిష్ఠురవాక్యములాడిన, నేనెదుటఁబడి యనునయపువా క్యములతో మీయిరువురకు సంధిచేయనర్హుఁడ గల్గుదుఁగాక. రాజుగారు సహజసాధుస్వభావమే చూపునెడల నేనెదుటఁ బడనక్కఱయే యుండదు. నాయభిప్రాయము నీకుఁ దెల్లమయ్యెనా? నీవాలోచింతువా?

వెంక—తప్పక యాచరింతును.

సుగుణవర్మ వినయముతో వెంకటపతికి నమస్కరించి సెలవు పుచ్చుకొని తనబసకుఁ బోవనుండ సేవకుఁడువచ్చి "అయ్యా! ప్రజాళ రాయరామచంద్రులు తమదర్శనమునిమిత్తము మరుదెంచినారు. సెలవైనఁ గొనివత్తు"నని వెంకటపతితోఁ జెప్పెను.

---

## తొమ్మిదవ ప్రకరణము.



### వెంకటపతియు వానిస్నేహితులును.

వెంకటపతి తననెయ్యురకేదియో కనుసన్నఁజేసి, సుగుణవర్మా! వీరు నాస్నేహితులు. వారి నామధేయములు సేవకుఁడు చెప్పుచుండ వింటివిగదా! యనిచెప్పెను. వారిరువురును వర్మకువంగి నమస్కరించిరి. అతఁడు వారినమస్కృతులంగైకొని ప్రతినందనము లాచరించి తన

దారినిఁబోయెను. అతఁడు నడచిపోవుచుండఁ బ్రి కాశరాయనిభటులును లేవోవిన బడ నింపుకతడవాఁగి వారిముఖములఁ జక్కఁగఁ బరీక్షించి చూచెను. వారును వానివంకఁ జూచిరి. వర్మ యొకటిరెండు నిముసము లట్లుండి వెనుకవెనుకకుఁ జూచుచు నేదోయాలోచించుచుఁ జనెను.

ప్రికా——వెంకటపతిరాజుగారూ! వీఁడెవఁడు? అట్టి కోఅచూపులు చూచుచుఁ బోయినాఁడు.

వెంక——(గుమ్మముకడకు వెడలి యాతఁడు దూరముగాఁ జనెనని నమ్మికతోఁ చిన పిమ్మట) సుగుణవర్మయని నేనుబిలుచుట విన లేదా? అతఁడొకఘనుఁడు.

ప్రికా——సుగుణవర్మయా?——అని మరలవానినామస్మరణముఁ జేసి వానినెఱిఁగినట్లు సూచనగాఁ బలికెను.

వెంక——అవును. సుగుణవర్మయే. ఆనందరావుగారికిని వారికిని మిగుల మైత్రియుంట కాదా?

రామ——ఆదౌర్భాగ్యునిఁగూర్చి మన కేల? మనము ముచ్చటింప వలసిన యంశము లనేకములున్నవి. కార్యక్రమమునకుఁ గడంగుదము రండు. నిన్న రాత్రి మీకెంత గెలుపువచ్చినది?

వెంకటపతి తత్క్షణమే ప్రత్యుత్తరమీయ లేదు. "ఎట్లు నాకుఁ గల్గిన రసాభాసమును వారికిఁ దెలియఁజేయుదును? వారికిఁ గిరుకవోడమిన గృహమంతయు నల్లకల్లోలము చేయుదురేమో! ఇరుగుపొరుగు వారలుకూడ మన యుపత్తిమను గుఱించి వినుట తటస్థించునేమో."  యని తనలోఁ దాననుకొనుచు యోజించుచుండెను.

ప్రికా——మిత్రమా! ఏల ప్రత్యుత్తర మిచ్చుటకు శంకించుచున్నావు? దమ్ము ఆలస్యముచేయకుము. మూపనిముందుగాఁ జూడుము.

మా కావలెఁ దొందరపనులు గలవు. అన్నా! మనకుఁ బనులున్నవి కావా?

రామ—ఉన్నవి కావా? ఇక్కడ నేకూర్చుండుటకు వలనుపడదు.

ప్రకా—రాత్రి యాట యెట్లుసాగినది? పర్యవసానమేమైనది. నీవు చెప్పకపోయినను మేము తెలిసికొనఁ గలము రామచంద్రుఁడన్నా! తెలిసికొనఁజాలమా?

వెంక— అయ్యా! మీయప్రస్తుతసంభాషణమును గట్టిపెట్టుఁడు.

ప్రకా—మేమునిమ్ము సరసముగా నడుగుచుండ నేల నీరసమైన యుత్తరమీయరు? ఎందుచేత మూర్ఖులకు సందేహించుచున్నారు అన్నా! ఈయన సందేహించెను గాదా?

వెంక—అధికప్రసంగము చేయకుఁడు. మీతోఁ జెప్పవలసినది చాలఁగలదు. మీరుమాత్రము సంభ్రమపడక శాంతచిత్తములతో నాకర్ణింపుఁడు. నాకుఁదగిన యుపదేశమును జేయుఁడు.

ప్రకా—అటులయిన సత్వరము చెప్పవలెఁగాదా?

రామ—ఎంతత్వరితముగఁ దెల్పిన నంత మేలు.

వెంక—గతరాత్రి నేను బదివేలరూపాయిలు గెలుపొందితిని.

ప్రకా—ఇంతియే? ఇరువదివేలైన గెల్చెద వనుకొంటిని. కానిమ్ము. గతజలసేతుబంధన మేల? అన్నా! నీభాగమునకు రెండువేల యేనూఱును, నాభాగమునకు రెండువేల యేనూఱును, రావలసి యుండును గాదా?

వెంక—(విసుగుఁదలతో) తాళుఁడు. నేను జెప్పునదెల్ల విందురా? మీకుఁదోఁచినట్లే మధ్యమధ్యమున మాటాడుచుందురా? ఇందాఁక మీరుచూచిన సుగుణవర్మకంతయుఁ దెలియును. వాచికలిప్పుడు వానియధీనములో నున్నవి. అతఁడే నేను గెలుపొందిన విత్తము

తయు సాలూరుభూకాంతునకు మరల నిచ్చివేయుమని నన్ను బలవంత
పెట్టుచున్నాఁడు.

ప్రికా॥ రామ—(కలవరపడి యొక్కపర్యాయమే) ఇచ్చితిరా
యేమి?

వెంక—ఇంకనీయలేదు. అదియు జాము రాత్రిలోపున జరగింప
వలెను—అని వెంకటపతి తనకును వర్మకును నడచిన సంవాదమంత
యుఁ బూసగ్రుచ్చినట్లు వారితోఁ జెప్పెను. వారలిరువు రొకరివంక
నొకరు కోపనిర్వేదాశ్చర్యసమ్మిళితములగు చూపులఁ బరపికొని
తమ మనోభావముల నేత్రావధానముమూలమునఁ దెలిసికొను
చుండిరి.

ప్రికా—అయ్యా! నీవింత తెలివితక్కువగా నుందువనుకొన
లేదు. అన్నా! మన మనుకొంటిమా?

రామ—ఎన్నఁడట్లు తలఁపలేదు.

వెంక—అయ్యలారా! మీకేమి? మీరు పంజరములోని చిలు
కలవలె నోటికివచ్చినట్లు పలుకఁగలరు. నాకష్టములు మీకేమి తెలి
యును! నేనిప్పుడా వర్మచేతిలోఁ జిక్కియున్నాను. వ్యర్థవచనములతోఁ
గాలముఁబుచ్చక నాకుఁదగిన సలహా చెప్పుఁడు.

ప్రికా—సరియే. నీవీ విశాఖపురిలో నుండినంతకాలము వాని
యధీనములో నుండకతప్పదు. దీనినివిడిచి పరప్రదేశమునకు నే యా
నాముపోయిన నీకేమిభయము? అన్నా! నీయభిప్రాయమేమి?

రామ—అన్నా! నీవువచించిన మాటసత్యము, ఉన్నధనము
మనము ముగ్గురమును బంచుకొని యీయూరికి "సలాము" గొట్టి
యానాముపోదము రండు. మనమిత్రిత్రియము పేరులను రూపము
లను మార్చికొనిన నెవరు కనుఁగొనఁగలరు?

ప్రికా — నాకీపాడుపట్టణము విడుచుటే భావ్యముగాఁ దోఁచు చున్నది. ఎంతకాలము—

వెంక — మీరు కర్తవ్యాంశము చక్కఁగా యోజింపక ముం దెప్పుడో చేయవలసిన దానిఁగూర్చి మాటాడుచున్నారు. దయయుంచి నా నుడులు వినుఁడు. నేనునలువురిలోఁ దలవంపులొందలేను. ఘనసాఘు భావ్యుఁడనై చరింపలేను, అధోగతి పాలగుటకు సమ్మతింపలేను. ఇంకను నాకాశలున్నవి.

ప్రికా — ఓయి వెఱ్ఱివాఁడా! ఇంకను నీ మేనమామకూఁతును వివాహమాడు తలంపు విడువలేదా? నీవెఱుఁగక పోయినను, లోకు లెల్లరు నీవావిషయమున సమర్థుఁడవని యెఱుఁగుదురు. ఏల యాఁడదని మ్రానిపండ్ల కఱ్ఱులు సాచెదవు? నీవి పిచ్చితలంపులుగాఁ గన్పట్టుచున్నవి. అన్నా! ఏమందువు?

రామ — వాస్తవము. ఇతనివి వెఱ్ఱియూహలే. మనకువానితో నేమిపని? మనధనము మనచేతులలోఁ బడుటయే ప్రధానము.

వెంక — [మరల విసుగుఁదలఁచి] ఊరకుండుఁడయ్యా. నన్నుఁ జెప్పనీయరు. మీరు సరియయిన త్రోవకు రారు. ఆధనము పోఁగొట్టు కొనుటకు మీకంటె వేయిమడుంగులు గష్టతరముగా నాకున్నదని మీరెఱుంగుదురా? ఇప్పుడు రెండుమార్గములు కనిపించుచున్నవి. మనము నోరులుమూసికొని యాధనమంతయు మరలరాజున కప్పగించు టైనఁ జేయవలెను. లేక మనము ముప్వరము లెన్నఁగా నాలోచించి యాసుగుణవర్మహతకుని మీఁది కేదోషముఁద్రోసి వానిననఁగఁ దొక్కు మార్గమేదైన నరయవలయును.

ప్రికా — మాకీ యాలోచనకుఁ బనిలేదు. మన మేర్ప ఱచుకొన్న ప్రకారము సర్వమును జరగవలయును. రమ్ము, మనల

కుము. మావంతుసొమ్ము మాకిచ్చిపంపుము. మేము సొమ్మువారము గాని, మాటలవారముగాము. అన్నా ! అంతియేకదా?

రామ—అంతియే. వెంకటపతిగారూ! జాగుచేయక రండు.

వెంక—నేనీయను. మీకుఁ దోఁచినట్లు చేసికొనుఁడు. మీకొఱకు నేను సర్వనాశ మొందెద ననుకొనుచున్నారా ?

ప్రికా—అటులయిన జాగ్రత్త, మేమునిన్ను—

వెంక—ఏమిచేసెదరు? నేను మొండితనము వహించిన నన్ను వంచ మీతరము గాదు.

ప్రి—నీయభిప్రాయ మేమియో బోధపడలేదు.

వెంక—మీరు నావినాశహేతువగు పద్ధతి నవలంబింపఁ గోరుచున్నారేని, మీకును నాకును సరిపడదు. అంతయుఁజెడును. బోధపడినదా? ఇంకను విప్పిచెప్పవలయునా?

నెయ్యురిద్దఱును గలఁతఁజెందిన చూపుల నొండొరులవంకఁ బరగించుకొనిరి. ప్రికాశరాయని మోటుమొగమునఁ గూడఁ గ్రోధరక్తిమ వ్యక్తమగుచుండెను. రామచంద్రుఁడు శిరోవేష్టనమును నేలఁబాఱవైచి తలఁదడవుకొనుచుండెను.

ప్రికా—మేమును మీవలెనే పెద్దమనుష్యులము. నలుగురిలో గౌరవముగా బ్రతుకుచున్నాము. మావంటివారితో సరళముగా వ్యవహారములు నలుపవలెగాని కపటము వహింపరాదు. పరుషభాషణములాడుట తగినదికాదు.

వెంక—నేనేమి పరుసము లాడితిని? మీరే నన్నిటుమలఁబెట్టఁ జూచుచుంటిరి. నాకుఁగోపము రానంతసేపేగాని, వచ్చిన నాఁపుటకు మీశక్యముగాదు. మీసత్యచారిత్రమును వెల్లడింతునుజూఁడీ. మీచౌర్యవ్యాపారము లన్నియు బయటఁబెట్టెదనుజూడీ.

ప్రికా—బయటఁబెట్టి యేమిచేయఁగలవు? నీకు సాక్షులెవరున్నారు?

ఆపద్యము వినినతోడనే ప్రభుచిత్తము పరాయత్తమయ్యెను. "మిత్రమా! నాకుఁ బనియున్నది సెలవొసంగెదరా? మీకడ రుక్మిణీపరిణయమున్న నొకసారి నాకిత్తురా? మరల దాని నొకటిరెండుదినములలోఁ బంపెద"నని రా జానందరావు నడిగెను. అతఁడు దానికొఱకుఁ దనపుస్తకభాండాగారమును వెదకి పంపెదనని చెప్పి తన్మహీవల్లభుని సగౌరవముగ వీడ్కొలిపెను.

జగన్నాథవర్మ వెడలినతోడనే యానందరావు పుస్తకముకొఱకు వెదక మొదలుపెట్టెను. అది యొకమూలకనిపించెను. అంత సాయంకాలమగుటను సముద్రతీరమునకు వాహ్యాళినిమిత్తము పోవనిశ్చయించి యతఁడు బయలుదేఱెను. కాని యాపోవుట మోతీమహాలునకే పోయి పుస్తకము రాజుగారికిచ్చిన బాగుగనుండునని యోజించి, రుక్మిణీపరిణయము చేతఁబట్టుకొని సాలూరుభూమీశు మందిరముంగూర్చి బయలు వెడలెను. ఆభవనంబుఁ జేరి రాజుగారేమిచేయుచున్నారని భటుల నతఁడడుగఁగా, వా రాయన పుస్తకభాండాగారమందుఁ గూరుచుండి యేదియో చదువుకొనుచున్నారని చెప్పిరి. ఆనందరావునకుఁ జనవు మెండుగనుండుటచే దనరాక యెఱుఁగఁజేయకుండఁగ నే యాయాగారము నఁజొచ్చెను. అందుబీరువలయందెన్నియో ప్రాచ్యలిఖితతాళపత్రగ్రంథములుండెను. ఆగదిగోడలకెన్నియో రమ్యమైన పటములుగలవు. వానిలో నొకపటమును జేతఁబూని తదేకదృష్టితో దానివంకఁ జూచుచు నొకకడానికురిచీమీఁద నాసీనుఁడై యుండెను. అతఁడు ద్వారమునకు వెనుదిరిగి కూర్చుండియుండుటచే నానందరావు ప్రవేశించుట యెఱుఁగకుండెను. మఱియు నతఁడు మనమున నిట్టూర్పులుకూడఁ బుచ్చుచుండెను. ఇదియంతయు నానందరావుకని, "అయ్యో! మదీయాగమనంబు తెలియఁజేయకుండ లోనికిఁ జొచ్చితినే! పాప మీతఁడెద్దియో యభిరుచిగల ముద్దుమోమును జిత్రఫలకమందుఁగాంచి యేకాంతముగా, ఆ·

తాపమునొందుచున్నట్లు కాన్పించుచున్నది. వెనుకకు మరలిపోవుటే బాగు, అని యనుకొనుచు వెనుదిరిగెను. తేపికించుక స్మృతిగల్గి యడుగులచప్పుడు వినఁబడ వెనుకకుఁదిరిగిచూచెను. ఆనందరావు నతఁడు గాంచినతోడనే పటమును మాటుపఱుపవలెనని యతనికి మొదట బుద్ధిపుట్టెను. కాని క్షణమాలోచించి,వలదు. దాఁపనేల?'యని స్వగతముగాఁ బల్కికొనుచు నెయ్యునకు స్వాగతమిచ్చెను. ఆమాట లానందరావు వీనులంబడియె. అతఁడుకూడ నీవేళవచ్చితినని మరల నొచ్చుకొనుచు ,ప్రియమిత్త్రమా! మీరేకాంతముగా నుండఁగోరుసమయాన నేనువచ్చి మీ భావపరిచారమున కభ్యంతరముఁ గలుగఁజేసితిని. క్షమింపుఁడు.అని వినయముతోఁ బలికెను. ,మిత్త్రుఁడా! నీవు నాకేమియు నష్టముగాలేదు. నీరాక నాకెట్టితటనైన మఱింతయానందదాయకంబగును. అన్యథా తలంపకుము అని తేఁడు మూర్చలికెను.

పరిభుహస్తమందున్న చిత్తరుబొమ్మ యానందరావునకులోచన గోచరమయ్యెను. దానిసొగసు వర్ణనాతీతమైయున్నది. అదిస్వర్ణమ్యూతుల వెలిగ్రక్కుచుండెను. అది యచేతనంబయ్యుఁ జేతనవస్తువుల మించినసోయగమున నొప్పుచుండెను. దానికమర్పఁబడిన చట్టమేనుఁగుదంతముతోఁ జేయఁబడినది. ప్రసిద్ధివహించినవిశాఖపురిచిత్రకారులందఱింతయైన ,నగిషీ'చెక్కిరి. ఆనందరావు వచ్చినపిమ్మటఁగూడఁ గొంతసేపామనుజాధిపుఁడాపటము వైపుచూచి యావల 'మిత్త్రుఁడా! నాయమితానందమునకు,నమితదుఃఖమునకు హేతువీ బొమ్మయేసుమీ,యనెను.

ఆనం——రాజా!మీరహస్యమనోవ్యాపారమున కాటంకముం గూర్చినందులకు మరల క్షమాపణము వేఁడుచుంటిని.

జగ——నీవెంతమాత్రి మాటంకముంగూర్ప లేదనియుఁ బదపడి నాశోకభారము నుదగ్గింపవచ్చితివనియుఁ గ్రమ్మఱఁ జెప్పుచున్నాను

ఆనం——ఇదే మీరుకోరినపుస్తకము. రుక్మిణీపరిణయము. దాని నిచ్చుటకే వచ్చితిని. సెలవైన బనకుఁ జనియెదను.

జగ——వలదు, నీవు నా కేలఁజూచు ప్రతిమనే నా కొసఁగి న వాచ్యానందమును, బ్రకృత మవాచ్యఖేదమును సమకూర్చునది. నీకి తరమైన తొందరపనులు లేనియెడల రెండుగడియలు నాతో గడుప గోరెదను.

ఆనం——ఇంతకంటెనా? ఏమిసెలవు?

జేఁడు తనచేతియందలి పటమును మరల యథాస్థానమున గో డకుఁ దగిలించి తనపీఠముపై నాసీనుఁడయ్యెను. మూఁడునాల్గునిముస ములవఱకేమియుఁ బలుకక కాప్రతిమవంక వీక్షించెను. తలవంకించి, గొంతుకసవరించుకొని యిట్లు వాక్రువ్వ మొదలిడెను. "సోదరా! మీ బసను వాతంబున నేలవిడిచితినో, విడిచివచ్చి వెంటనే యీనాగ్రి థాలయ మేలచొచ్చితినో, చొచ్చి యీచిత్రప్రతిమ నేలచూచితినో, చూచితి చేక ధ్యానచిత్తుఁడనై యేలయుంటినో నీవెఱుంగుదే! ఎఱుఁగవు. నేను మీయింటికి వచ్చినదిగు నాత సుగుణవర్మయు, నీవు, నేనుం గలసి దుర్వ్యసనములంగూర్చి కొంతవడి ముచ్చటించితిమికదా! అప్పుడప్పు డు నేను జూదమాడుచుండుట కేనల దుర్వ్యసనాసక్తిచేఁ గాదనియుఁ, గాలక్షేపమునకుమాత్రమేయనియు నప్పుడు చెప్పియున్నానుగదా? నాహృదయస్థితక్లేశమును ద్యూతాదులనబె నతిరములు పోఁగొట్టఁ జాలకుండెను. నేను రాత్రులు చాలసేపు మేలుకొనుట——నీతిబాహ్యులగు కొందఱు సామాన్యులతోఁ జూదమాడుట——మధురపదార్థములను భుజించుచుండుట——చోరరానిస్థలంబులఁజొచ్చుట——ఎందులకో నీకుఁ దెలియునా? నాయాత్మ కనిర్వాచ్యమైన రోగమొకటి సంభవించినది. ఆరోగమును మాన్ప ధన్వంతరితరమైనఁగాదు, ఓషధులు, లేపనములు, దానిపైఁ బనిచేయవు. దానికిఁబైనిఁ బేర్కొనఁబడిన వ్యసనలోలత నే

మందు. దానివలన నాశారీరక సాంఘికస్థితులకు భంగముకలుగునని నే నెఱుఁగుదును. ఆయుఃక్షీణమగునని యెఱుఁగుదును. కాని తాత్కాలి కానందము జీవించునంత కాలముండి, నేఁగోరుమరణము శీఘ్రముగా సంభవించుననియు, నష్టమువచ్చిన నాకేవచ్చుననియు నెఱిఁగి యట్లాచ రించుచున్నాను. ఈవ్యసనములయందు నిమగ్నమైయుంటయే నాకు శరణ్యమైయున్నది——"

ఆనందరా వీనుడుల నత్యంతశ్రద్ధతో నాలకించెను. కాని యం దలి యంశము లాతనికిఁ గ్రొత్తలుకావు. ఇంతకుమున్నే సాలూరురాజు గారికి కుద్వాహమాయెననియు, దానికి భంగమువచ్చెననియు, నప్పటి నుండియు నాతఁడు కృశించ మండెననియుఁ గర్ణాకర్ణి వినియున్నాఁడు. ఇప్పుడా పట మాతనిప్రియురాలిదే కాఁబోలు ననుకొని యావలఁ బ్రభు వేమివచించునోయని యతఁడు నిరీక్షించుచుండెను. రాజు మరల నిట్లు తనకథను బ్రారంభించెను.

"నానందరా! మనము వ్యసనసంబంధమగు సంభాషణము ముగించినపిమ్మట, సుగుణవర్మ వెడలిపోయెను. తరువాత భాషావిష యమై మాటాడికొంటిమి. అప్పుడు నీవు లలితపదశోభితమై, హృద యంగమమైన పద్యమొకటి రుక్మిణీపరిణయమునుండి చదివితివి. అది నామనంబుఁ గలఁచివైచినది. అదియే నన్ను యగారమునకు రప్పించినది. యీచపాపప్రవాహానిమగ్నునిఁ జేసినది. పూర్వస్మృతిచే ననంత ఖేద ముదయింపఁ జేసినది. ఇప్పుడు నిశోకకథఁ జెప్పెదనువినుము. దాని నింత కుఁబూర్వ మెవ్వరితోఁ జెప్పలేదు. నీతోఁ జెప్పుమని నన్నేదియో ప్రేరేచుచున్నది. ఆప్రేరేపణ మాఁపఁజాలను. కావునఁ జెప్పెదవినుము. నావచింపఁబోవు కథయందత్యంతమానసోల్లాసకరాంశములును, మహావిషాదోత్పాదకవిషయములును గలసియున్నవి. అందలి పూర

భాగము పున్నమవెన్నెలవలె నత్యధికసంతోషజనకంబై యుండును. ఉత్తరభాగ మమవసనిశిబోలె మహాభయహేతువై యుండును."

ఇచ్చటఁ బృథ్వీశుఁడు కొంత సేపూరకుండి క్రిన్నుల నిట్లు చెప్పఁ దొడఁగెను.

"మాజనకున కిరువురు పుత్త్రులనియు, వారిలో నేను గనిష్ఠుఁడ ననియు, మీకుఁ దెలియునుగదా! నేను బహునాఅవయేట జగత్ప్రసిద్ధ పాండిత్యపరిపూర్ణుఁడగు పేరి విశ్వనాథశాస్త్రిగారియొద్ద విజయనగర ములో సంస్కృతభాషాభ్యాసము చేయుటకుఁ బంపఁబడితిని. నేను శాస్త్రులవారికడ నారాజకీవి యేమియుం జూపక కాయక్లేశములఁబడి యెనను శుశ్రూష జేయుచు విద్య నేర్వవలయునని నాతండ్రిగారియానతి. విశ్వనాథశాస్త్రిగారు విజయనగరపురాధీశుని యాస్థానవిద్వాంసుఁడ గుటచే నితరస్థలములకు రారు. కావున నేనే వారికడకుఁ బోవలసివచ్చి నది. నేను గొంతమంది యితరశిష్యులతోఁగలసి యాయూరి శివాలయ మందొక రమ్యమంటపమందుఁ గూర్చుండి పాఠములు చదువుకొనుచుండెడివారము. నేను దక్షిణ వేదవిద్యార్థులతోఁ బాటు సమభావనము తోనే చూడఁబడితినిగాని, నాపాత్రిభవార్థ్యాగౌరవము లేవియు నొందకుంటలేదు. నాజనకునికోర్కియు నదియే. నాపేరికి రాజపదము పూర్వమునఁ జేర్పఁబడుటలేదు. జగన్నాథవర్మ యనిమాత్రమే పిలువఁ బడుచుంటిని. ఈయల్పాంశములు ముఖ్యములుగానట్లు కాన్పించునుగాని వానిప్రాముఖ్యము ముందునీవె యెఱుఁగఁగలవు. మేము సూర్యాస్తమయ సమయమువఱకుఁ జదివికొని పిమ్మట సాయంసంధ్యావందన మాచరించుకొని, గర్భాలయమునకుఁజని, మంత్రపుష్పసమయమున న చ్చటనుండి, ప్రసాదమును స్వీకరించి, బసలకేతెంచుచుండువారము. అనాధ్యాయదినములందును దేవళంబునకు వెడలుట మానకుం టిమి. ఇట్లొక్కనాఁడైన మానకుండ నేను దేవాలయమునకుఁబో వ్రట

కేవలదైవభక్తిచేఁగాదు. పవిత్ర్యహామును జనయిత్రితోఁగూడి వచ్చు, చుండిన యొకమహాలావణ్యవతిని, బండెండ్లు రాచకన్నియను జూచుటకునుం బోవుచుంటిని. ఆమె యప్పటికింకను బూర్ణత్వమునొంద ని గూరావనముకలది. కాని నవనవాంగశోభ యేమనివర్ణింతును? భూమి కవతరించిన ఖేచరనారీకుమారివలె నాకుఁ బొడఁగట్టినది. ఆమె ప్రాయమునకుమించిన యంగపుష్టియుఁ బొడవునుగలది. సర్వదా సంతుష్టినిచెలువు సందుచందమామవంటి నెమ్మోముతో, సహజసౌందర్యమును వెల్లడించుచు గజరాజును దిరస్కరించు మేలినడకతోఁ, దల్లి చేయిఁబట్టుకొని యామెకు దారిచూపుచు నడుచునప్పు డామెయందమేమని చెప్పుదును? ఆమె పేదతికమంతయు నెన్నడుమునందును, భాగ్యమంతయుఁ గచకలాపములందును, సిరియెల్ల మోమునందును జూపట్టుచుండెను. ఆమెపత్రిమయె నేనింతదనుక వీక్షించుచున్నది. అనేకవత్సరములక్రింద లిఖింపఁబడినదయ్యు నదియెటులామె మహాతేజస్వరూపమును జూపుచుండెనో నీవు చూచితివిగదా? ఆమెజనని యుంగధురాలు. జనకుఁడు చిన్ననాఁటనే గతించెను, పూర్వము మహాదైశ్వర్యమనుభవించి, కాలగతితప్పి ప్రస్తుత మమితదారిద్ర్య మనుభవించుచున్న దామెకుటుంబము. ఈకుటుంబమువారు విజయనగరపు మహారాజుగారి జ్ఞాతివర్గములోనివారగుటచే వారితో సహజవైరము నొందియుండిరి. గతించినమహారాజు వారిసర్వస్వ మొడిచిపుచ్చుకొని వారికేఁ గూఁటికైన గతిలేకుండఁ జేసెను. ఐనను మానుషవంతులును, క్షత్రియులు నగుటచే నొకరికడ దేహియనక యెటులోఁ గాలక్షేపము చేయుచుండిరి. ఆపెతల్లి ధారుణి. ఆమె నామధేయము జగదంబ. జగదంబ తల్లి కొక్కతెయేబిడ్డ. ధారుణి భర్తమరణానంతరము దారుణరోగపీడితయైనది. చావుతప్పి కన్నులొట్టయయ్యెనన్నసామెత నిక్కువమైయుండె మెగా భయంకరరుగణతపోయి నేత్రావరోధము మాత్రము

తటస్థించెను. ఆమెకుఁ బుట్టినింటివారు పెట్టినసగలు కొన్ని గలవు. వాని సమ్మికొనితినుచు, సుతకనుకూలసంబంధమును జేసి యామెను గడు బాగుగ సుఖపడవలెనను నుద్దేశముతో దినముల నెటులో గడపుచున్నది. వారు దేవాలయమునకు సమీపముననే యొక చిన్నయింటియందుఁ గాపురముండిరి. ప్రతిసాయంకాలము నించుక చీఁకటిపడినతరువాత వారా దేవాలయమునకువచ్చి జగన్నాథునిదయకుఁ బాత్రులగుటకు బ్రయత్నించుచుండిరి. ప్రథమమున నా సుందరాంగి నాకన్నులకుఁ గాన్పింప నేను నిశ్చేష్టుఁడనైతిని మనుష్యాంగనలింత యందఁగత్తెలుందురాయని యనుమానించితిని" మరల సాలూరురాజు యించుకసేపాఁగెను. అతనికిఁ బూర్వస్మృతి పూర్ణముగాఁ గలిగి వెనుకటిసంగతులన్నియుఁ గన్నులయెదుటఁ గట్టినట్లయ్యెను. విచిత్రముగానున్న యీకథాసారస్యమునకచ్చెరువొందుచుఁ దరువాతికథ కెదురుచూచుచు నారంగరావు మూకీభావము వహించి నిరీక్షించుచుండెను. ప్రభువు పదపడి కథ నిట్లు మొదలుపెట్టెను.

"చాలదినములవఱకామెను సమీపమునుండి చూచుభాగ్యము నాకబ్బినదికాదు. మంత్రిపుత్రుఁడైనవాఁడనై ద్వారమునకడ నిలిచియుండు స్త్రీల కర్చకుఁడు ముందుగా బ్రసాదములిచ్చి పిమ్మట నావల బురుషులకొసంగుచుండెడివాఁడు. తక్కిన స్త్రీజనముతో నామెయు వెంటనే పోవుచుండిరి. ఆమెను గనుదాపుననుండి చూడవలెనని నాకోర్కె. ఒకనాఁడామె నిత్యమునుఁబోవు ద్వారమునఁ బోవలనుపడినదిగాదు. ఆ ద్వారము శిథిలమై కూలుటచేత మరల బాగుచేయించుచుండుటచే నా దారిఁ గట్టివైచిరి. అందుచేత స్త్రీలెల్లరు పురుషులకుఁ బ్రసాదములు పంచిపెట్టువఱకు నిలిచియుండవలసివచ్చెను. మఱియు ధారుణి యంధురాలగుటచే నందఱును జనినతరువాతఁ గొంతసేపటికిగాని బయలుదేఱుటకు వీలుపడినదిగాదు. నాఁడే నాభాగ్యము పండినదని తలఁచితి.

సహాధ్యాయులును, మాజెయితరులును బోటులనతరువాతఁగూడ నే నచ్చోటనేయుంటి, హాలావణ్యవతి సౌందర్యాతిశేకముం దిలకించుచు నేత్రపర్వ మొనర్చుకొనుచుంటిని అప్పుడామె దీపములకాంతిని దిరస్కరించు మేలిబగ్గులతో, చంచలరాయని నీసడించు నడబెడంగుతో నా ప్రక్కనుండియే పోవుటదటస్థించెను. కన్యాత్వమందుతిసోయగముగల దాని నెన్నఁడును జూచియుండనైతి. అప్పనయస్కుఁడనయ్యు నామెయం దమితమోహము నొందితిని. మఱియు, నామెను దేఱిపాఱ జూచుటకు నాకేగాని యన్యులకు హక్కులేదనియుఁ దలఁచుచుంటిని. నాపండి విద్యాగుణశ్రేష్ఠుఁడైన నానలెనే మోహదృష్టులతో నామెవంకఁ జూచెద రేమోయను నసూయయు నామనమున నుదయించెను. మోహ మెంతకైనఁ దగునుగదా!"

మహామోద సంధాయకం బగు యౌవనాంకూర సమయావస్థ జ్ఞప్తికిరా నించుక మనసు కలగుంచుపడి సాలూరు రేడు తత్కాలకృత చిప్పితములచుంగు నిమగ్న చిత్తుఁడై కొంతవడి యుట్టె యుండెను. ఆవల రెండుసమిమషు లవలకుఁ దదవస్థను ధ్యానించువాఁడుపోలె నిమీలిత నేత్రుఁడై, ఫాలభాగన్యస్తహస్తుఁడై యుండి, గొంకునిట్టూర్పుసిగిడ్చి పదంపడి పిల్ల చెప్పనారంభించెను.



## పదునొకండవ ప్రకరణము



### సాలూరురాజోక్త కథాశేషము.

నేను బ్రకృతము యౌవనావస్థను జాలవఱకుఁ గడపి, నిరంతర ఖేదముచేతను, నిద్రాహారలోపముచేతను, గృశించి, నవకముకోల్పోయి, యీరీతినున్నను, బూర్వము నేను వచించుకథాకాలమున సౌందర్య

వంతుఁడనై యుంటినని యే జనులు చెప్పుకొనుచుండిరి, అట్టి న
న్నుఁజూచి యామెయుఁ బ్రేమింపక పోదని తలఁచితిని. కాని యామె
పండ్రెండేండ్లుమాత్రమే వయస్సుగల ముగుద నాకా యామె ప్రేమప్రభా
వముపూర్ణముగాఁ దెలియునప్పుడామె కెట్లు తెలియఁగలదు? ఇట్లుకొన్ని
మాసములు గతించినవి. దినములసంఖ్య హెచ్చుకొలఁది నామనంబున
మోహ మతిశయమగుచుండెను. అంత నొక్కనాఁడు సహాధ్యాయుల
గాని భటులుగాని నాతో లేనిసమయమున నేనా పేదరాచకుటుంబము
నివసించుతావువైపు పోయితిని. అప్పుడాకన్య యెచ్చటికో పోయి
వచ్చుచున్నది. అడఁబోయినతీర్థ మెదురయి నట్లాయెను. ఆమెనాకు
గాన్పించుటెట్లని తలపోయుచున్న నేను, వెంటనే యామెను జూచు నదృ
ష్టము పొందితిని. చూచుటయే కాక సంభాషించుటయుఁ గల్గెను. ఎట్లన
నాకన్య వచ్చునప్పుడొక కుక్క యామెనుజూచి మొఱిగి యామెపై
బడనుండెను. స్త్రీజనసామాన్యమగు భీరుత్వముగల యామె వేగముగ
ముందునకడుగులిడఁజొచ్చెను. శునకము నతిగంత మార్చుచు సమీపించు
చుండెను. ఇదే తగిన యదనని యొక చిన్నరాతితో నా జంతువును
గొట్టితిని. కొట్టడనే దానిగర్వమడంగెను. అది వెనుదిరిగి యఱచి పాఱె
ను. నేనా కన్యనుడగ్గఱి 'చానా! భయపడకుము. శునకము పాఱిపోయి
నది' యని చెప్పితిని, అప్పుడామె తనయింటికి బదిబారల దూరమున
నున్నది. నన్నుఁజూచినతోడనే యామె, 'అయ్యా! మీకుఁగృతజ్ఞురాల
ను. మీరు రానియెడల నాదుష్టశునకము నన్నుఁగఱచియుండును.
నా పాలిటిదైవమువలెవచ్చితిరి' అని ప్రస్తుతించినది. ఏమి యామెకంఠ
ధ్వని! వీణాతంత్రీనినాదమువలె మనోహరంబై వినంబడినది. నేను నామె
నుడులచే సంతోషపరవశుఁడనై కొంతవడినటులే నిలిచి క్రమ్మఱఁ దెలి
వొంది, 'బాలా! నీవబలవు మహాభీతచేతస్కురాలవు, నీపూలబుట్ట నా
చేతికిమ్ము. నీయింటిదాఁక పట్టుకవచ్చెదను.' సాటిరాచకొలమునఁ బుట్టి

నవాఁడగుటచే నింతమాత్రపుసాయము చేయనోపుదు, నంటిని. ఆమె
యు మందహాసాంచితవదనసరోరుహయైకరకమలంబులుసాచి పుట్టిక నా
చేతికిచ్చెను. అంతమాత్రమున నేనాకనిర్వచనీయానందము కలిగెను. దారి
లో నామె 'ఆర్యా! మీరు మాయింటికి దయచేయుఁడు. మీరు నా
కొనర్చిన సాహాయ్యమునకు మాజనయిత్రి కడుసంతసించి యాదరించు'
నని పల్కెను. కాని నేను "చిన్నదానా! నేనిప్పుడు మీగృహములోనికి
రాను. గుమ్మమువఱకు నీతో వచ్చి మరలిపోయెదను. నీవు మీయమ్మ
తో నన్నుఁ గలసికొనిన యంశ మేమియుఁ జెప్పకుము. ఆపె యేండ్లు
మీఱినది కావున నీవంటి నవయౌవనాంగి నావంటిపడుచువానితో భా
షింపనొల్లదు. మనసమాగమము రహస్యముగానే యుంపుము. దయ
యుంపు" మని యామెను గృహద్వారముకడ దిగవిడిచితిని. ఆమెయు
నాకోరికఁ దీర్చెదనని వాగ్దానముచేసినది. ఇట్లామెతోఁ బరిచయుండనై
యనురాగాంకురము నామె హృదయమందు నాఁటి మరల నాబసకు
వచ్చితిని. మఱియొక పర్యాయమామె శివాలయపుఁదోఁటలోఁబుష్పము
లుకోసికొని తోఁటగుమ్మము వెలువడివచ్చుచుండ నామెనుదారసిల్లుట
తటస్థించెను. ధారుణి యంబాపూజాధురంధరురాలు. ఆమెకొఱకే య
ట్లు జగదంబ కుసుమాపచయంబుఁ జేయుచుండెను. అప్పుడుకూడ నామె
నాతో నెంతయో వినయముతోఁ బ్రేమైకవీక్షణములతో ముగ్ధవనితా
సామాన్యసహజవైఖరితో భాషించినది. క్రమక్రమముగా నేదితో
షమయమును జూచుకొని నేనువారమునకు రెండుమూఁడుసారులామెను
దర్శించుచుంటిని. కనంబడినప్పుడెల్ల నాయుల్లముఁ బల్లవింపఁజేయుపలు
కులతో మాటలాడుచుండెడిది. కాని యొక్కమాటయైన మాసమాగ
మమునుగూర్చి తల్లితో వచించినట్లు కాన్పింపదు. ఇట్టి సమాగమము
లు గుప్తముగా నుంచుటయే లెస్సయని యెంచి యామెయట్లాచరింప

లేదు. ఒకవేళ నిట్టివి చెప్పినఁగనరునో మఱియేమనునోయని యేయూగ కున్నది. అదియునుంగాక యేనవయౌవనాంగి, యెంతకుమతిశిక్షనొం దినదైన, నిట్టివయసుఁ దన హృదయస్థితానురాగముచు దనంతఁదానే యెట్లు వెల్లడింపగలదు? ఇట్లు నెలలు గడచిపోయినవి. ఆమెకుఁ బదు నాలుగేండ్ల ప్రాయమువచ్చెను నేను బదునెన్మిదేండ్లవాఁడనైతిని. ఆ యేఁడు మహాశివరాత్రినాఁడు మేమెల్లరముఁ బ్రాతఃకాలమునస్నానము లాచరించి, ధౌతవస్త్రధారణముంజేసి, దేవళంబునకుఁజని ప్రార్థనాది కంబులు సలిపితిమి. మాగురూత్తముఁడు తన బ్రాహ్మణశిష్యులతో నుపవాసముండి యచ్చోటనే యాఁగిపోయెను. నేను నేవకాద్వితీయుఁడ నై మన్మందిరమున కేతెంచితిని. ఆశివాలయమంత ప్రసిద్ధికెక్కినది కాకపోయినను గొలఁదిగానైన నట్టిపర్వదినములం దుత్సవములుజరగక పోవుటలేదు. ఆనాఁటిరాత్రి స్వామిసేవజరగును. చాలమందిజాగరము చేయుదురు. అట్లుచేయువారిలో మాగురువుగారును గొందఱు శిష్యు లునుగలరు. వారలఁ జూచుటకు రాత్రి భోజనానంతరము నేనుగూడ గుడికేఁగితిని. అప్పుడు జగదంబయుఁ దల్లిని వెంటఁబెట్టుకొనివచ్చి యు త్సవస్థలమున నాఁడువాండ్రుగూర్చుండుచోటఁ గూర్చుండెను. పట్టపగటి వలెనున్న దీపములకాంతి నొండొరులమొగములు చూచుకొంటిమి. ఆమె వికసితాననాంబుజముతో నావంకఁజూచినచూడ్కులిష్టమునయి తము నా కన్నులఁగట్టినట్లున్నవి. కొంతసేపు తల్లితోఁబాటు తానుగూడ నుత్సవమవలోకించి, దరిదాపు రెండుజాములరాత్రియగుడు నింటికిఁ బోదమా యని యామె తల్లితోననెను. ధారుణి"అమ్మా! నేఁడు నేను నిద్రపోను. నీవు చిన్నపిల్లవు. మేల్కొనఁజాలవు. ఇంటికేఁగి తలుపు లోపల గడియవైచుకొని యింటివారికోడలిని సాయముగానుంచు కొని, జాగ్రత్తతోఁబండుకొనుము. ప్రాతఃకాలమున నేవచ్చి నన్ను మ రల స్నానముచేయించి, దేవతాదర్శనముఁజేయించి కొనిపొమ్ము. తల్లీ!

పొమ్ము పొద్దుపోయినది” యని పలుక నాసుశీల లేచి తనయింటి కరుగుచుండెను. అప్పుడే నేనుగూడ మాగురువుగారికడ ముడలఁగై కొని గుడివిడిచి యీవలకువచ్చి జగదంబనుగలిసికొంటిని. “ఆహా నా పేరు జగన్నాథుఁడు. ఆమెపేరు జగదంబ. పరమేశ్వరుని కృపవలన మాకుఁజిరస్థాయిగా సమాగమంబు చేకూఱిన నెంత శోభాకరంబుగ నుండును? ఆమె పేదదైన నేమి? సుశీల, సురూప, సుకులజయైయున్నది గదా! నేఁడే సాహసించి నామనోగతాభిప్రాయమును వెల్లడించెద”నని నాలో నేననుకొని కల్యాణీ! ఇంటి కరుగుచుంటివా ? చీకటి, జాగ్రత్త యంటిని. ఆమెయు ‘ఓహో! జగన్నాథవర్మగారా ? మీరును బసకే పోవుచుంటిరా’ యని పలుకరించినది. నారూపమునుబట్టియు ,ధరించిన పరిధానములనుబట్టియుఁ,జరించుసంఘమునుబట్టియు నేనొకసాధారణపు ధనవంతుఁడైన రాచబిడ్డఁడనిమాత్రమా మెగ్రహించెను. నారాజబిరుదమామెకుఁ దెలియ బఱుపనైతి. ఆమెవైచినప్రశ్నమునకు నేనావని యామెతో నింటిగుమ్మమువఱకు వెడలితిని. మార్గమధ్యమందు నేనామెతోఁగాని యామె నాతోఁగాని మఱి మాటాడలేకుంటిమి. వలపునుదెలుపుటకు హృదయము వేగిరపడుచుండెను. కాని ధైర్యముచాలదు. తుదకెట్టులో తెగువఁజేసి గృహకవాటముఁ జేరినతోడనే యామెతోనిట్లంటిని ‘సుందరీ! నిన్ను రెండువత్సరములనుండి చూచుచుంటిని. ఈపట్టణముందుఁ బ్రవేశించినదాది విద్యయందును నీపై ననురాగమందును వృద్ధినొందుచుంటిని. ఎప్పటికప్పుడే నాహృదయస్థితాభిప్రాయమునునీకు నివేదింపవలెనని ప్రయత్నించితిని. కాని సాహసముచాలమి నట్లుచేయలేకుంటిని. నేఁటికి నాకట్టిభాగ్యమబ్బినది నేనుత్తమక్షత్రియకులజుఁడనని నీవెఱుఁగుదువుకదా! నీ రూపసుగుణాతిశయములునన్నాకర్షించినవి. నిన్నుద్వాహమాడి నాజన్మము పవిత్రముచేసికొనవలయునని యున్నది. ఇన్నినాళ్ళనుండియు నీవు నాతో సదయశీలతవాక్యములు

పలుకుచుంటివిగావున నాప్రార్థన మన్యథాయూహింపవనునమ్మిక ని
ల్లుకుచున్నాను నీవు నాకోర్కె సఫలము సేయుదే?" ఆమెయు నావైపు
కొంచెము సేపుచూచి యవనతవదనయై యంగీకారమును జూపులయం
దును జిఱునగవులయందును సూచించెను. "నాజననితో సావకాశముగా
మాటాడిమీకుఁ దెల్పెదను, మీవంటియుత్తములతోడి సంగతమాకెట్లు
లభించును? నాకు సెలవుదయచేయుఁడు" అని పలుకుచు బజాలునఁ ద
లుపుఁదీసి లోనికిఁజనెను. నాకుఁగల్గిన యానందము నీవు మనస్సుననూ
హింపవలయునే కాని నోటవచించుటకు భాష చాలదు. నేనుదలఁచుచుగా
నన్యథాక్రాంతచిత్తుఁడనయ్యు, నీవత్సరద్వయములోఁ బంచకావ్యముల
ను ముగింపఁగల్గితిని. అంత గురువుననుమతిఁబొంది స్వగ్రామమున
కేఁగితిని. నాతండ్రి పెద్దవాఁడగుటచేతను, నాయన్న దుస్సహవాసముల
వలనఁ జెడిపోయి సొమ్ము వమ్ముచేయుచుండుటచేతను, నన్ను మరల
విజయనగరము పోవలదనియు, విశ్వనాథశాస్త్రిగారికి ఘనముగాగురు
దక్షిణయిచ్చి రావలసినదనియు నాజనకుఁడు నాకాజ్ఞాపించి తిరుగవిజయ
నగరము నన్నుఁబుచ్చెను. నాకమితవిషాదము తోఁచెను. విద్య మాన
వలసివచ్చెనను విచారమంతగా లేకపోయినను, జగదంబమోముఁదవ్వు
దూరమగుననుఖేదము నన్ను బాధింపఁదొడఁగెను. విజయనగరముఁజేరితి
ని. శాస్త్రులవారికి బహుమానమొసంగి దీవనలఁబొంది ముదలఁగైకొం
టిని. ధారుణి యింటికిఁ జని యింటిముంగిటఁ గొంతసేపు పచారము
చేసితిని. అంతనొక బిచ్చగాఁడు దీనాలాపములతో గుమ్మముకడ మొర
పెట్టెను. దీనాలాపములు శ్రవణగోచరము కాఁగానే జగదంబ పిడికెట
బియ్యముఁ బట్టుకొని యీవలకువచ్చెను. అప్పుడామె తలయంటుకొని
యున్నదికాఁబోలు ; నల్లని నెఱికురులు విరియఁబోసికొనియుండెను.
వినిర్మలధౌతవస్త్రధారిణియైయుండెను. సహజసౌందర్యాలంకారము
తప్పనన్యమగునగ యామె యొడలిని లేదు. అయిన నత్యంతలావణ్య

రాశియై చూపఱుల కాశ్చర్యమునుగొలుపు తేజముతో నొప్పుచుండెను. ఆమెనన్నుఁ జూచినతోడనే వికసితవదనయై "అయ్యా! మీ రేఁగి వారమైనఁగాలేదే. ఏల యింతవేగముగా మరలితిరి? సుఖులా?" యని ప్రశ్నించెను. నేను సుఖుఁడనని వచించి పిత్రాజ్ఞను దెలియఁజేసితిని. ఆమెయు విన్నఁదనమూననంబునఁదోఁపఁ దలవంచి మిన్నకుండెను. అప్పుడు నేను "శుభాంగీ! నీతల్లితో నాయీప్సితమును జెప్పితివా? ఆమె సమ్మతించెనా?" యని యడిగితిని. లేదని యామె మార్వలికె. రెండు సంవత్సరములనుండి దినదినప్రవర్థితంబైన యనురాగమును నేనే వెలిఁబుచ్చలేకపోయితిని. అబల, అస్వతంత్రురాలు, అల్పవయస్కురాలు, ఎట్లుతెగించి తల్లితోఁ జెప్పఁగలదు? అనంతర మామెను భారుణి దర్శనముఁజేయింపుమని యడిగితిని. ఆమెవల్లెయని నన్ను లోనికిఁ గొంపోయి "అమ్మా! నీతో మాటాడవలెనని వచ్చినా" రనెను. ఆవాక్యమందుఁ గర్త నామె చెప్పలేకపోయెను. ఎవరో వచ్చిరనిన నన్యృతమగునని యట్లు చెప్పలేదు. తల్లి 'యెవరమ్మా' యని యనుగ, జగదంబ మనోభావమును నేను గ్రహించి "అమ్మా! మాది సాలూరు; నాపేరు జగన్నాధవర్మయందురు." అని 'జవాబు' చెప్పితిని, ఆమె 'నాయనా! దయచేయుఁడు. ఏమిపనిమీఁదవచ్చితి"రని సన్నడుగ నేనెట్లు సంభాషణముఁ బ్రారంభింపవలెనో నేరక కొంతసేపూరకుంటిని.తుదకిట్లంటిని. "అమ్మా! నేను రెండుసంవత్సరములనుండి యీయూరిలోఁ జేరివిశ్వనాధశాస్త్రిగారియొద్ద విద్యాభ్యాసము చేయుచుంటిని. ప్రతి సాయంకాలమునను శివాలయమునకుఁ బోవుచుంటిని. ప్రతిదినమును శివదర్శనముకంటెఁ బ్రీతికరంబైన మీయిరువురముఖదర్శనములఁ జేయుచుంటిని. ఇన్నినాళ్ళును మీతనయ సుగుణాదివిశేషములు గమనించుచుంటిని. ప్రథమవీక్షణమందే యామెయందు నాడెందములగ్నమయ్యెను. మీయాజ్ఞలేనిదే యామెతోఁ బలుమాఱు ముచ్చటించితిని. ఆమె

యు నన్నుఁజూచి మెచ్చుకొనినయట్లే నేను భావించితిని. ఈనాఁడు
శివరాత్రినాఁటిరేయిని, నాహృదయమందుఁ బూర్ణభవించియున్న
యనురాగరసమును నీసుతకడ వెడలఁగ్రక్కితిని. ఆమెయు నంగీకార
సూచకదృష్టులు నాపైఁబఱపి మీతో మాటలాడి సావకాశముగా నా
లోచించి చెప్పెదనన్నది. సిగ్గుపైకొనుటచే నట్లు చేయఁజాలక పోయి
నది. తమకు సమ్మతమైన నేను మీయల్లుఁడనై యీసేవ సేయనెంచి
యభిలాష నొందియుంటిని. మీయనుమతమును దెలిపి నన్ననుగ్రహింప
వేఁడెదను." ఈనుడులువిని యాపె మొదట నించుక కోపగించినది.
'నాబిడ్డమనసు కలఁచివైచితివా? నాతో నేమియుఁ జెప్పనిదాదేమి?
నీవెవఁడవు? అని తెలియక పలికినది. కాని, కూఁతురు సమీపించి యా
వద్వృత్తాంతమును శాంతముగా నివేదించినపిమ్మట యాథార్థ్యమును
గ్రహించి 'అయ్యా! నీతలిదండ్రులెవరు? నీస్థితిగతు లేమి? నీవయసెంత?
అంతయు నెఱుఁగఁజేయుము' అని యడిగినది. ఆమెప్రశ్నలకు సదుత్తర
ములను జెప్పితిని. నేను సాలూరుజేనిపుత్త్రుఁడనని విన్నప్పుడు జగదాంబ
నిశ్చేష్టయైనది. ఆమెతోనహా నాప్రాభవమునుగూర్చి చెప్పియుండ
లేదు. ఆమె నన్నడుగనులేదు. నాపై నామెకు జనించిన ప్రేమ కేవల
హృదయజన్యము. నాబాహ్యస్థితిగతులనుబట్టి యది గలుగలేదు. భా
రుణియు నివ్వెఱపడి "అయ్యా! నేను దమసంగతి తెలియక యవా
చ్యములు పలికితిని. నన్నిప్పుడు మాయమ్మాయి తన హృదయ
నైర్మల్యమునుగూర్చి వచించినది. మీయట్టివా రయాచితముగ మా
వంటి నిరుపేదలతో సంబంధమును జేసికొనుట కంగీకరించుట మాపూ
ర్వకృతపుణ్యఫలము. కాని, మీరస్వతంత్రులు. తల్లిదండ్రులచాటున
నుండువారు. మీజనకుని యాజ్ఞఁగైకొని యిటకువచ్చితిరో, లేక, మీ
స్వబుద్ధిచే నిటకువచ్చితిరో, యెఱుఁగఁగోరెద. మీతండ్రిగారు మాతో
సంబంధమున కంగీకరింతురేని నాకొమార్తెను మీకొసంగి ధన్యురాల

నై శేషకాలముమీాకడనే కడపెదను. అట్లుకాక మీరిష్టపడి తక్కుం
గల మీ పెద్దలు వ్యతిరేకభావమును వహించిన నా బిడ్డబ్రతుకెందునకు
గాక చేసెదను." అని చెప్పెను. ఆమెవాక్కులు సహేతుకములగుటచే నే
నును మాతండ్రియనుమతినిఁ బొంది వచ్చెదనని వారియొద్ద సెలవుదీసి
కొని యనోన్యవాసి సాలూరుఁ జేరితిని పిమ్మట నొకనాఁడుమాతండ్రి
యుత్సాహముగానున్న సమయముఁజూచి, వినయమున నతనిసమీపించి
నామనోరథ మెఱింగించితిని. అతఁడు నాపలుకులు వినినతోడనే
మహాకోగ్రుఁడై, ఓరోరి! దుర్మార్గులారా! నాకడుపునఁ జెడఁబుట్టితిరిరా.
పెద్దవాఁడా, దుశ్శీలుఁడై కష్టులతో సహవాసముఁజేయుచుఁ బాడగు
చున్నాఁడు. నీవు, ముండబిడ్డతో సంబంధబాంధవ్యములు
జరపి యుచ్చమగుకాలమునకు మచ్చఁదెచ్చుచున్నావు. ఎందరో మహా
రాజులు తమకూతుల నీకీయసిద్ధముగానుండ నీకాభిక్షుకులస్నేహమెట్లు
నంప్రాప్తమయ్యె? పండ్రెండేండ్లనుండియు విజయనగరములోనుండి యిది
యీా యెవ్వరుచేసినపని? కానిమ్ము. నాకంఠములోఁ బ్రాణమున్నంతవఱకు
నీకాసంబంధము జరగనీయను. మీారన్యోన్యము నుత్తరప్రత్యుత్తరము
లుజరపుకొనకుండఁ దగినకట్టుదిట్టములఁ జేసెదను. ఇప్పుడే ధారుణియను
నాబిచ్చపుముండకునీయెడ నాశవదలుకొనుమని జాబువ్రాసిపంపెదను.
నీవు నామాట వినఁదలఁచితివా నీకు గొప్పసంబంధముచేయుటయే కాక
నాస్వార్జితపుటాస్తియంతయు నీకిచ్చెదను. లేకున్న నిన్నుఁ బకీరును
జేసెదను." అని కోపకషాయితాక్షుఁడై పలికెను. ఈభయంకరవా
క్కులువినిపిడుగుపడినయట్లుమాన్పడిపోయితిని. కాలుసేతులాడలేదు.

ఇచ్చట మరల పద్మభవు కొంతసే పూపిరినిమిత్తము నిలిచెను.
ఒక యరగడియవఱకట్లుండి క్రిమ్మఱ నిట్లు వచింపమొదలిడెను.

ఇట్లు మఱియు రెండేండ్లుగడచెను. ఈలోపున నెన్నియోజాబు
లుబగదంబపేర వ్రాసితిని. ధారుణిపేరవ్రాసితిని. ఒకదానికినిఁబ్రత్యు

త్తరము లేదాయె. నేను బంపిన మనుష్యులేమైరో నాకేమియుఁ దెలియ కుండెను. చండశాసనుఁడగు నాతండ్రిని వారలఁగూర్చి యడుగుటకు సాహసముచాలదు. కడపట నొకలేఖ నిట్లు తేటమాటలుగలయొకపద్య మున వ్రాసిపంపితిని.

మ॥ తరుణీ! నిన్విడనాడుట్టాదిగ మదిన్ ♦ దాపంబు పెల్లయ్యె! నే
కరణిన్ జూచినఁ గష్టసంచయములే ♦ కన్పట్టెడున్; గాని, శ్రీ
కరుఁడే యాపదలెల్లఁ బాపి మనలన్ ♦ గాపాడి చేకూర్చునన్
బరిపూర్ణంబగు ధైర్యమొప్పె నెదలో ♦ భాగ్యంబదెట్లుండునో."

నాకుఁబ్రత్యుత్తరములు లేకపోయినను నిరాశఁజెందకుంటిని. పవి త్రమగు మాయన్యోన్యజనితానురాగమే జయము సమకూర్చునను ధై ర్యము కలుగుచుండెను. అప్పటికి నాకిరువదేండ్లును జగదంబకుఁ బదు నాలేండ్లును వయసువచ్చెను. ఇరువురును బూర్ణీభవించిన యౌవనము దుంటిమి. ఇట్టితరుణమున నాయన్న మితిమీఱిన మధుపానముచేఁ గాలధర్మమొందెను. అతనికి బిడ్డలులేమిని నేనేపట్టాభిషేకార్హుఁడనై తిని. సతీవియోగంబునకై పరితపించుచున్న నామనంబు భ్రాతృవి యోగంబుచే మఱింత తహతహపడఁజొచ్చెను. మఱియురాజ్యభార వహనక్లేశమొకటి యెదురుచూచుచున్నది. నాసోదరుని పారలౌకిక క్రి యలు ముగిసినవి. నేనెట్టులైన సందుఁజేసికొని విజయనగరమునకొక్క తూరి పోవలెనని ప్రయత్నపడుచుంటిని. అట్టితఱిని బుత్రశోకము తోఁగుందుచున్న నాజనకుఁడు నన్నుఁజేరఁబిలిచి "కుమారా! నీస్థితి యిప్పుడు మాఱినది. ఇదివఱకు నీవు కాఁగలరాజుతమ్ముఁడవు. ఇప్పుడు కాఁగలరాజువే. మఱియు నీవింతకుఁబూర్వమొకవిధమైన యున్మాద రోగముచే నాక్రష్టుఁడవై యుంటివి. ఇప్పుడది నివారణమైనదా? అయి యుండుననియే నాయూహ. ఒకవేళ నారుగ్ణతయుంకను, నిన్నుఁ బీ

డించుచుండిన నీకొకయుపదేశము చేసెదను వినుము. నీవిరువదిరెండవ యేఁడు ప్రవేశించునఱకు ఓపికపట్టుము. ఈలోపుగా నెక్కుకమ్మయైన నాదిక్కుమాలిన యాఁడువాఁడ్రకు వ్రాయకుము. అప్పటికింకను నిన్నా పిశాచము వదలకుండునేని నీయిష్టముచొప్పునఁ బ్రవర్తిల్లుము. నేనడ్డుపెట్టను. పెట్టఁజాలను. నీకుఁ బట్టాభిషేకముచేసి, నేను రామా కృష్ణాయనుచు జపము చేసికొనుచుందును. నీమేలునుగోరి చెప్పుచుంటి నిగదా. నీవు ప్రతికాలసంబంధమును సమకూర్చుకొంటివేని దానిఫల ము నీవేయనుభవింతువుగాక. నీకుఁ బట్టముగట్టులోపున నీవు ప్రసిద్ధ మైన రాష్ట్రములకేఁగి యందలి రాజ్యాంగవిషయములఁ జక్కఁగాగమ నించిరమ్ము. నేను నీకొసంగిన స్వాతంత్ర్యము వృథపోవదనియు, విద్యా వివేకనిధివగు నీవు పితృవాక్యపరిపాలనాఫలము నెఱిఁగి వర్తింతువనియు నమ్మికతో నిన్నుఁ బుచ్చుచున్నాను. మీఁద నీయిష్టము." అని సాదర ముగాఁ బలికి, కన్నులనీరునించెను. అతఁడు నాయన్న చిన్నదాది పిచ్చి వానివలె నుండెను. చెప్పినమాటయే చెప్పుచుఁ జేసినపనియేచేయుచు నుండెడివాఁడు. విసుగు, కోపము మఱింతయధికమైనవి. కాని సహజ కారుణ్యమప్పుడప్పుడు పొడచూపకపోవుటలేదు.

ఆరీతిని నాతండ్రి స్వాతంత్ర్య మిచ్చినతరువాతఁ బితృవాక్యపా లనము, సత్సతీపాణిగ్రహణధర్మము, అను రెండువస్తువులను మానసతుల యం దిరుగడలఁ దూఁచి చూచితిని, రెండవదానివైపునకే ములుసూపి నట్టు నాకుఁ బొడఁగట్టెను. నేనాలస్యముచేయక విజయనగరమునకుఁ బయనమైతిని. ఎట్టులో రెండునిండువత్సరములు గడపి నేను మరల నా ప్రేమైకనిధానమును, నావలపులబరణిని, నాయన్నులమిన్నను జూచు వేడుకతో నాకుటీరద్వారమును సమీపించునప్పుడు! నాగుండియ లెట్టుకొట్టుకొన్నవో నేఁజెప్పఁగలనా? నేను గృహాకవాటమువంకఁ జూడ వెలవెలఁబోయియున్నట్లు కాన్పించెను. అరమూయఁబడిన తలుపును

దోసి లోనికరుగ నాప్రియురాలు కపోలన్యస్తహ స్తయై, మోమునందు దీనత్వము తోఁప, నొకవృద్ధదాసి చెప్పువలుకు లాలకించుచుఁ గూరు చుండియుండెను. ఆమెవైఖరిఁజూచి నేను నిర్వారపడితిని. షోడశకళాపరి పూర్ణమా చంద్రబింబమువంటి యామెముఖమండలము కృష్ణచతుర్దశీ చంద్రునిఁబోలి కళావిహీనమై యున్నది. క్రొక్కారుమెఱుపుఁదీగవలెఁ బ్రకాశించు తనులత గ్రీష్మప్రతప్తమల్లికావల్లికవలెఁ గమలి నవకము చెడియుండెను. ఆమెనన్నుఁ గాంచినతోడనే గొల్లుమని వెక్కి వె క్కి యేడువసాగెను. కారణమరయఁగా మెజనని మృతినొందెనని తె లిసినది.ఎంతకఠినహృదయుఁడనైన నామె యట్లువాపోవుచుండ సహింప లేకపోయితిని. నేనును బొటబొటబాష్పములు రాల్చి యామెను సమీపించి 'మనోహారిణీ! వగవకుము. నిన్ను సర్వవిధముల నాదరించు వాఁడను నేనుండ, నీకు విచారింపఁబనిలేదు." అని యోదార్చితిని. ఆమె యించుక కలఁతదేఱి "ఆర్యపుత్రా! మీరు నేఁడు రాకుండిరేని నే నేమైయుందునో! నా కేరును దిక్కులేమికి నిరాశఁజెంది నేను ప్రాణత్యా గముఁ జేసికొనెదననుచుంటిని. నాదాసి యూరడించుచున్నది. మీరు వత్తురనునాశ లేశమైన నొందియుండలేదు. మీరెన్ని యోకమ్ముల వ్రా సితిరి. కాని కడపటిదొక్కటితప్ప నితరమైనవానిఁ జూడలేకుంటిని.నా తల్లిప్రతిలేఖ తానేవ్రుచ్చుకొని చించివైచుచుండెడిది. కారణమేదియో తెలియదు. ఒకవేళ మీతండ్రిగారు మొదట వ్రాసినజాబునం దేమైనఁ గఠినంపువాక్యములుండఁబోలు. నన్ను మీవిషయమైనయాశ వదలు కొనుమని చెప్పినవి. ఆమెహఠంబున మరణమొందినది. ఆమె చనిపో యినతరువాతనే మీపద్దెంపుఁగమ్మ యందినది. అందలి ముద్దులొల్కు పదములే నన్నింతవఱకు జీవించునట్లు చేసినవి. " అని మృదుమధుర వాక్కులతో వచించినది. ఆవీణానిక్వణన తుల్యవాక్యములు నావీనుల

బడినప్పుడు నేనువచింపరాని యానందమొందితిని. నాస్థితిగతులు మా టయు, నాతండ్రి తన యభిప్రాయము చెప్పుచు సర్వము నాయభీష్ట మెటులో యట్లేజరప నాజ్ఞయిచ్చుటయు, నంతయుఁ జెప్పితిని.ఆమె య ప్పుడించుక సంతోషాక్రాంతచిత్తయైనట్లు కన్పట్టెను. ఆమె వదనశశి బింబము నావరించిన దుఃఖాంబుదములను నావచనమారుతము లించు క చెదరఁగొట్టఁగల్గినవి. అశ్రుజలబిందుసందోహములచే మలినవంతము గాఁజేయఁబడిన యాకపోలమును నేనుత్తరీయాంచములచేఁ దుడువ నందలి సహజకూశ్మాకశోణకాంతులు వెల్లడియయ్యెను. ఆమెను గాంధ ర్వవిధిఁ బరిణయమాడెదననియు, వందుమంత్రములు. సుముహూర్త ము మున్నగునవి యక్కఱలేదనియు నేనామెతోఁ జెప్ప, నిష్కళంక హృదయయగు నామె నన్నే ప్రశ్నములడుగక యే సమ్మతిని జెలునగవు చేఁ దెల్పెను.అప్పుడే యీశ్వరసాక్షికముగా నేనామెను బాణిగ్రహణ మొందితిని.కాని యీసంగతి కొంతకాలమువఱకు నెరులకుఁ దెలియ నీయవలదని చెప్పితిని. వినసుశీలయగునామె వల్లెయనియె. నేనొక పక్షము మాయూరనే మారుపేరితో నపరిచయస్థులయింట మెలఁగితిని. ప్రతిదినము నను నాహృదయేశ్వరిని దర్శించి వచ్చుచుంటిని. మఱియు మహారాజుగారి ప్రధానవర్గమునుండి రాజకీయవిషయములను దెలిసి కొనుచుంటిని. ఇట్లు పదునేనుదినంబులు గడచినపిమ్మట, ముసలిదాసి నింటఁగాపుంచి మేమిరువురము బయలుదేఱిపీఠికాపురమునకు యాత్రా ర్థమై యేఁగితిమి.అచ్చటనుండియే నాతండ్రికి లేఖవ్రాసితిని. కాని,యందు మా పెండ్లివిషయమై యేమియును వ్రాయలేదు. పీఠికాపురములో నైన మాజనకునికిఁ బరిచయులగువారికిఁగన్పడక, వరగృహమునందే బసచేసి, యక్కడి రాజ్యపద్ధతుల నెఱింగితిని.అచ్చట నాద్వితీయప్రాణ ముతో నిరంతరసౌఖ్యవైభవము లందుచుండ నాతండ్రికిఁ బ్రాణము మీఁదికివచ్చినదనియు, వెంటనే బయలుదేఱి రావలయుననియుమామం

తిరి తొందరగా వర్తమానమంపెను. నాగుండెలో రాయిపడినట్లుండె. ఎటుపోవుటకుఁ దోఁపదయ్యె. నాజన్మమునకుఁ గారణభూతుఁడై, కంటికి ఱెప్పవలెనన్ను సర్వదా కాచుచున్న తండ్రినిజూడక యుండలేను. నా ప్రాణమునకుఁ బ్రాణమై సమస్తమునకు నన్నే నమ్మియున్న మానవమణిని విడువలేను. పోనీ, ఆమెను గూడఁ దీసికొనిపోదమనుకొనినతీ జనకుఁడేమనునో! ఇట్లు చిత్తమం మత్తలపాటునొందుచు నేనుంటిని. అయ్యో! చింతలన్నియుమఱచి యీమహాత్ముని చెట్టబట్టియుంటిని నే! పట్టుమని కొన్నిదినములైన సుఖమనుభవింపకుండ నానాథుడు నన్నెడఁబాయవలసివచ్చెనే!" యని నాసతీమణి విచారించెను. మేముభయులముజాగుచేయక ప్రయాణమైతిమి. అనతికాలములోనే నిత్యప్రయాణములమీఁద విజయనగరము జేరఁగలిగితిమి. జగదంబను బూర్వపుఁగుటీరమున దిగవిడిచితిని. శీఘ్రముగఁ జనుదెంచి యామెను రాజస్థానికిఁ గొంపోయెదననియు, నంతవఱకు నూతనసమాగమము గుప్తముగా నుంపవలసినదనియుఁ జెప్పి వెడఁబఱచి సాలూరికిఁ బ్రయాణమైతిని. ఒండొరుల వియోగము మిగులఁగష్టముగాఁదోఁచెను. నేను బయలు దేఱునపు డాతన్వంగి హస్తలతలను నాకంఠమునకుఁ బెనవైచి, దీనత్వమును దెలుపు కనుఁదమ్ములు పైకెత్తి "నాథా! మిమ్ము మరల నెన్నఁడు చూడఁగలుగుదును? మీరువచ్చువఱకుఁ బ్రాణములు నిలుపఁగలనా? నాదినము లెట్లు పుచ్చఁగలను? నేను బట్టబహిష్కరింపఁగా నానక్కఱలేదు. సర్వకాలసర్వావస్థలయందును మీచెంతనున్నఁ జాలును." అని పలికిన నప్పటియాకృతి యిప్పటికిని నాయెదుటనున్నటులే చూపట్టుచున్నది. ఆకమలనేత్రములనుండి జాలువాఱునశ్రుబిందువులపై భానుకిరణములు వ్యాపించి, వజ్రకాంతులను వెదఁజల్లునపుడు, ఆ శాసనల్లమలు నాకంఠాశ్లేషమునర్పవింతహాయిచే నామేను పులకరించినపుడు, ఆవదనసుధాకరబింబమును నాముఖముతోఁ జేర్చి కడసారినన్ను ఓంబోష్ఠము

లతో ముద్దుగొనినప్పుడును, ఆమెరూపముమిక్కిలిదర్శనీయమైయున్నది. ఆరూపమే యీపటమునందు లిఖియింపఁబడినది అట్టిసుందరవిగ్రహమును, దివ్యసుందరవిగ్రహమును, మనోహరదివ్యసుందరవిగ్రహము నెన్నఁటికైన మఱవఁగలనా ? మఱవఁజాల. మఱవఁజాల. అని యాతఁడట్టె కన్నులమూసి మంచిముత్యములవంటి కన్నీటిబిందువులు రాల్చెను. ఆ సందరావుకూడఁ గన్నులనీరునించెను. కాని ప్రభువుమఱింత యధైర్యపడునని కష్టముమీఁద నాఁపుకొనెను.

మరల జగన్నాథవర్మ యిట్లువచింపఁదొడంగెను.

నేనుసాలూరేఁగితిని. నాజనకుఁడు మరణబాధఁ గొట్టుకొనుచున్నాఁడు. ధన్వంతరిసమానులగు రాజవైద్యులు వచ్చుచుఁబోవుచు నౌషధములిచ్చుచు లేపనములఁబూయుచు నుండిరి, యాతాయాతజనులకవధిలేదు. కోటయంతయు నల్లకల్లోలముగ నుండెను. నాతండ్రికి స్మృతిలేదు. నోటమాటలేదు. అర్ధనిమీలితనేత్రుఁడై దీర్ఘనిశ్వాసమునువిడుచుచుఁ బండుకొనియుండెను. నేనుదగ్గఱకుఁజని బోరుమనియేడ్చితిని. అందరునువచ్చి " బాబూ! అయ్యగారికేమియు భయములేదు. రెండుమూఁడుదినములలో స్వస్థదేహులు కాఁగలరని ధైర్యము చెప్పిరి. అట్లు చెప్పినవారిలో నాపినతండ్రియొకఁడు. మిత్రుఁడా! నీవతనిఁగూర్చి వినియే యుందువు. అతఁడొక శృంగారపురుషుఁడు. విషయలోలుఁడు. నియమరహితుఁడు. కాని యప్పుడాతనిసత్యవర్తన మంతగా నాకుఁదెలియకుండెను.అతఁడు నన్ను సాదరవచనములతో నూరడింప, నదియెల్ల నతని స్వభావజనితప్రేమయనియే భావించితిని. కాని, యావల నతని నిజమైననడవడి ననుభవముచే గ్రహించితిని. అతనికి నాయందుఁగల దయకుప్పొంగి, నారహస్యవివాహమునుగూర్చి యతనితోఁ జెప్పితిని. అతఁడు తన సంతోషమును దెల్పి యామోదించెను. ఆ యంతఃపురమున నేనుండవలసి యధికారమంతయుఁ దానేచూపు

చు మెలఁగుచుండెను. పెద్దవాఁడుగదా యని నేనూరకుంటిని. మఱియు లోకవృత్తినంతగాఁ దెలియనివాఁడ నగుటచే, వాని మాయావాగురలలోఁ బడిపోయితిని. అతఁడొకనాఁడు మాతండ్రి పండుకొనిన గది చుట్టునున్న రక్షకభటులను తేనికిమోసువ వస్తువనను వంకఁబెట్టి యావలకుఁ బంపివైచెను. నాఁడు నేను విజయనగరమునుండి వచ్చిన నాల్గవ దినము. మాతండ్రిగారికి నించుక సులువుగా నున్నదని వైద్యులు చెప్పుచుండిరి. అతఁడు మరల బ్రతికి బట్టఁగట్టునను ధైర్యముతో నేను నా యగారమున సుఖనిద్రఁబోవుచుంటిని. అర్ధరాత్రివేళ నైదార్గురుబలాఢ్యులు నాపైఁబడిరి. లాటీలతోఁ బొడిచిరి. నేనొక్క దెబ్బ పొడగనే స్మృతిఁ దప్పి నేలఁగూలితిని. క్రమ్మఱఁ దెలివొంది చూచునరికి నొక చెఱసాల యందుంటిని.

---

## పండ్రెండవ ప్రకరణము.

### కథాశేషము.

కారాగృహమునఁ బ్రభువుంపఁబడెనని విన్నప్పు డానందరావత్యాశ్చర్యమగ్నుఁడయ్యెను. ఎంతదారుణకృత్యముం జేసినను ముక్కుమీఁద వ్రేలువైచుకొని పలికెను. ఈయాపద నాటికి జరుగ పదేండ్లయినను, తాఁడిప్పుడు నయినతమ ఘోరకృత్యము తలఁపునకు వచ్చినప్పుడు దుఃఖమాఁపుకొనలేకపోయెను. అతఁడు కన్నులు తుడిచికొని మరల నిట్లు వాక్రువ్వనారంభించెను.

నేనుంపఁబడిన చెఱసాలలో దోషులుంపఁబడరు. మహాభాగ్యముగల వారు మాత్రమే యుచ్చటికిఁ బంపఁబడుదురు. నన్ను తాఁనపుమునుగ చిరి. నేనెంతవ్యక్తిగలిగి మాటలాడినను, నన్నుఁ బిచ్చివానిఁగ నే యెం

దయును దలఁచుచుండిరి. ఎన్ని విధముల మొరపెట్టిన వినువారు లేరు, అ క్కడి యుద్యోగస్థులతో నయమున, భయమునఁ బలికితిని. కాని వారు నామాటలెల్లఁ బెడచెవిని బెట్టిరి. ఏమిచేయఁగలను? హృదయవేదన నీ వూహింపవచ్చును. అందు నరకబాధ పడితిని. నాపినతండ్రి నన్నుం డుంచుటకుఁ గారణమేమన, నాతండ్రి తప్పక మృతినొందుననియు నేను మతిలేనివాఁడనగుటచే రాజ్యార్హుఁడను గానసియు, నాయున్మాద ము పోవువఱకుఁ దానే సంరక్షకుఁడుగ నుండవచ్చుననియుఁ తనజార త్వాదికృత్యములకుఁగావలసినంత ధనముదొరకుననియు,నతఁడభిప్రాయ పడెను. హంసతూలికాతల్పముమీఁదఁ బండుకొని, సేవకాజనము పరిచర్య చేయుచుండ,హాయిగా నిద్రననుభవించు నేను మురికికంబళిపై నొంటరిగాఁ బరుండవలసివచ్చెను. శాల్యోదనభక్షణము సేయు నలవా టుగలవాఁడను, రుచిలేనియన్నమును మందులను దినవలసివచ్చెను. అ మూల్యనాకూలములనుధరించు వాఁడను,రోగజనార్హ వస్త్రముల ధరింప వలసివచ్చెను. అందఱు నన్నుఁజూచి భయవినయములు చూపుటకు మాఱుగా నేనే యందఱికి వినమ్రుడనై యొదిగి యుండవలసివచ్చె. ఎట్టివానికైన విధిచెయిదముల దాఁటశక్యమా? ఇట్లు పదునెనిమిది మాసములు లానరకమందుంటిని.

ఆనం—పదునెనిమిదిమాసములే? కష్టసమయమున మీకుఁ దోడుపడవలసిన మీపిత్రృవ్యుఁడ కారణంబ యింతటి ఘోరకార్యమున కొడిగట్టెనా?

జగ—అవును. ఒడిగట్టెను. పిచ్చిలేకయున్న సంపుఁ గాఁపుర మున్న వానికిఁ బిచ్చియెత్తును. పరమపవిత్రియు, మహాసౌందర్యవతియు నగు నాయిల్లాలిమాట తలంపునకు వచ్చినపుడు నిజముగా నాకుఁ బిచ్చియే యెత్తుచుండెను. నాయాశాలవాలము, నాప్రేమంపుటిక్క, నాహృదయేశ్వరి, నాకు దూరము చేయఁబడుటచే నొక్కొక్కప్పుడు

నిశ్చయమైన యున్మాదావస్థయందుండెడువాఁడను. పాణిగ్రహణమును యమున నాకామె నొసంగిన యంగుళీయకమొక్కటియే నాయుసురులు నిలువఁగలిగినది. ఆయుంగరమును జేతఁబూని గంటలకొలఁది ధ్యానించుచుండువాఁడను. దానినే ముద్దుగొనుచుండువాఁడను. మరల శోకమాఁపుకొనఁజాలక కన్నీటివెల్లువ విడుచుచుండువాఁడను. అంతలోఁ దిరుగ నాలోచనాసమగ్నుఁడనగుచుండువాఁడను. ఒక్కొకసమయమున నామె నాయెదుట నుత్ఫుల్లసరోజనేత్రములతో, వికసితవదనసుధాకరబింబముతో, సుందరమందహాసచంద్రికలతోఁ గాన్పించుచుండెడిది. మఱియొకవేళఁ గడపట నామెను వీడి నేనువచ్చునప్పటి దీనదృష్టులతో, నశ్రుపూరితనేత్రములతో, మత్కంఠాలింగితహస్తములతోఁ బొడఁగట్టుచుండెడిది. ఇట్లుదినములు, వారములు, నెలలు, గడచుచుండెను. నాకారాటము హెచ్చుచుండెను. ఉన్మాదజనయోగ్యమందిరమున నివాసముచేయుటకు సర్వవిధములఁదగియుంటిని. నాకులోకమెల్ల నాసుందరమే. ఆవల నేమిజరగుచున్నదో తెలియదయ్యె. కొన్నాళ్లయినపిదప నాజనకుఁడు సజీవుఁడై యున్నాఁడనియు, మరణభయము ప్రకృతము లేదనియు, నొకనివలన వింటిని. అతఁడు జీవములతోనుండియు నన్నేల యిట్లుపేక్షసేయుచుండెనో తెలియకుండెను. నాతండ్రికొక లేఖ వ్రాయుటకు సెలవిమ్మని యచ్చటి యధికారిని నేనడిగితిని. కాని, యతఁడు తీవ్రవాక్యములతో నాప్రార్థనమును నిరాకరించెను. పాఱిపోవుటకేదైన సందుదొరకునేమోయని ప్రయత్నించితిని. ఎక్కడను సమకూడలేదు. "అయ్యో! నాబహిఃప్రాణమేమనుకొనుచుండునో నాయవస్థ నామె కెట్లు తెలియఁగలదు? ఆమెను విడిచితినని యెంచునా? అట్లెన్నఁడెంచుకొనదు. నాహృదయమామె కెఱుకయే కదా! నాకొఱ కీపట్టణమునకు వచ్చియుండెనా? వచ్చియుండినమాత్ర మెవరామె నాదరింతురు? ఇంత ద్రోహియగు నాపినతండ్రి యామె కేయపాయమును జేయకుండునే? ఆమె

యెట్లు బ్రతుకుచున్నదో! నేను వచ్చినప్పుడొక నెలకు మాత్రము
గావలసిన ధనమిచ్చి వచ్చితిని. ఈలోపున నామెకడకుఁ బోవుదునా
యని యింతకంటె నెక్కువ విత్తమిచ్చియుండనైతి. ఆమె యెట్టియిక్క
ట్టులు పడుచున్నదో కదా!" యనిపలు తెఱంగుల విచారించితిని. నా
కాంతను గూర్చి యున్న చింతదప్ప నన్యచింత లేదు. ప్రదేశతరమైనఁ
బ్రత్యక్షమై యొకయేఁడాదియై, నాకు విడుదల నొసంగిన మరల నావ
జీవము కారాగారజీవనము గడుప నేర్తుననుకొంటిని. మిత్త్రుఁడా! నాపరి
తాపమున కవధి లేదు. ఈ విషయముం గూర్చి యనవసరముగాఁ
గాలముఁ బుచ్చుచుంటిని. ఒకసంవత్సరము చెప్పిన ముగియని యం
శములున్నవి. త్రవ్వినకొలఁది నూత్నాంశములు తలఁపునకు వచ్చు
చుండును. తుదకొకనాఁడు కారాగృహాధికారి నాకడకువచ్చి, నన్నుఁ
గొట్టునుండి బయటికి రమ్మని పిలిచి, తనగదిలోనికిఁ దీసికొనిపోయి,
యర్హాసనాసీనుం గావించి, సవినయముగ నిట్లనియె. "రాకుమారా!
నిన్నింతకాలము చెఱసాలయందుంచి బాధపెట్టితిని. ఇందు నాయు
ద్యోగధర్మ మాచరించితిని గాని, ద్రోహబుద్ధితో నేమియుఁ జేయలేను.
రాజాజ్ఞను నెఱవేర్చితిని; గాని, వేఱుగాదు. కావున క్షమియింప
వేఁడెదను. నీవు నేటినుండియే విడుదలయయ్యెదవు. నీవు నీయిచ్చవచ్చిన
చోటి కేఁగవచ్చును." నాకు విముక్తియయ్యెనని మిక్కిలి సంతసించితి
ననుకొంటివా? లేదు. నాకు నా ప్రాణేశ్వరినిగూర్చి చెడ్డతలంపులు
పుట్టినవి. నాకు ముక్తిగలుగుట యామెదుర్దశను జూచుటకేయని భయ
పడితిని. నేను బరువైనమనస్సుతోఁ గోటకేఁగితిని. నాతండ్రి మృత్యువు
వాతఁబడకుండ బ్రతికియుంటయుఁ గాని పక్షవాతముచేఁ గాలు
సేతులు స్వాధీనము లేక బుద్ధి పూర్ణముగాఁ జెడియుండుటయుఁ గాంచి
తిని. మఱియు నాపితృవ్యుఁ డతనిశత్రువులలోనెవరిచేతనో తీవ్రముగా
గాయపరుపఁబడి మరణావస్థలో నుంటయుఁ జూచితిని. మొదట నాప్రియ

జనకునికడకుఁ బోయితిని. అతఁడు నన్ను గుర్తింపఁగలిగెనుగాని యంతకంటె నేమియుఁ బలుకలేను. నే నేయే బాధలు పడితినో, యెచ్చట నుంటినో, యతఁడెఱుఁగఁడు. అతనికి బాహ్య లోకజ్ఞానమే లేదు. అత్తటి నొకభటుఁడువచ్చి మాపినతండ్రి మరణబాధపడుచు నొక్క సారి నన్ను రాఁగోరెనని చెప్పెను. నాకట్టిమహాపాతక మొనర్చిన దుశ్శీలుని జూడకుంటయే మేలని మొదటఁ దలఁచితిని; గాని, యీలోక మునే విడిచిపెట్టనున్న వానికోరికఁ దీర్పకుండుట తగవుగాదని యతని సన్నిధికేతెంచితిని. అదియునుంగాక యతనినుండి నామనోనాయకు విషయమై యేమైనఁ దెలియునను నాశతోఁ గూడఁ బోయితిని. నేనేఁగి చూడ నతఁడు క్రమముగా క్షీణించుచున్నట్లు పొడఁగట్టెను. మృత్యు వప్పుడే యాతని నావహించినట్లుండె. తనకృత్యములకుఁ దగిన ఫల మీలోకమందే చాలవఱ కనుభవించి, యనతికాలములోనే యమసన్ని ధానమునకుఁ బోవనైయున్న వానిని నిష్ఠురములాడుట మంచిది గాదని యెంచి, యతని నేమియుననక మౌనముననిల్చితిని. అతఁడాయాస పడుచుఁ దాను నాకుఁజేసిన యపకృతివిధానంబంతయుఁ జెప్పెను. నారహస్యవివాహమునుగూర్చి యాతనితో నేఁ జెప్పినప్పుడనే, యతఁడు దానిని మూలాధారముగాఁ దీసికొని, నాకు ద్రోహము చేసి తాను లాభమునుబొందవలెనను బుద్ధితో నుండెను. అంతటి సంస్థాన మునకు రాజై, యొకనీచకులజను బెండ్లియాడి, యామెవలనఁ దగు లొక్కొని, లోకము నేమఱచి చరించుచుంటిననియు నందుచేతఁ గట్టడిలో నుంచుటకై తానట్లు నన్ను శిక్షించుచుండెననియు నాబంధువర్గమున కుఁ దెలియఁజేసెను. నాకుఁ గేవలమున్మాదమే గలిగెనని లోకమునకె ఱుఁగఁజేసెను. మాయాస్థాన వైద్యులు పరీక్షించి నాకుఁ బిచ్చియెత్తిన దని స్థిరపరిచినట్లు తెలియఁజేసెను. ఆవెజ్జులకు పుష్కలముగ లంచము లిచ్చెఁ గాఁబోలు. నాతండ్రి మృతినొందుననియు నన్నుఁ బిచ్చి

వానికి జనులు నమ్ముదురనియుఁ దన్నే తమయధికారినిగఁ జేసికొందు
రనియుఁ గొంతకాలమైన యధికారముఁజూపవచ్చుననియుఁ దనవ్యస
నకృత్యములు నిరాఘాటముగ జరపుకొనవచ్చుననియు నతఁడూహించె
ను. అతఁడు తలంచినట్లు నాతండ్రి చనిపోకపోయినను, బుద్ధిచ్యు
తుఁడై, యస్వాధీనదేహుఁడై యుంటచే నతని యాటలు కొంతవఱకు
సాగినవి. ఇప్పుడు నాకథయందలి మిగుల దుఃఖకరమైనభాగమునకు
వచ్చితిని. సావధానముగ వినుము. నేను జెఱలోనుంచఁబడిన తరువాత
నొక నెలయైనపిమ్మట నొకకూలివాఁడొకకమ్మ నాకీయఁదెచ్చెనఁట. అంద
లి యక్షరములపొంకముచే నొకస్త్రీ దానిని లిఖియించినట్లు స్పష్టము
గాఁగాన్పించుచుండెనఁట. అది నాప్రియురాలియొద్దనుండియే. అందుఁ దాను
నాయాజ్ఞానుసారమే ప్రవర్తించుచుంటిననియు, నెలదాఁటినను నొక్క
జాబైన రాకపోవుటచేఁ జిత్తము మిక్కిలి తత్తరపడుచుండెననియు, నొకవేళఁ
దనకు వ్రాయఁబడిన లేఖలు దుష్టజను లపహరించిరో, సరిగాఁ జేర లేక
పోయెనో యని యనుమానపడుచుంటిననియు వ్రాసినదఁట. అకస్మాను
బురస్కరించుకొని నాపినతండ్రి యేడాటలాడుటకు సమయము చిక్కె
ను. ఆమెయే నాయవస్థనెఱిఁగినవెంటనే నావిముక్తికై ప్రయత్నించునని
యుఁ దనపన్నుగడలకు భంగమువచ్చుననియు నతఁడుతలఁచెను. మిత్త్రు
డా! అప్పుడాధూర్తస్వభావుఁ డేమిచేసెనో యెఱుంగుదువా? అనేక
వత్సరములై జరగెనుగదా! ఇప్పటికి వానిదారుణకృత్యమును దలఁచి
కొనిన గుండెఝల్లుమనుచున్నది. అప్పుడతఁడు పలికినపలుకులు విన్న
పిమ్మటఁ దలపగులఁగొట్టుకొని చావబుద్ధిపుట్టినది. కాని నాలో నేనే
సమాధానపడుచుకొంటిని. ఆదుర్మార్గుఁ డాదురదృష్టవంతురాలి కొక
జాబు నిట్లు వ్రాసెనఁట. "అమ్మా! మాజగన్నాథుఁ డూర లేఁడు. దగ్గఱ
చుట్టమునౌటచే నేను జాబుఁ దెఱిచి చూచితిని. నాయన్న జగన్నాథుని
తండ్రి మీరహస్యవివాహమునుగుఱించి విని యే మనోవ్యథచే మంచ

మొక్కెను. అతఁడు బ్రతుకఁడని భయపడి మా వానిని నీనుండి రప్పించితి
మి. కాని, దైవకృప వలన సజీవుఁడై యున్నాఁడు. ప్రాణము లున్నవను
మాటయే కాని యేకీలును వాని స్వాధీనములో లేదు. నీమగఁడది చూచి
“అయ్యో! పితృహంతకుఁడనే! ఎంతతప్పు పనిఁ జేసితిని!” అని విచారిం
చి, పశ్చాత్తాపపడి, తనదోషకృత్యమును దండ్రియెదుట నొప్పుకొని,
క్షమాపణము వేఁడెను. అతఁడు మగలనీమొగము నూడక వివాహము రద్దు
పఱచుకొను పద్ధతిమీఁద క్షమించెదననెను. మా వాఁడందుల కియ్యకొనె
ను. అతఁడేదియో రాజకార్యముమీఁదఁ బరస్థలమునకేఁగినాఁడు. ఈస
మాచారములు నీకుఁ దెలియఁ జేయుమని నాతోఁ జెప్పిచనెను. నేను నుగన్న
వ్రాయఁబోవుచుండఁగనే నీయొద్దనుండి యీజాబు వచ్చినది. మఱియు
మీరు గాంధర్వవివాహమాడిరఁట. ధర్మశాస్త్రప్రకారము ప్రకృత కా
లములో నట్టివి చెల్లవు. నీవభియోగముఁ దేదలచినను లాభము లేదు. నీ
కెన్నఁటికిని రాజ్ఞీపదము కలుగనేరదు.” చూచితివా, వాని దుర్బుద్ధి?
ఈమాటలు చెప్పుటకే యతఁడవసానకాలమందు నన్నుఁ బిలువనంపెను
జుమీ! పిమ్మట నేమైన నామెనుగూర్చి తెలిసినాయని యతని నడిగితిని.
లేదని యతఁడు మాఱుపలికెను. నాకప్పుడు కలిగిన విషాద మేమని వ
ర్ణింతును? పాన్పుమీఁదనున్న వాని నొక్కగుద్దు గుద్ది, గుండెలు చిగు
రఁబొడచి, ప్రేవులూడఁ బెఱికి, యమసదనమునకుఁ బంపి కసిదీర్చుకొన
వలయునన్న బుద్ధిపుట్టెను కాని యొకటి రెండు నిముసములలో వాఁడని దై
వమే చేయునని తలఁచి యూరకుంటిని. కడపట నతఁడు అతిదీనముగా నా
వంకఁ జూచుచు “బాబూ! అపరాధిని, క్షమింపుము. మన్నింపుము.” అని
పలుకుచుఁ బ్రాణములవదలెను. నేను వానిని క్షమింపఁగలనా? నా ప్రాణ
హాంతకుని మన్నింపఁగలనా? మన్నింపక చేయునదేమి? అతఁడు నన్ను
నట్లు మన్నింప వేఁడినందుకు వాఁడొనర్చిన యకృత్యము గుప్తముగా నుం
చుటకు స్థిరపఱుచుకొంటిని. ఆసమయమున నామానసవీధిని నామనో

వారికి దీనమైనవిగ్రహము కాన్పించెను. వెంటనే యాసనమును విడిచి
పెట్టి నామందిరమునకువచ్చి రయగతిని బోవు నశ్వశకట మొకటి నే నా
జ్ఞాపించి విజయనగరము ప్రయాణమైపోయితిని. ఎంతవేగముగా బండిని
బోనిచ్చిన నంతయధికమైన బహుమాన మిచ్చెదనని సూతుని తోఁ
జెప్పితిని. నాకు దారిలోనన్నియు దుర్నిమిత్తములే తోఁచెను.
అది చలికాలమగుటచే నారాత్రి మంచు దట్టముగాఁ బడుచుం
డెను. చెట్లనుండి పొట పొట హిమ కణములు రాలుచుండెను.
తరువులు సంచితము నాహృదయ వల్లభకొఱకు బాష్పములు
రాల్చుచున్నట్లు తోఁచెను. ఎటుచూచిన భయమే కలుగుచుండెను.
తెల్లవాఱున ప్పటికి జగదంబ నివసించెడు కుటీరముకడకుఁ బోయి
తిని. నాఁటి పొగమంచులో నాయిల్లు నాకండ్లకుఁ జక్కఁగాఁ
గాన్పింపనే లేదు. పూర్వకాలమునుండియు నాయింటినంటికొనియున్న
వృద్ధదాసి యొకగోనెగప్పికొని వాఁకిలిసమ్మార్జనముఁ జేయుచున్నది.
నేను లోపలికరిగితిని. నాప్రియురాలు కనఁబడలేదు. ముసలిదినన్నాన
వాలుపట్టలేదు. నేనత్యాతురముతోనైచు ప్రశ్నల కొక్కదానికేని
ప్రత్యుత్తర మీయకుండెను. నా ప్రాణేశ్వరి యేగదియందో యుండు
నేమోయని మఱియు లోపలికేఁగఁబోయితిని. ఒక నూతనపురుషుఁడు
మూలత్రము చూపట్టెను. అతఁడు నేఁగోరువస్తువచట లేదని చెప్పెను.
ఆమె యేమాయెనో యెఱుఁగననియు నతఁడు చెప్పెను. నేనునమ్మలేదు.
అతఁడు విసుగుఁదలతో 'అనుమానమున్న లోపలికేఁగి చూడుమయ్యా'
యని పలికెను. అట్లొనర్చితిని. నాప్రేమఖని యచట లేదు. నేనతిదుఃఖ
పరవశుఁడనై యతని మరలఁ బ్రార్థింప నిట్లనెను. "అయ్యా! నేనొక
బీదబాఁపనుఁడను. ఈయిల్లు బాడిగకుఁదీసికొంటిని. నాకుఁ బెండ్లాము
గాని, బిడ్డలుగాని లేరు ఇదినాదాసి. ఇంతకుఁ బూర్వమిందొకవనిత
యుండుచుండెడిదఁట. ఆమె కేదోయొకకమ్మ పాలూరినుండి వచ్చెనఁట.

ఆకమ్మ వచ్చినది మొదలు కంటికి నేలకు నొక్కటియే ధారగా నామె యేడ్చినదఁట. అట్లు దుఃఖించుచునే యుండుఁ జిరకాలము కాఁపురముండెనఁట. హఠమున నొకనాఁడామె యెటకో చనెనఁట. ఎక్కడికిఁ బోయెనో యెవ్వరు నెఱుంగరు. ఆమెను బ్రేమించిన యతఁడు ద్రోహము చేసెనని నా దాసి చెప్పఁగా వింటిని. ఆమెను దలఁచుకొని యిప్పటికిఁ గూడ నది యేడ్చుచుండును. ఇంతకన్న నాకేమియుఁ దెలియదు."

'ఇంతియే యగునా యామెనుగూర్చి మీకుఁ దెలిసినది?' అని యానందరావు ప్రభు నడిగెను. 'ఇంతియే' యని దగ్గుత్తికతో నూర్పులిడెను. మఱియు నతఁడు 'స్నేహితుఁడా! నేనప్పురుషుఁడు వచించిన దాసితోఁ దృప్తి నొందక ముసలిదానిని గూడఁ దఱచి తఱచి ప్రశ్నలు వైచితిని జుమీ. నేనెవఁడనో తెలియఁగానే దానికిఁ గలిగిన కోపమేమని చెప్పుదు! ఎన్ని విధముల మొఱ పెట్టుకొనినను, నాదురదృష్టవశమున సంభవించిన పెనుముప్పుల తెలుఁగుఁ జెప్పినను, బుద్ధిపూర్వకముగా నపచారమొనర్పలేదని యెన్ని రీతుల బోధించినను, వినక యది కోపవశయై మీఁదికెగచి నన్ను నానాదుర్భాషలాడినది. వార్ధక్యంబుకతంబున దానికిఁ బట్టుదే పట్టు. ఎవరెన్ని చెప్పినను వినదఁట. అది యన్నాడిన మాటలనుబట్టి చూడ దానికి సర్వమును దెలిసినట్లు నాకుఁ దోఁచెను. కాని యెంతసేపు బతిమాలిన నామె సరియైన యుత్తరమీయకుండెను? ఏమి చేయుదు? ఆశాభంగముతోఁ బట్టణములోనికిఁ బోయితిని. ఆ మోహనాంగినిగూర్చి యేమైనఁ దెలియునేమో యని యెందఱినో యడిగితిని. ఎందఱి పాదములో పట్టితిని. ఎన్ని జతనములో సలిపితిని. అన్ని యత్నములును వ్యర్థయయ్యెను. ఆమె జాడయేమియు దొరకలేదు. నేను గృహముమాటఁ దలఁపనైతి. రుగ్ణుఁడైయున్న జనకుని మాట నెంచనైతి. నా మనోహారిణింగూర్చిన చింతచే నావృతుఁడనై, నిమగ్నుఁడనై, పరవశుఁడనై యుంటిని. దినములు, పక్షములు, మాసములు, గడచిపోయినవి. 'ఏదారియుఁ

గాన్పింపలేను, నరలఁ గుటీరముకడకుఁ జనుదెంచితిని. ఈపర్యాయ మైన నామనవిడి పొయుండుఁ గృపనూని తా నెఱిఁగినంతవట్టు చెప్పి నాయు లయుటఁ దీర్చునని గూసపడితిని. ఈతడవఁగూడ బన్న మేతటస్థించెను. ఆమె కొలఁదిదినంబులకుఁ బూర్వమే మృతినొందినదని తెలిసినది. అందుఁగాఁ పురమున్న బ్రాహ్మణుఁ డావృద్ధదాసి ప్రాణావసానసమయ మున నాయూరిశివాలయమందు సదానివసించు చిదానందయోగి యను సన్న్యాసితో నేదో చెప్పి మఱిప్రాణములు విడిచెననియుఁ జెప్పెను. నేనాయోగి నెఱుఁగుదును. వెంటనే యతనికొఱకు దేవళం బునకుఁ బరువెత్తిపోయితిని. కాని యతఁ డందు లేఁడఁట. అతని పూ ర్వాశ్రమమందలి ఋణములు బాధింప నుత్తమర్ణులకుఁ గాన్పింపకుండ నెక్కడికో పాఱిపోయెనఁట. అవసానకాలమందు ముదుసలిది యాతని [illegible] జెప్పి [illegible]ది. నన్నుఁగూర్చియేమై[illegible], దప్పక యతఁడు సాలూరిపో యుండునని యూహించి, వాయువేగమున రాజధానిని జేరితిని. నేనను కొన్నటులతో గయొక రోగివచ్చి నన్నుగుఱించి కోటలోనియుద్యోగస్థుల నడిగెనఁట. వారదు నాజాడ తెలియక తట్టుముట్టాడుచున్నామని ప్రతి వచనం బీయ నతఁడు వెరలిపోయెనఁట. అతని యాకృతినిగుఱించి యు నాసేవకులు సరియైన వర్ణనమే చేసి చెప్పిరి. అతనికొఱకు సాలూరిలో నన్నిమఠములు, వాడలు, గేహములు, దేవాలయములు మున్నగునవి వెదకించితిని. రాజ్యమందలి ప్రతిగ్రామమందును జాటఁబంచితిని. మిత్త్రప్రభువులపేర జాబులు వ్రాసి కనుఁగొంటిని. అన్నియు వ్యర్థప్ర యత్నములయ్యెను. నేటికి నతఁడు గానరాలేదు. ప్రియమిత్త్రమా! నాకథ ముగిసినది. నాయెనుటనున్న యాబంగరురంగులీనుప్రతిమ, ముద్దులుగుల్కు ప్రతిమ, నాజీవితేశ్వరియైన యాజగదంబ ప్రతిమ, నా కెంతవిలువయైనదో నీవే యూహించుకొనుము. నేనన్యకాంతను జేపట్టనని యామెతో వాగ్దానము చేసియున్నాను. ఈదినమువఱకామా

టను నిలిపికొన్నాను. కొన్ని సంవత్సరములవఱకా దివ్యసౌందర్యవిగ్రహము క్రిమ్మఱఁగాన్పించునని యే నమ్మకయుండెడిది. నేనామెతో సుఖింతునని యే ధైర్యముండెడిది, ఆ యాశాకుసుమము నా డెన్న చిరకాలమున్నది. ఎంతకాలముండును? అచేతనపదార్థము కదా! నానిరంతర దీర్ఘనిశ్వాసములచే నది యిప్పుడు పూర్ణముగా శోషిల్లినది. పరాత్పరుఁడు పవిత్రైకప్రేమ నాయందూని యమృతవర్షమును దానిపైఁ గురియించిన నది మరలఁ జివురులెత్తునేమో కాని, లేనియెడల నది పునర్జీవినికాఁజాలదు. భగవంతున కట్టికృపకలుగుననుట యసంభవము. ఆ కాలము దాఁటిపోయినది. ఆయానందము మరలిపోయినది. ఆరూపము మాయమయినది. అంతయు స్వప్నము.

సాలూరురాజు కథ సమాప్తముచేసెను. ఆనందరావు పలుకుట కేమియు మాటలు దొరకలేదు. రాజాసకునను స్కరించి యాతనిహస్తములస్పృశించి కన్నులనద్దికొని సెలవుఁ గైకొని తనబస కేఁగెను. ఇట్టి తఱి నానందరావు హృదయ మెట్లుండెనో వచించుటకశక్యఁ గథావిధాన మంతయు నెఱిఁగియున్న చదువరుల కేవిడిచిపెట్టుట మేలని యట్లొనర్చితిని.

---

## పదుమూఁడవ ప్రకరణము.

### మోసము.

జాము రాత్రి కాకుండఁగనే జగన్నాథవర్మగారు గుఱ్ఱపుబండి మీఁద వెంకటపతి బసకుఁబోయిరి భృత్యులాతనికి వినయముతో సలాములొనర్చి లోనికిఁదీసికొనిపోయిరి. వెంకటపతి నొక్కఁడే యుండెను. వాని మొగము కళావిహీనమైయున్నది. సాలూరు నృపాలున కేమియు జరగుచున్న దానిఁగూర్చి తెలియకపోవుటచేతఁ గలవరము తేను. అతని

మొగ మెప్పటియట్ల కళావంతమయియే యుండెను. కాని యానంద రావుతోఁ దనదుఃఖకథ చెప్పియున్నవాఁడగుటచే నించుక నెగిలియున్నాఁడు. వెంకటపతి ప్రభువును సగౌరవముగాఁ గుశలప్రశ్న చేసి ఫలాహారములీయఁబోయెను. కాని యతనికింకను జగదంబావిగ్రహము హృదయముఁ బాయకుండుటచే నేమియుఁ బుచ్చుకొనకుండెను. వెంకటపతియే మొదట సంభాషణము ప్రారంభించెను.

వెంక—ప్రభువువారి సన్నిధికి నేనేవచ్చుటకు మాఱుగాఁ దమరినే యిక్కడికి రావించినందునకు నన్ను క్షమింప వేఁడెదను.

జగ—మీరట్లు వేఁడనక్కఱలేదు. స్నేహితులపట్ల నేను నా ప్రాభవముఁజూపను. మఱియు మీరేదియో ముఖ్యవిషయముం గూర్చి నాతో మాటాడవలసియుండి, తీఱికలేక నామందిరమునకు రాఁజాలనప్పుడు, నేనువచ్చుట యావశ్యకముకాదా? నన్ను రమ్మనిన కార్యమెద్దియో తెలుపుఁడు.

వెంక—(దీనత్వముతో) ఇప్పుడు నేనాచరింపవలసిన ధర్మము మిగుల విషాదకరమైనది. నేనువచింపఁబోవు సంశయములు క్రమక్రమముగాఁ దెలిపెదను, సావధానమనస్కులరై వినఁగోరెదను. రాజా! తమరు మిక్కిలి చనవిచ్చి గౌరవించుచున్నట్టియుఁ దఱచుగా స్వపంక్తిని విందులఁజేసి మన్ననల నొనర్చినట్టియు, నిష్కల్మషహృదయుఁడు సుగుణసంపన్నుఁడునని తమరభిప్రాయ పడినట్టియుఁ దమస్నేహితుఁ డొకఁడున్నాఁడు. అతనివిషయములో నేలినవారు కడుమోసపోయినారు. అతఁడు చక్కఁ ఱపుఁతేనిసంబు; పయోముఖవిషకుంభము; మేఁకవన్నెపులి; గోముఖవ్యాఘ్రము. వాఁడు తమసంగతికిఁదగఁడు.

వెంకటపతి పలుకులలో సాలూరురాజునకు యాథార్థ్యమును దీనత్వమును బొడఁగట్టుచున్నది. తలుపుచాటుననుండి వినుచున్న సుగుణ

వర్మ కయథార్థమును గాపట్యమును గాన్పించుచున్నది.

జగ—అయ్యా! నాస్నేహితులలో నెవఁడట్టివాఁడు?

వెంక—రాజా! తమతో మొదటనే మనవిచేసితిని. అన్నియుఁ గ్రమముగావచించెదను. వేగిరపడకుఁడు. క్షమింపఁబ్రార్థింతును. ఇప్పుడు నాపూనుకొనిన పనికన్నఁ గష్టతరమైన దింకొకటిలేదు. అయినను నేను దానిఁగొనసాగింపక తప్పదు. నేనువచింపఁబోవు మానవనాథముఁడొనర్చిన దారుణకృత్యమునుగుఱించి తమరువిన్న నాశ్చర్యపడుదురు. అతఁడుదుష్టుఁడని మీరెన్నఁడనుమానపడియుండలేదు. బహుహీనస్థితిలోనుండెడు మానిసియయ్యుఁ దమకున్న ద్యూతాసక్తిని బురస్కరించుకొని—

జగ—అయ్యా! నేను జూదమాడుట నాకుఁగలప్రీత్యాసక్తి చేతఁగాదు. దానికి వేరుకారణముగలదు. నేనుదానిని మానవలెనన్న నిముసములో మానఁగలను. నాకది యొకవినోదముగాని వ్యసనముకాదు. దానికేమి? కానిండు. ఆమనుజుఁడేమి చేసెను?

వెంక—ఆపురుషుఁడు తనయాస్తి యంతయు వ్యయపఱచికొనెను. పూర్వపువైఖరిని దనగౌరవమును నిలిపికొనవలెనని యతఁడు తలఁచెను. ధనసన్న్యాసముఁబుచ్చుకొనుటకు సిద్ధముగానున్న యాఁతడు ద్యూతమందుఁ దమ్మునుమోసముచేయ సాహసించెను ఆతనింగూర్చి సర్వమును నివేదింపకపూర్వ మతనిపక్షమున నేను నిలిచి యేలినవారిని గరుణఁజూప నర్థించెదను. వానియట్టియవస్థయందు నేనేయుండినఁ దమరినెట్లు వేఁడుదునో యట్లువేఁడువాఁడ. అతనియపరాధము, సైరించి పలువురిలో నతని నవమానింపకుండుఁడని దేవరను బ్రార్థింతును.

జగ—(వెంకటపతి యామనుష్యుని పేరు చెప్పకపోవుటచేత నోర్పువహింపలేక) వెంకటపతిరాజుగారూ! మీరు మిగులఁ జుట్టిచుట్టి చెప్పుచున్నారు. ముందుగా నతనినామధేయమును జెప్పి, పిమ్మట నతని

చేష్టలఁజెప్ప నుచితము. అదియునుంగాక యతఁడెవ్వఁడో, యతఁడొా వచ్చిన యకార్యమెద్దియో తెలియకుండ నెట్లువానిని నేక్షమింపనేర్తువు?

వెంక — అయిన నేలినవారు కొంచెమోర్పువహించి నన్ను మన్నింపవేఁడెదను. ఈ యుపోద్ఘాతమంతయుఁ జెప్పకుండఁ బర్యవసానాంశములు వచింపనలవి కాదు. అయ్యది తమకే ముందువిశదము కాఁగలదు. నేనిప్పుడు వాకుఁచ్చినట్లు వాఁడు మిమ్ముఁ బాచికలయందు మోసపుచ్చవలెనని చూచినాఁడు. ఏలయన, మీరెంతధనమైనఁ గేళియందు వ్యయపఱచుటయు, నెంతయాటయాడిన గెలుపొందుటే కాని, యోటమినొందకపోవుటయు, నతఁడు గ్రహించినాఁడు. మిమ్మెట్టులైన ద్రోహముచేసి తనదారిద్ర్యముఁ బోఁగొట్టుకొనఁగల్గినంత విత్తము సంపాదింపనెంచి, మీకడ నతివినయముతోఁ జనవుతో మెలఁగుచు మీగౌరవమునకుఁ బాత్రుఁడై యుండి, ద్యూతసంబంధమైన మోసకృత్యములం దారితేఱినవాఁడగుటచేఁ దుదకొకజతదొంగపాచికలను సంగ్రహించెను. వానియందు సీసము పొదుగఁబడియుండుటచే నతఁడు కోరునట్లు పడఁగలవు.

జగ — సత్యమా? ఏమి! ఎంతపనిఁ జేసెను! — అని వెంకటపతి వంక నిశ్చలదృష్టులతోఁ జూడనారంభించెను. కాని వానియందేమియు ననుమానము చేతఁ గాదు. వానిహృదయమందలి యభిప్రాయముల ముఖవిలాసములనుబట్టి గ్రహించుటకే యైయుండనోపును.

వెంక — (ఎప్పటి విషాదసూచకకంఠధ్వనితోడనే) ఆపురుషుఁడు, అద్రోహబుద్ధిగల పురుషుఁడు, కొన్ని కారణములచే నిద్దఱుమనుష్యుల నాశ్రయించెను. వారాతనికిఁ బ్రకృతాంశమందు సాయముఁ జేయఁగలరని యెఱిఁగియే యట్లొనర్చినాఁడు. ఆమనుష్యులు మనద్యూతమందిరమం దొకప్రత్యేకస్థలమందుఁ గూర్చుండి చతురంగమాడుచుండు పరికాళరాయరామచంద్రులే.

జగ—ఆలాగుననా? వారు మామందిరమున కెన్నఁడురారే! ద్యూతమందిరమందు వారితోనించుకచనవుతో నేను మాటాడుదుఁగాక బసకెప్పుడు నాఘనతకుఁదగినవారినే యాహ్వానము చేయుదునుగాని, యెన్నఁడట్టివారిని బిలువనే! నాచేనగౌరవముగఁ బిలువఁబడి నాసౌధమునకాఁడు నొకనికా ప్రకాశరాయరామచంద్రులెట్లు తోడుపడఁ గలుగుదురో నాకు బోధపడకున్నది. మీరువింతకథచెప్పుచున్నారే!

వెంక—వారితోడ్పాటు మీభవనమందతఁడున్నప్పుడుపయోగించి యుండకపోవచ్చును. మీరు వేఱొకతావున నాడునప్పుడైన దానిని వినియోగింపవచ్చునుగాదా? ఆయుద్దేశముతో నాతఁడు వారి సాహాయ్యమును గోరెనేమో ?

జగ—సరియే. తెలిసినది. ఇప్పుడైన నాతఁడెవ్వఁడో చెప్పుఁడు.

వెంక—చెప్పిన వానిని దమరు దయతో క్షమింతురా ?

జగ—అంతయు నెఱుఁగువఱకు నేనెట్లు ముందట్టివాగ్దానము చేయఁగలను ? అదిగాక వారెట్టి ఘోరములు సలుపుచున్నారో ? ఇట్టివిషయములం బాలోచింపవలయునుగాని తొందరపడరాదు. అవసరమైనచో వారియౌద్ధత్యమునుమాన్ప యత్నింపవలసియుండును. నేరస్థులను సరియైనరీతిని శిక్షించినఁగాని లోకములో నధర్మమడఁగిపోదు. మఱియు మీరు వచింపఁబోవుపురుషుఁడు నాచేత మన్ననలఁబడయుచు, నాతోఁగలసిమెలసి చరించుచు, నన్నే మోసముచేయఁగడంగినప్పుడెవ్విధినూరకుండఁగలను ? అట్లుచేసిన సంఘమునకు, మనస్సాక్షికి, భగవంతునకు, విరుద్ధముగాఁ బ్రవర్తించినవాఁడనుగానా ? అతఁ డెంత ఘనముగా బ్రతుకుచున్నను, అంతటిదుష్కృత్యమునకు సిద్ధపడినప్పుడు పదిమందిలో నవమానింపఁదగినవాఁడనియే నాయభిప్రాయము. అతఁడు శిక్షార్హుఁడే యగును. కావున వెంకటపతిరాజుగారూ ! నావలన నాపురుషార్థమున కేమియు నుపకారముజరగునని మీరాశపడకుఁడు,

వెంక — తమరు వానిని క్షమించినను క్షమింపకపోయినను, నేను జెప్పఁదలఁచినది చెప్పకతప్పదు. ఆకర్ణింపుఁడు. చేసిన నేరము గొప్పది. విశ్వాసపాత్రులైన సుజనులు పెక్కండ్రు.

ఇట్టి తరుణమున సేవకుఁడు ప్రవేశించి ప్రకాశరాయరామచంద్రులు దర్శనార్థులై వాకిటఁ గాచియున్నారని సవినయముగ మనవి చేసెను. వెంకటపతి వారిని లోపలికిఁ బంపుమనెను.

జగ — తద్విషయమై నాకేదో చెప్పుకొనుటకు రాఁబోలు.

వెంక — రాజా! అగును. వారు నావచనములు సిద్ధారణపఱుచుటకు, ద్రోహులుని వెల్లడిచేయుటలో నాకు సాయముచేయుటకు, వచ్చిరి. ఏల వానిపక్షమున మిమ్ము వేఁడితినో యిప్పుడే తమరెఱుఁగఁగలరు. ఇదిగో! చూడుఁడు.

కడపటిమాటలు తడఁబడుచుఁబలికి వెంకటపతి వెనుకతలుపును బడాలునఁ దోసెను. సాలూరుప్రభువచ్చట సుగుణవర్మనుఁజూచి యత్యాశ్చర్యవిషాదసంభ్రమావృతచేతస్కుఁడయ్యెను.

---

## పదునాల్గవ ప్రకరణము.

### పరీక్ష.

చివరవఱకు వెంకటపతి తన్నుఁగూర్చియే రాజుతోఁ జెప్పుకొనుచున్నట్లుండెను. తలుపుచాటుననున్న సుగుణవర్మ యిఁకనో యిప్పుడో వెంకటపతి నేరము నొప్పుకొనుననియుఁ బరపక్షముగాఁ జెప్పినట్లు చెప్పి క్రమక్రమముగా సర్వము నివేదించుననియుఁ దలఁచుచుండెను. తడఁబాటుమాటలు వెంకటపతినోటినుండి వచ్చినపుడే సుగుణవర్మ యుచ్చరువొందెను. ఆక్షణమందే కవాటము తెఱవఁబడి, నిందయుతనిపై మోపఁబడెను. అతఁడు స్థాణువువలె మ్రాన్పడిపోయెను. దోషిని జూచిన

తోడనే క్రోధఘూర్ణితుఁడైన యధికారిభంగి నతఁడు మండిపడుచు "రాజా ! వీఁడే దొంగ. పట్టుకొనుఁడు. దొంగపాచికలు వానియొద్దనే యున్నవి. వానిని బైకిఁదీయుమనుఁడు" అని భీకరధ్వనితోఁ బలికెను.

ప్రకాశరాయరామచంద్రులు వెంకటపతిపనుపును జెల్లింప సిద్ధపడిరి వారియుగ్రరోషమ్మడి సుగుణవర్మపైకి నుఱికిరి. ఈదుర్మార్గులతోఁగూడియే యాముష్టుఁడగు వెంకటపతి యిట్టికుతంత్రముఁ బన్నఁగలెనని సుగుణవర్మ గ్రహించెను. ఒక్కనిమిషములో నెదఁగునుసుపంజుకొని గంభీరమైనవీక్షణములతో నాసభ్యతతియువంకఁజూచి 'ఖలులారా ! నన్నుఁ దాఁకఁగలరా ? నన్ను సమీపింతురేని నశ్ఫలము వెంటనే పొందెదరు.' అని నిర్భయముగాఁ బలికెను. వెంకటపతి ఱేనివైపుతిరిగి 'అయ్యా ! చూచితిరా, వాని మోసమెట్లున్నదో ? దోషి కావుననే యట్లు వెలవెలఁబోయినాఁడు.' అని దయాదాక్షిణ్యములు ద్రోహియెడఁ జూపనివాని కైవడిఁ బలికెను. సుగుణవర్మ గంభీరవాక్యలకుఁ బ్రకాశరాయరామచంద్రులు భయపడి యట్టునిలిచిరి. కాని కొన్నినిముసములైనపిమ్మట మరల నాతనిపై కెగచిరి. వర్మయొకచేతితోఁ బ్రకాశరాయని నణఁచివైచి, రెండవచేతితో రామచంద్రునిఁ ద్రోసివైచెను. మొదటివాఁడు సాగిలఁబడినవాఁడుపోలె నేలకంటికొని పోయెను. రెండవయాతఁడు దూరముగాఁ దలుపుమీఁదఁబడిపోయెను. ఇట్లు వారిగర్వములడంచి ప్రభుసమీపమునకేఁగి 'ప్రభూ ! ఇంతసేపుమీరు వేనినిగూర్చి వినియుండిరో యాపాచికలివిగో. దయతో స్వీకరింపుఁడు. ఈవ్యవహారము నుపేక్షసేయక కడముట్టఁజూడుఁడు.' అని నిశ్చలవాక్కులతో ననెను.

సాలూరురాజాతనివంక స్థిరదృష్టులతోఁ జూచెను. అతఁడిచ్చు పాచికలను బుచ్చికొనకుండెను. తాను పరేంగితజ్ఞానధురీణుఁ డగుటచే నచిరకాలములోనే సుగుణవర్మముఖవిలాసమునుబట్టి యాతనిహృదయ

భావములు చాలవఱకు గ్రహింపఁగల్గెను. దీర్ఘాలోచనసూచకములు, మహాబుద్ధివికాసబోధకములు నగు సుగుణవర్మకన్నులయం దితనికి నిష్కాపట్యము, నిశ్చలత్వము, కనఁబడకపోలేదు. ఎటుచింతించుటకును శాలువోక యించుకసేపట్టులుండి, పిమ్మట 'సరిరమ్మ. ఇమ్ము' అని వానిని దీసికొనెను.

ప్రి కా—అయ్యా! రాజుగారూ! ఈచోరునకు గట్టిశిక్షవిధింప నిదే విడిచిపెట్టవలదు. వీనియంతము చూడుఁడు.

జగ—హుష్. మాటాడకుము. (వెంకటపతి యేదియో యనఁబోవ) వెంకటపతిరాజుగారూ! మీరుకూడ నేమియుఁ బలుకవలదు. రామచంద్రుఁడుగారూ! మీవారీతి మూతివిఱుచుట, వెక్కిఱించుట మానవలెను. న్యాయాధికారులచేఁ దగినపరీక్షయగువఱకిచ్చటనున్న వారెవ్వరును గిమ్మనకుండవలెను.

ఇట్లుపలికి ప్రభువొకకాగితమును గలమును దీసికొని రెండు కమ్మలను వ్రాసి తనసేవకునిచేతికిచ్చి చిరునామదారులకిచ్చిరమ్మని పంపెను. భటుఁడు కమ్మలతో నావలకుఁజనెను. మరల రాజు "అయ్యలారా! మీరు నోరులెత్తిన మాటదక్కదు. ఏదేవదే చెప్పితిననుకొనవలదు. ఇప్పు డిరుకక్షలైనవి. ఒకవైపు సుగుణవర్మయు, రెండవవైపు మీముగ్గురును నుంటిరి. ఏకక్షవారు నాకపరాధ మొనర్చిరో తెలిసికొనవలసియున్నది. దానినెఱుంగఁగల సమర్థులిద్దఱు మనపట్టణమందలి న్యాయాధికారి, దత్తాత్రేయశాస్త్రులవారు. వారు నాకుఁ బరిచయులు. వారికొఱకే నేను నాభటుని నిప్పుడంపియుంటి" ననినుడివెను. అతఁడు మిన్నకుండెను. సుగుణవర్మ కల్మషరహితమైన వీక్షణములతో వారి చాయఁజూచుచు నొకయాసనముపై నాసీనుఁడయ్యెను. ఆదుష్టత్రయము మెమైన మదిలోఁ గలవరపడుచుండెనేమోకాని, యితఁడు స్వస

చిత్తుఁడై యే యుండెను. వారింతకుఁబూర్వమే తనమీఁద నేరమును స్థిరపఱుచుటకుఁ దగినకట్టుదిట్టములను జేసికొనియుండిరని యతఁడు గ్రహించెను. ప్రకాశరాయరామచంద్రులు సహజకార్ష్ణ్యసూచక దృష్టుల నొకరివంక నొకరు చూచుకొనిరి. వారికి న్యాయాధికారి, పరీక్ష, యనిన నొకవిధమైన భయముపుట్టినది. కాని యీరితేఱినవార గుటచేఁ దమమనోవికృతు లెవ్వియు ముఖములయందుఁ గన్పడనీయ కుండిరి. వెంకటపతియు నటులేయుండెను. అతఁడు, సాలూరురాజు వెంటనే సుగుణవర్మ దోషియనినమ్మి వానిపైఁబడు ననుకొనెను. కాని న్యాయదక్షులను బిలువనంపుదురనియు రవ్వసేయుదురనియుఁ దలఁప లేదు. కపటమేమియును లేక సంతుష్టినొందినవానికైవడినే యతఁ డును గనఁబడుచుండెను. ఒకగడియగడచెను. యోగిహృదయముభంగి సంతయు నిశ్శబ్దముగా నుండెను. ప్రకాశరాయాదులు పర్యవసాన మేమగునోయని లోలోన దిగులొందుచుండిరి. జేనిహృదయములో నేమున్నదో వారుగ్రహింపనేరకుండిరి.

సుగుణవర్మ భీతిలేక ప్రకాశరాయరామచంద్రులమోములపై దృష్టిని సారించెను. వారిలోఁబ్రకాశరాయనివైపు చాలసేపుచూచెను. నేఁడు మొదటితడవ నతఁడు వెంకటపతికడకువచ్చినప్పు డాయిరువురను జూచియున్నాఁడు. ప్రకాశరాయనిమాటలనువిని వెనుకవెనుకకుఁజూచు చుఁ బోయియున్నాఁడఁసియు వెనుకటిప్రకరణమునందుఁ జెప్పియు న్నాముకదా! వాఁడు మరలఁ గొన్నినిముసములక్రింద మాటలాడి యున్నాఁడుగదా. ఆకంఠధ్వనిఁబట్టియు, సంభాషణవిధముంబట్టియు నతనికేదో స్మృతికివచ్చెను. అతఁడిప్పటివఱకింకను రామచంద్రుని మొలుంగుపిసియుండలేదు. అంగుమూలమున నతఁడెవ్వఁడో యనుచూ నించుటకైన నతని కవకాశము చిక్కలేదు. ఆతోఁడిదొంగలిరువురును మేమె ఋజుమార్గప్రవర్తకులమని తెలుపుటకోయన నటునిటు చూడ

కుండిరి. సుగుణవర్మ తనకేసిచూచుచుఁ దమభావాదులను గ్రహించు చుండుట వారెఱుఁగరు.

ఒకగడియ యిట్లుజరగెను. భటుఁడు న్యాయశిరోమణియగు దత్తాత్రేయశాస్త్రిగారిలోఁ బ్రవేశించెను. ఇతఁడు సకలధర్మశాస్త్రార్థ రహస్యసంవేది. మహాన్యాయదక్షుఁడు. సాలూరుజేని సన్మిత్రమండ లములోనివాఁడు. అతఁడు వివాదములను న్యాయసభయందుఁ దీర్చుట యేకాక, వలసినప్పుడింట్లకుఁగూడవచ్చి పరిష్కరించుచుండును. అతఁడు వచ్చినప్పుడు ప్రకాశరాయరామచంద్రులు మిగులఁగలఁతపడిరి. కాని తమకలవరపాటును లోనడంచుకొనిరి. వెంకటపతికిఁగూడ నట్టియవ స్థయే తటస్థించెను; గాని, యతఁడొకయుక్తి పన్నెను. తనచేరుమాలు నేలఁబడవైచి దానిని గ్రమ్మఱఁదీసికొనువాఁడుపోలెఁ గ్రిందికివంగి, యీలోపున మది సంబళించుకొనఁగల్గెను. సుగుణవర్మ యట్లుగాక తనసహజగంభీరవదనసరోజమును బైకెత్తి, మహాసమర్థుఁడు న్యాయ విమర్శకుఁడు నగు శాస్త్రి న్యాయమేయొనర్పఁగలఁడని ధైర్యముతోఁ గూర్చుండియుండెను. ఱేఁడు శాస్త్రికి వినయపూర్వకముగ వందన మాచరించి,యాతని నచ్చటి కట్టిరాత్రివేళ రావించినందునకు క్షమింప వేఁడెను. "ప్రభూ! ఎచ్చటఁ బొరపొరలు పొసఁగుచుండునో యచ్చో టికివచ్చి వానినిదీర్చుటకే నియమింపఁబడితినిగదా ! మఱియుఁ దమ వంటివారి యాజ్ఞకూడనైనదికదా! రాకతప్పునా ? తమరుక్షమింప వేఁడనక్కఱలేదు. నాధర్మము నెఱవేర్చుటకు నేను వచ్చితి. నాలేఖ కుఁడుకూడ నిప్పుడే వచ్చువాఁడు. వలయునేమోయని రక్షకభటులఁ గూడఁ దీసుకవచ్చి వాఁకిట నిలిపితిని." అని శాస్త్రి ప్రత్యుత్తరం బిచ్చెను."శాస్త్రిగారూ! ఇది మాగృహమగుటచేఁ దమకేమికావలసినఁ దేవలసిన విధి నాయది. తమరాకచే నాగేహము పవిత్రింబయ్యెఁ.

మీకును, మీపరివారమునకును స్వాగతము." అని వెంకటపతినమ్రుఁడై పలికెను. శాస్త్రి తలయూచి యూరకుండెను. అతఁడు గదియంతయుఁ గలయఁజూచెను. ప్రికాశరాయ రామచంద్రులనుజూచి యతఁడానవాలు పట్టఁగల్గెను. వారు తప్పఁదాఁగ కొండటికిఁ గీడుసేయఁగా నతఁడు వారినొక పర్యాయము శిక్షించియున్నాఁడు. మఱియు వారింతకుఁ బూర్వము సాక్షులుగనో, వాదులుగనో, ప్రతివాదులుగనో తఱచుగా రచ్చకెక్కియుండుటచేత నతనికిఁ బరిచయులే. కావున శాస్త్రి వారివైపునఁ జూచిచిఱునవ్వునవ్వెను. వారును దలలువాంచి యభివాదనమొనర్చిరి. సుగుణవర్మ మాత్రి మతనికిఁ గడుఁ గ్రొత్తవాఁడుగాఁ గాన్పించెను. అతఁడొక్కనిమిషము వానివంకఁజూచిఁ "రాజా! ఇఁకఁగార్యక్రిమంబునకుఁ గడంగుదమా? " యనెను. రాజు "శాస్త్రిగారూ! ఇవిగో దొంగపాచికలు. వీనిని తమకడనుంపుఁడు. వీని చరిత్రిమంతయు వెంకటపతి రాజుగారు నివేదింతురు వలయున వారే యీదుష్కృత్యమును గని పట్టఁగలిగిరి." అని చెప్పెను. అందులకు వెంకటపతి సిద్ధముగానే యుండెను. అతఁడు నెమ్మదిగాఁ, దడఁబడక, యంతయు మనవిచేసెను. అవిధమంతయు మరల నిచ్చటఁ జెప్పనక్కఱలేదు. సాఁబారుధరాకాంతుని తో నెటులచెప్పెనో యటులే, యంతికన్నను జాకచక్యముతో, నతఁడు న్యాయాధికారితో వాకు్రిచ్చి "అయ్యా! ఈతఁడువాకొక్కసమయమునఁ బ్రాణరక్షణమొనర్చి, నాయొద్ద నప్పుడున్న విస్తారధనము పహరింపఁబడకుండఁ గాపాడియుండెను ఆవిశ్వాసముచేతనే యొటులైననదను చూపవలసినదని ప్రిభువు నింతకుఁబూర్వము ప్రార్థించియున్నాను. అను కింపఁసియుఁడు. మీఁద న్యాయాధికారులచిత్తము" అనికూడసమయానుకూలముగ నచించెను.

వెంకటపతి పమాత్రిమట్లు పలుకుచున్నప్పుడు తనశౌడిభాగస్వామిఁవ ఁకఁబూడకయే యుండెను. తనకీదుర్బుద్ధిరు పుట్టించినవా

వారేకావున, వంచనునుగూర్చి వరుల కనుమానముం గల్గింపకుండుటకే యటులుండెను. సుగుణవర్మ కమితమైన కోపమువచ్చెను. క్రోధజనిత రాగము ముఖమునఁ దాండవమాడుచుండెను. కాని సరియైనయుత్తర మిచ్చునంతయు మచిరకాలములో రాఁబోవుచున్నది. గనుక తొందర పడకుండుటయే మేలని భావించెను.

వెంకటపతి చెప్పినదంతయు విని వ్యాయామాధికారి'అయ్యా! వెంకటపతిరాజుగారూ! మీరొక్క విషయమునుంగూర్చి వచింపమఱచితిరి. ఆసుగుణవర్మగారు సాలూరురాజుగారితో మీరు మాటాడు నప్పుడే గదిలోనుండి దాఁగుకొనుటకు హేతువేమో చెప్పకుంటిరి" అని యడిగెను. వెంకటపతి యిట్లు 'జవాబు' చెప్పెను "ఆర్యా! నేను గూడ నావిషయమునుగుఱించి చెప్పవలయునని యెంచుకొనుచుంటిని. ఇంతలో మీరే నన్నడిగితిరి. సుగుణవర్మ తన దురుద్దేశముంతయుఁ బ్రికాశరాయరామచంద్రులకు మొదటనే వెడలఁగ్రక్కెననియుఁ, వానొకవిధమైన పాచికలఁ జేయించుచుంటిననివారితోఁ జెప్పెననియుఁ దమతో మనవిచేసియే యున్నాను. పాప మా ప్రకాశరాయరామ చంద్రులీ దుష్టాభిప్రాయములు విని నిర్ఘాతముపడినట్లుండిపోయిరి. కాని వారు తమభయమును గప్పిపుచ్చి వానితో నేకీభవించుచున్నట్లు నటించిరి. వాని యూహలన్నియు గ్రహించి తగినశిక్షఁ జేయింపవలెనని యూహించుకొనిరి. వారికి సాలూరుజేనితోఁ బరిచయము లేకపోవుటచే నన్ను 'సలహా' యడిగిరి. నేను "అయ్యలారా! ఈవిషయము చాల వాలోచించి చేయవలసినది. త్వరపడి యొకనిమీఁద నేరముమోపుటకు వలనుపడదు, రుజువుభారము మనదై యుండును. తగినంత సాక్ష్యబలముండినఁగాని యిట్టికార్యములకు దిగరాదు. మఱియు నీతఁడు నాకు స్నేహబృందములోనివాఁడు. మహోపకారము నాకొనర్చియు న్నాఁడు. చూచిచూచి యట్టివాని నవమానించుటకు నాకు మనసా

ప్పకున్నయది" యని వారితో మొఱ్వలికితిని. కాని యప్పుడే "అయ్యా!
సాలూరురాజుగారు నాకు ముఖ్యమిత్రమండలిలోఁ బ్రప్రథములే.
వారికే యిట్టిమోసము వాటిల్లినప్పుడు తటస్థభావముతో నిన్నకుండుట
మిత్రద్రోహము కాదా? ఎట్లు మనస్సాక్షికి వ్యతిరేకముగాఁ బనిచేయ
నేర్తు" ననియూహించితిని. కావుననే యీదుష్టుని దుష్టత్వమును బహి
రంగపఱుపవలెననియుఁ గాని కరుణఁజూపవలెనని తేఁని ప్రార్థించు
టుచితమనియు మనోనిశ్చయము చేసికొని యట్లొనర్చితిని. నాయభిప్రా
యము నెఱవేఱుట కొకపన్నుఁగడఁ బన్నితిని. ప్రకాశరామచంద్రుల
నీసుగుణవర్మయొద్దకుఁబోయి వాని దాష్ట్యము నామోదించువారివలెఁ
గాన్పింపుఁడని చెప్పి వానితో నిట్లనుఁడంటిని. "ఓయి! నీతో మే మేకీ
భవించి పనిచేయుట కేమియు నభ్యంతరము లేదు. కాని మనజట్టులో
మఱియొకనిఁగూడఁ జేర్చుకొనవలసియున్నది. అతఁడు వెంకటపతి రాజు"
అని యీసుగుణవర్మ నేను సాలూరుక్ష్మావల్లభుతో సాంగత్యసౌఖ్య
మనుభవించుచుంటినని యెఱిఁగియున్నవాఁడగుటచే, వారియుపదేశమున
కియ్యకొని, పట్టుకొనుటకుఁ బెట్టఁబడిన యెరఁదిన్న యెలుకవలె, నవా
యాసముగాఁ బట్టువడియెను. అతఁడు సుమారైదుగడియలరాత్రికి
నిచ్చటికివచ్చి, తన నూత్ననిర్మితాస్త్రప్రదర్శనముఁ జేసి, వానినుపయో
గించుపద్ధతి నాకుఁజూప నేర్పాటులు గావింపఁబడెను. ఇటులీయేర్పా
టులు జరగినపిమ్మట, నేను నామిత్రుని సాలూరుభూకాంతుని నొక
ముఖ్యకార్యముంగూర్చి మాటలాడుటకు జామురేయికి మాబసకు
దయచేయుఁడని యొకకమ్మవ్రాసితిని. సుగుణవర్మ యైదుగడియల రేయి
కేవచ్చి నాతో సంభాషించుచుండఁగనే సాలూరురాజుగారి పాద
రక్షధ్వని మాకు వినఁబడెను. నేను గలవరమొందినవానిభంగి నటించి
"ఇదే సాలూరురేఁడు నన్నుఁ జూచుటకు వచ్చుచున్నాఁడు కాఁబోలు
మనమిరువురమును మాటలాడుచున్నట్లు కాన్పించిన ననుమానమౌ

దును. ఆయన చాలసేపుండఁడు. ఈగదిలో దాఁగుకొనుము." అని చెవిలో మెల్లఁగాఁ బలికితిని. తక్కినగలదంతయుఁ దమకు విశదమే కదా? నేనేమియు నికఁ జెప్పవలసినది లేదు."

ఈపలుకులు వెంకటపతినోటినుండివచ్చినప్పుడు సుగుణవర్మ కప్రతిహతమైన క్రోధంబు జనియించెను. మిక్కిలికష్టముమీఁద దాని నాతఁడాఁపుకొనఁగలిగెను. తనస్నేహితుఁడింతనైపుణ్యముతో సంభాషించుటకును, దమవిరోధివినాశము సమీపించుచున్నదని వినుటకును బ్రకాశరాయరామచంద్రులు మిగులనలరిరి జగన్నాథవర్మ యనుమానంపుఁజూపులతో సుగుణవర్మవైపుచూచెను. న్యాయాధికారి యుభయపక్షములవాదములు వినినఁగాని స్థిరాభిప్రాయము నొందువాఁడు కాఁడు. కావున నాతఁడులువిని యూరకుండెను. ముఖవైఖరినిబట్టి చూడ నతని కీపలుకులమూలమున నే నేరము స్థాపింపవలెననియున్నట్టు తోఁపదు. అతఁడు 'వెంకటపతిరాజుగారూ! మీకీప్రకాశరాయరామచంద్రులిద్దఱును సాక్షులనుకొందును" అనెను. చిత్తమని వెంకటపతి వినయముగఁ బల్కెను. ప్రకాశరాయఁడు "న్యాయదక్షా! వెంకట. పతిరాజుగారుచెప్పిన ప్రతివాక్యమును నిక్కువమే. "అన్నా! నిక్కువమే కదా?" యనియెను. అందలి ప్రతిపదమును సత్యమేయని రామచంద్రుఁడుకూడ వాక్రుచ్చెను.

సుగుణవర్మ ప్రథమపర్యాయము రామచంద్రుని కంఠధ్వని వినెను. వానివంకఁ జూడ్కినిగిడ్చి చూచెను. అతనికేదియో జ్ఞప్తికి వచ్చెను. ఆకస్మికముగా నేదియో చెప్పవలెనను బుద్ధిపుట్టెను. కాని వేగిరింప నేదియైన విషమమగునని నగములేచియుఁ గూరుచుండెను. కన్నులుమూసికొని యతఁడించుకతడవు చింతించెను.

శాస్త్రి—సుగుణవర్మగారూ! మీవాదమేమియో చెప్పఁడు ప్రకాశరాయరామచంద్రులను బ్రకృతమందేమియు నడుగఁ బనిలేదు

వెంక—(మెల్లఁగా సాలూరు రాజుతో) తమరిరువురు ఘనులు వచ్చెదరని యింతకుముందు చెప్పియుంటిరే! శాస్త్రిగారొక్కరు మాత్రమే వచ్చిరేమి? రెండవవారు రారా?

జగ—రెండవవారు కూడ రావలెననియే నాకోరిక. ఏలయన వారికిని సుగుణవర్మయందు దెక్కువబాధ్యతగలదు. ఆయనకేదియో పని యుండఁబోలు, రాలేదు. ఆయనరాక యంతముఖ్యమైనది కాదు, న్యాయాధికారి వచ్చెఁగదా! జరగవలసినదంతయు నతఁడే జరపును.

ప్రభువాక్యములయందేమియు సుగుణవర్మపైఁ బక్షపాతము పొడచూపమిఁ దనమనోరథమీడేఱునని వెంకటపతి లోన సంతసించెను. జగన్నాథవర్మగారు సుగుణవర్మకోపియని నమ్మెను. తానియ్యకొనునొక రీతి ననుమానముమాత్రమె మొదటనుండెను. ఇట్టి గాటంపు సందియము లాతనిమనసునందు సుగుణవర్మఁగూర్చియున్నను, ప్రకృతమునఁ జెప్పఁబడినదంతయు నిక్కువము కానేరదనియు, నేదియోమర్మముండక పోదనియు నతనికొకవిధమయిన యనుమానము పుట్టకపోలేదు. ఆయనుమానమిట్టిదని చెప్పుటకవకాశములేనిది. అతఁడెట్టులయినను సుగుణవర్మవాదముంగూడవిని, పిమ్మటఁ దనయభిప్రాయమును వెల్లడించుట లెస్సయనుకొనెను. మఱియు నానందరావుతో మాటాడి, యతనియుపదేశమును దీసికొని, యావల దోషినిశిక్షింపించుట మేలనియుఁ దలఁచెను.

వెంకటపతి 'అయ్యా! తమరుసెలవిచ్చిన రెండవపురుషపుంగవుఁడుకూడఁ జనుదెంచిన—'అనియాతఁడు వాక్యముముగింపకపూర్వమే సేవకుఁడు వచ్చి యానందరావుగారు దయచేసిరని మనవి చేసెను.

---

## పదునైదవ ప్రకరణము.



ఫలితము.

ఆనందరావును వెంకటపతియింటికివచ్చి తన్నుఁ ద్వరితముగఁ గలిసికొనవలసినదనిమాత్రమే సాలూరురాజువ్రాసియుండెనుగాని కర్తవ్యాంశమేమియు విశదపఱుపలేదు. అతఁడు బయలుదేఱుట కాలస్యముచేయునేమోయని "సుగుణవర్మనుగుఱించి యొకముఖ్యవిషయమును మాటలాడవలసియున్నదికావున, జాగుచేయకుఁ"డనియు ప్రభువువ్రాసియుండెను. కమ్మయందునప్పటి కానందరావు భోజనము చేయుచుండెను. అతఁడుదానిని జూచినవెంటనే యొకనిముసమైన నాలస్యము చేయకయిలువెడలివచ్చెను. అతఁడెంత శాంతచిత్తముంగలవాడైనను, దనకెక్కువప్రియమైనవానింగూర్చి యనుటచే, దత్తఱపడుచునేవచ్చెను. వెంకటపతి మందిరముంజొచ్చిచూచునరికతనికి న్యాయాధికారి మున్నగువారుకాన్పించిరి. అతనిమనంబు గళుక్కుమనెను. అచ్చటనున్నవారిలోఁబ్రకాశరాయరామచంద్రులతని కపరిచయులు. కాని కేవలముక్రొత్తవారలవలె నతనికిఁగాన్పింపరైరి. వారాతనిం జూచి యొండొరులవంక వేవేగఁ జూచుకొనసాగిరి. ఆచూపుల యర్థము వారలకే తెలియును గాని యితరులకుఁ దెలియనేరదు. న్యాయాధికారిని నాతఁ డెఱుఁగును, శాస్త్రింగాంచినతోడనే యతఁడు సవినయముగఁ నమస్కరించెను. వెంకటపతి తనకొనర్చిన వందనమును సగౌరవముగఁ గైకొని ప్రతివందన మాచరించెను, పిమ్మట సుగుణవర్మ మోమునుదిలకించి చూచెను. అతఁడానందరావును జూచినతోడనే పరాభవజనితారుణ్యా...... ముఖకమలమునందుఁ దోఁపఁ గన్నుల నీరునించి తలవంచుకొనెను. సుగుణవర్మ యానందరావును బితృప్రేమతో గారవించుచుండెనని మనుకఁ జెప్పఁబడియుండెనుగదా? జనకసమానుఁడగు

నతనింగాంచఁగనే వానికి దుఃఖమాఁగలేదు. వాఁడట్లు వాపోవుచుండ సహింపఁజాలక యందులకుఁ గారణమేమని యతఁడు సాలూరురాజు నడిగెను. అతఁడు యావద్వృత్తాంతమునుఁ దెలియఁజెప్పెను. అతఁడు చెప్పుచున్నమాటలు విని నకొలఁది నానందరావునకుఁ గోపము ద్రేకించుచుండెను, రాజు ముగించినతోడనే యతఁడు మండిపడి "అయ్యా! ఈసుగుణవర్మ నిర్దోషియని నేను నొక్కివక్కాణింపఁగలను. అతనికిఁ బూఁటకాఁపునై నేనుందును. నాధనము, నాగౌరవము, కావలసిన నాప్రాణము, వానికొఱకర్పింపసిద్ధముగానున్నాను. నాయనా! వర్మా! నీకుఁగడు మోసమువాటిల్లె. నీవనపరాధివని నాకుఁదెలియును. నీనిర్దోషిత్వము నీచెక్కులయందలి యారుణ్యమందే యగపడుచున్నది. నీకన్నీటియందే కాన్పించుచున్నది. నీవి కపటాశ్రువులుకావు. అవి వేరువిధముగనుండును." అని పలికెను. ఆయుభయులను జూచినవారిగుండెలు కరఁగకమానవు. న్యాయాధికారి పైకిఁదటస్థుఁడుగనుండినను, లోన మిగులఁ గలఁతనొందెను. సాలూరురాజు తనకుఁగలజాలి మోమునందు స్పష్టముగాఁ జూపెను. అతఁడెంతప్రయత్నించిన దానిని దాఁపురము చేయలేకపోయెను. అదుష్టత్రియముమాత్రి మిూవన్యాయ[illegible]మును జాలి నొందలేదు. కాని యంతయుఁదిరిగి తమపైఁ బడునేమోయని భయమును బొందిరి. అంత వెంకటపతి లేచి "అయ్యా! ఆనందరావుగారూ! నేనెంత ఖేదపడుచు సుగుణవర్మపై నీయభియోగముఁదెచ్చితినో, యెన్ని విధముల నతనికొఱకుఁ బోరాడితినో, మీకుతేఁడు చెప్పియుండెను గదా! అంతయునువిని, నేనాతనిమీఁద నపనిందమోపితినని భావించి, యిటుపలుకుట న్యాయమా?" యని యడిగెను.

న్యాయాధికారి :వెంకటపతిరాజుగారూ! మీరు కూర్చుండుఁడు. ఆనందరావుగారూ! తమరుకూడ దయచేసి యాసీనులుగండు. సుగుణవర్మగారూ! మీవాదమెద్దియో తెలియఁజేయుఁడు. అందఱును

నిశ్శబ్దముగా నుండవలె' నని చెప్పెను. ఎల్లరును న్యాయాధిపతియాజ్ఞ ను జెల్లించిరి. సుగుణవర్మ కన్నులుతుడిచికొని, చెదరినమదినిఁ బదిల పఱుచుకొని నిర్భయముగా జరగినదంతయు శాస్త్రితో మనవిచేయ మొదలుపెట్టెను. తనకు జీవనాధారము లేకయుండెనని వెంకటపతి చెప్పినమాటయబద్ధమనియుఁదనకు సంవత్సరమునకుఁబది వేలరూపాయ లొకఘనుని హస్తములనుండి వచ్చుచనియు మొదటఁ జెప్పెను. తనజీ వితకాలములో నెన్నఁడును దుర్వ్యసనములయందు జోక్యముఁగలుగఁ జేసికొనియుండలేదని చెప్పెను. తరువాతఁ దాను సాలూరుప్రభునింట నెట్లు వెంకటపతి పాచికలు మార్చుచుండుటఁ గాంచెనో తెలిపెను. తన కు మొదట వానియం దేయనుమానమును గలుగలేదనియు, నావల సాలూరుభర్త యానందరావుగారిలోఁగిటఁ బ్రసంగవశమునఁ దమకుఁ బదివేలరూపాయ లోటమివచ్చినట్లు తెలుపఁగానప్పుడే వానివృత్తియందు సంశయముకలిగెననియుఁ జెప్పెను. వెంకటపతి నధోగతిపాలుసేయ కుండఁ గాపాడయత్నించుటకుఁ దనకుఁగారణములున్నవనియు వచిం చెను. తానాగదియం దేలదాఁగుకొనెనో,పాచికలనుదగ్గఱ నేలయుంచు కొనెనో, యంతయు విశదపఱిచెను. ప్రకాశరాయ రామచంద్రులు పలికినపలుకులు కేవల మసత్యములని చెప్పెను. ఉద్రేకించుచున్న కోపముగల వెంకటపతి లేటాలునలేచి పెద్దగొంతుతో సుగుణవర్మ మాటలన్నియు నసత్యములని కేకలుపెట్టఁదొడంగెను. సుగుణవర్మ యిం కనేదియో చెప్పఁబోయి యాకోలాహలముచేత నూరకుండెను. వెంకట పతిబొబ్బలఁవిని సహింపలేక శాస్త్రి "అయ్యా! కూర్చుండుఁడు. నిజ ముగా ననపరాధులట్టి కేకలుపెట్టరు. మఱియు మీరింతదనుక నెంత సేపో యీవాదమునుఁ జెప్పితిరే!అప్పుడేమైన సుగుణవర్మనోరెత్తెనా?" అని మందలించెను.

వెంక—అయ్యా! వాఁడట్టితప్పుఁగూఁతలు కూయుచుండఁగాఁ జూచి యూరకుండఁగలనా? నామర్యాదకు నష్టముఁదెచ్చుమాటలు వాఁడాడుచున్నప్పు డూరకుండుమనుట తమకుఁ దగవా?

శాస్త్రి—(తీవ్రమైన కంఠధ్వనితో) అయ్యా! ఒక్కపలుకైన మీనోటినుండి రావలనుపడదు. నే నాజ్ఞాపించుచున్నాను.

ఆనం—రాజా! నేను జెప్పితినిగదా? అతఁడు నిశ్చయముగా న నపరాధి. తమరేమియు మాటాడ రేమి? తమకుమాత్రము లోపల న నుకంప యుదయించియుండదా?

జగ—(మెల్లఁగా) మిత్రమా! మిన్నకుండుము. సమస్తధర్మశాస్త్ర వేత్తయగు శాస్త్రి మనకంటెఁ దెలిసినవాఁడు. అతఁడు న్యాయమాచ రించునుగదా! చూతము.

శాస్త్రి—సుగుణవర్మగారూ! మఱియేమైనఁ జెప్పఁదలఁచితిరా?

సుగు—అయ్యా! నేనొక్కటి మనవిచేయఁబోవుచుంటిని (అని పరిశాళరాయరామచంద్రులవంకఁజూచి) కాని నిశ్చయముగా దేమో—ఏమో!—అయ్యా! లేదు నేను జెప్పవలసిన దేమియును లేదు.

వెంక—సుగుణవర్మగారూ! మీరు సాలునకుఁబది వేలరూపాయు లొకఘుఁ డిచ్చునంటిరే. అందునుగూర్చి సవిస్తరముగఁ జెప్పెదరా?

సుగు—ఆప్రశ్నకు మార్వలుకను.

వెంక—ఆపెద్దమనుష్యుని పేరుచెప్పక తప్పదు.

సుగు—నేను జెప్పఁదలఁచికొన లేదు, కూర్చుండుము.

శాస్త్రి—అయ్యా! మీరాప్రశ్న కుత్తరముఁజెప్ప నిరాకరిం చుటవలన మీకు క్షేమముగాదు.

ఆనందరావు కూర్చుండమ్యెను. సాలూరురాజు తలయూచి 'వీఁడే దొంగ' యని మెల్లగ ననుకొనెను. అతనిమోమునందించుక కోపము

పోడచూపుచుండెను. ప్రకాశరాయరామచంద్రులు మరలఁ దమకే జయము చేకూరునని తలఁచిరి. వారిముఖములు కొంచెము తేరకొనెను. వెంకటపతి కేవియో యాలోచనలు పుట్టుచుండెను. "వాఁడు నా గుట్టులను బయటఁబెట్టఁజాలఁడు. నేనుగూడఁ దనరహస్యముల నెఱిఁగి యుంటినని వానికిఁ దెలియును. కావున వాఁడా ప్రసంగముఁదెచ్చి నన్న వమానింపలేఁడు. అదివచ్చిన మేమిరువురము సమానులమేయగుదుము. కానిమ్ము. ఒకప్రశ్న వైచి చూచెదను. దీనితో వాఁడు కూలిపోవును." అని తనలోఁ దాననుకొని, లేచి, "ఓయి! నీకీసుగుణవర్మయను పేరువచ్చి యెంతకాలమైనది?" యని యడిగెను. ,, నేనెప్పుడీపేరితోనే యుండలేదని చెప్పఁగలను.ఎప్పుడీనామముందాల్చితినో మాత్రము చెప్పను."అని సుగుణవర్మ ధైర్యముతో 'జవాబు' చెప్పెను. వెంకటపతి సగర్వముగా జూచుచుఁ గూరుచుండెను. తానుగెలిచినట్లే భావించుకొనెను. ఆనందరావు సుగుణవర్మస్థితినిజూచి మెచ్చుకొనెను, కాని యతనియందింకను బూర్ణవిశ్వాసమే యుంచెను. సాక్ష్యబలమెంతగా రెండవకక్షివారికున్నను సుగుణవర్మనిర్దోషియనియే యతని యభిప్రాయము. జగన్నాథవర్మ తప్పక సుగుణవర్మదోషియే యనితలంచెను. ప్రకాశరాయరామచంద్రులులోలోనఁజంకలుకొట్టుకొనుచుండిరి. శాస్త్రిమరల,సుగుణవర్మగారూ! మీరిట్లు వెంకటపతిరాజుగారిప్రశ్నల కుత్తరములీయకపోవుటచే మీకు నష్టమున్నది. మీపక్షము బలహీనమగుచున్నది.' యని చెప్పినపుడు వారిరువురికి మహాసంతోషముతోఁచెను. తప్పక తమ కుతంత్రములు నెఱవేఱునని యూహించిరి.

ఆనం—న్యాయదర్శీ! కారణాంతరములచే సుగుణవర్మ తనరహస్యాంశములను వెల్లడిచేయ ననుటలోఁ దప్పేమియున్నది? అంత మాత్రముచేత నతనిపక్షము బలహీనముగా నున్నదని తమరువచించుటకు హేతువు నాకేమియుఁ గాన్పించుటలేదు. ఇంతకుఁబూర్వము సుగుణవర్మను నీప్రశ్న నేనుఁగూడ నడిగితిని. అప్పుడు—

వెంక—ఆర్యా! శాస్త్రిగారింతకుముందే వాకుచ్చిన సద్వాక్యము జ్ఞప్తియందున్నదా? 'నిజమైన యనపరాధులట్టి కేకలు పెట్టరు' మీరును దానిని గమనింపుఁడు.

శాస్త్రి—నిజము. ఆనందరావుగారూ! చెప్పెదను వినుఁడు. వెంకటపతిరాజుగారి ప్రశ్నలకీయన ప్రత్యుత్తర మీయనందువలన, స్వపక్షబల మెట్లునశించునఁనఁగా, వెంకటపతిగారు తెచ్చిన యభియోగములో మొదటనే సుగుణవర్మకు విత్తమువచ్చు నాధారము లేదని చెప్పఁబడియున్నది. అదియబద్ధమని రుజువుజేసికొనుభారము సుగుణవర్మది. అట్లు చేయక యాతనిప్రశ్నలకు మార్వాలుక నిరాకరించుటచే నభియోగమందలి వాక్యములను మఱింతస్థిరపఱిచినట్లయ్యెఁగదా? ఇప్పుడైన నాతఁడు తనకెట్లు సంవత్సరమునకుఁ బదివేలు వచ్చుచున్నవో, యాఘనుఁడెవ్వఁడో తెలిపిన నాయంశములు నమ్మఁదగినవైన, నితఁడు సాలూరురాజుగారిని మోసముచేసి ధనము సంపాదింప వలసినంత తక్కువస్థితిలోఁ లేఁడని నమ్మవచ్చును. అప్పుడు వివాదమింకొకపద్ధతి మీఁద విచారింపవలసియుండును. సుగుణవర్మ దోషి కాకపోవచ్చును.

ఈ సమయముమందొక కంచుకివచ్చి "మహాప్రభూ! ఇద్దఱు రక్షకభటులు న్యాయాధికారుల యాజ్ఞప్రకారము వచ్చి వాఁకిట నిలిచిరి. వారీకమ్మను దమ కందఁజేయుమనిరి. తమరిందు సంతకముం జేసిన యెడల వెంటనే యందువ్రాయఁబడినయాజ్ఞను నెఱవేర్తుమనియు మనవి చేయుమనిరి. మీఁద దేవర చిత్తము" అని యడఁగువతోఁ జెప్పి యొక లేఖను శాస్త్రి చేతికిచ్చెను.

శాస్త్రి "ఓరీ! రక్షకభటుల నావలఁ గొంతసేపుండుమనుము. ఒక తొందరపనిఁ జూచుచుంటిననియు, నిప్పుడా జాబుపైఁ జేవ్రాలు చేయ వలనుపడదనియుఁ జెప్పు" మని చెప్పెను. సేవకుఁడావల కేఁగెను. రక్షకభటుల నాఁగుఁడని యాజ్ఞయిచ్చుటకుఁ గారణమెల్ల వారికిఁ దెలిసె

ను. నేరంపుభారమంతముఁ బ్రికృతమున సుగుణవర్మమీఁదనే యుండు టచే, నతఁడు చెఱసాలకుఁ బంపఁబడుననియే యందఱు నూహించిరి. కొన్నినిమేషములవఱకు నంతయు నిశ్శబ్దముగా నుండెను. పిమ్మట నానంద రావు లేచి „ నాయనా! నాకుమారా! సుగుణవర్మా! ఇప్పుడైన నీవు గుహ్యముగా నుంచిన యంశములఁ జెప్పుము. నీ మానప్రాణములకు భంగము వచ్చునప్పుడే యింకను దాఁప యత్నింతువా? బాబూ! నిన్ను బతిమాలెదను. చెప్పుము. జాగుచేయకు”మని యాతురముతోఁ బల్కెను. సుగుణవర్మ శిరస్సువంకించి యూరకుండెను.

మరల నానందరావు “ నాయనా ! తన్నుమాలిన ధర్మమున్నదా? చెప్పుము, నీకేమియుఁ జేప్పుటకు లేదా?” యని యడిగెను. సుగుణవర్మ చలనము లేనట్టియు, కాని గాఢమును దెల్పునట్టియుఁ గంఠ ధ్వనితో.నేను జెప్పవలసినదేమియును లేదని మాఱుపలికెను.ఆనంద రావు నడుమువిఱిగినవానిభంగిఁ గూలఁబడెను.

జగ—(ఆనందరావు చెవిలో) మిత్రుడా ! వాని స్థైర్యముంజూడ నాకును వాఁడు దోషికాఁడేమోయని యనుమానముకలుగుచున్నది. ఏదో కుతంత్రము జరిగియుండుననియే నానమ్మికయును.

వెంక—రాజా! ఇప్పుడు తమకు సంతుష్టి గల్గెనా?

ప్రకా—(కర్ణకఠోరధ్వనితో) ఇప్పుడు న్యాయాధిపతిమాత్ర మేమిచేయఁగలఁడు? తప్పక వానిని శిక్షింపవలెను. అన్నా! ఏమందువు?

రామ—(సంతోషముతో) అవును. శిక్ష విధింపక తీఱునా? లేనిచోనిఁక ధర్మశాస్త్రములెందులకు? న్యాయాధికారులెందులకు?

ఆనందరావింతవఱకా యిరువురయెలుఁగులును వినలేదు. శ్రుతి కటువులైన వారికంఠధ్వానములు వినినతోడనే యతఁడాసనమునుండి సంభ్రమముతో లేచి, యొక్కసారి యాకస్మికముగా వారిసభిప్రాయము

నకు లంఘించి, వారి ముఖములవంక నొక క్షణము చూచి "అప్పురా !
దుర్మార్గులారా! నరహంతకులారా! మీరా? ఇంతసే పగునా కాదా
యని సందియపడుచుంటిని. మీరు నాఁడు నన్ను సింహాచలమునకుఁ
బోవు దారిలో నడ్డగించిన దారిదొంగలు కారా? మీరా యిప్పుడు"—
అని మేఘగంభీరభాషణములతోఁ బలుకుచుండఁ బ్రకాశరాయఁ డా
తని మొఱఁగుచు గప్పునంత బిగ్గరగా 'అబద్ధము, అబద్ధము. ముమ్మా
టికి నబద్ధము' అని యఱచెను. వానిమేను గజగజ వణఁకుచుండెను.
సుగుణవర్మ 'హా! అగును. నేనును సందేహయుక్తచిత్తుఁడనై చెప్పనో
డితిని-వీరే దారులుగాచి జనులను హింసించు దొంగలు. నా చేతిరుచి
ని బాగుగా నెఱుఁగుదురు. నిశ్చయింపనెను.

వెంకటపతి మున్నుగువారు మాటలాడుచున్నప్పుడె శాస్త్రి కం
చుకి తెచ్చినకమ్మను జదువ నారంభించెను. అందలి యంశములం జదివి,
పై సంభాషణమును విని, యత్యంత క్రోధచోదితుఁడయి, యతఁ
డెలుగెత్తి "హా! ద్రోహకమియ్యో. హుష్. ఎవ్వరును మాటలాడకుం
డు. ఓరీ! ఎవరక్కడ! ఆరక్షకభటుల నిటు రమ్మనుము" అని యొక
బంటున కానతిచ్చి నిలిచెను. అర్ధరాత్రివలె నంతయు నిశ్శబ్దముగా
నుండెను. అందఱు నాత్రముతో శాస్త్రి యేమిచేయునో, యేమిపలుకు
నోయని కనుగలిగి చూచుచుండిరి. ప్రకాశరాయ రామచంద్రులముఖ
ములు వెలవెలఁ బోయెను. ఒకరినొకరు విచారసూచకదృష్టులఁ జూచు
కొనిరి. కొండొకతడవునకు రక్షకభటులా యగారముం జొచ్చి, శాస్త్రికి
వంగి నమస్కరించి, వినమ్రులై నిలువఁబడిరి. న్యాయాధిపతి ప్రకాశ
రాయరామచంద్రులవైపు చూపించుచు "భటులారా! మీధర్మము
ను మీరు నెఱపుఁడని యాజ్ఞాపించెను. తోడనే వారాయిరువురికి సం
కెలలు వైచిరి. "దొంగలారా! మీరేల శృంఖలాబద్ధులుగా గావింపఁ
బడితిరో యెఱుఁగుదురా? మీరు రామదేవవర్మగారి నొకరేయి మా

మంచస్థుకొని కొట్టినట్లు రక్షకసంఘమువారు కనుఁగొనిరి. ఘనులగు నానందరావుగారి వాక్యములవలన మీానుష్టత్వము స్థిరపడినది” అని శాస్త్రి యందఱును వినునట్లు చెప్పెను. ప్రకాశరాయఁడు ,, అన్నా మన కొంపమునిఁగినది. ఈ పాడుముండకొడుకగు వెంకటపతిమూాల మున మనకు నాశముసంభవించినది. ఆ పదివేలరూపాయలలో భాగ మడుగక, మనయొద్దనున్న ధనముతో నేయేనామీా పాఱిపోయి యుండవలసినది. ఈ దౌర్భాగ్యునితో వ్యవహారమును బెట్టుకొంటిమి గాని, లేనియెడల నింతకుఁబూర్వమే యేనామునకుఁ బ్రాఁత కాఁపుల మైయుండి యుందుముగదా !” యనిరోదనధ్వనితోఁబలికెను.

ఆనందరావానందమును బట్టఁజాలక సుగుణవర్మను కౌఁగిలించు కొని ,నాయనా! నీ నిర్దోషిత్వము స్థాపింపఁబడియె దుష్టులవాతనుండి తప్పింపఁబడితివి. నామదికుదురుపడెను ” అనిసాదరముగఁబలికెను. సాలూారునృపతి సుగుణవర్మను సమీాపించి , స్నేహితుఁడా ! ధర్మమే జయముఁగాంచెను. నీవును నేనును ధన్యులమైతిమి’ అని సంతోషము తోనుడివెను. శాస్త్రి భటులనుబిలిచి , ఈ వెంకటపతికిఁగూడ సంకెల లుంపుఁడు. వీనినిగూడ వారితోఁబాటు గారాగారబద్ధునిం జేయుఁడని శాసించెను.

---

## పదునాఱవ ప్రకరణము.



మరలఁ గామేశ్వరమ్మ.

పాఠకమహాశయులారా ! మనము మనరంగమును గోదావరి మండలమునుండి విశాఖపురీమండలమునకు మార్చికొనినప్పుడు, మన కథానాయికయగు నరవిందామహాదేవి, కామేశ్వరమ్మవలనఁ బ్రభా కరుని మరణవార్తవిని, కుంభముండ నామెను విడిచిపెట్టితిమి. జ్ఞాపక

మున్న దా? ఆదుర్వార్తవినియరవిందయు నామెతండ్రియు నెట్లుదుఃఖించిరో మన మెఱుఁగుదుముగదా! తరువాత రెండుదినములవఱకు నామె తనగదివిడిచి యీవలకురాలేదు. తిన్నగా భోజనముఁ జేయలేదు. రాజకార్యములఁ జక్కఁబెట్టలేదు. ఆమె కన్నీట నాతెఁ దృష్టి వచ్చుచుండెను. ఏమికారణముచేతనో కామేశ్వరమ్మయు నీరెండు దినములలో నామెకడకు రాలేదు. మూడవనాఁ డామె దేవియొద్దకు వచ్చెను. దేవి, తాను దుఃఖించుచుండినట్లు కన్పట్టిన నామె మరల నా ప్రియాకరుని గూర్చి యేమిప్రశ్నచేయునో, దాన నేమిపలుకవలసి వచ్చునో, మన మెంతకలగుఁడువడునో, యని లేనిసంతోషమును దెచ్చి కొని మాటాడ జొచ్చెను. కామేశ్వరమ్మయం దరవిందకుఁ బూర్ణవిశ్వాసమేయున్న యెడల, నామెచూపులయందును బలుకులందును యాథార్థ్యమే యామెకుఁ జూపట్టిన, మునుపు తనకును బ్రియాకరునకును గల నెయ్యమును విశదీకరించి యుండును. విశదపఱిచి కొంచెము చిత్తశాంతి నొందియుండును. తన రహస్యములు వినుటకును, సదుపదేశమిచ్చుటకును దగినంత విశ్వాసపాత్రి కామేశ్వరమ్మ కాదనియే యరవింద యూహ.

ఆనాఁడు సాయంకాలము నెయ్యురాండ్రిరువురును సౌధోపరిభాగమునఁ బ్రచారముచేయుచుండిరి. కొంతసే పితరవిషయములంగూర్చి సంభాషించుకొనిరి. కాని యప్పుడరవింద తనకిష్టములేని ప్రసంగమేమి వచ్చునోయని భయపడుచుండెడిది. కామేశ్వరమ్మయే మొదట నిట్లు ప్రసంగింప నారంభించెను.

కామే—దేవీ! మొన్న నేననవసరముగా మీహృదయమును జెదరఁ గొట్టితిని. ఇప్పటికి నాయెదరు మిమ్ము వదలనటులే నాకుఁ గాన్పించుచున్నది.

అర.—అవార్త నన్నే కాక మాజనకుని గూడఁ గలఁతఁబెట్టినది. మృతి నొందినయాతఁడు నాతండ్రికిఁ గడుఁగూర్చువాఁడు. అతనిని జిన్ననాఁటినుండియు మాతండ్రియే పెంచినాఁడు. పుత్రునివలెనే యాతనినిభావించినాఁడు. నేనును వానితోఁగూడఁ బెరుఁగుటచే బాధ్యత పోకుండెను. దుఃఖశాంతి కలుగకుండెను.

కామే.—వానిపైఁ దమకంతయనురాగముండెనా యేమి?

ఇట్టిప్రశ్నయే కామేశ్వరమ్మ మునుపొకమాటు దేవినడిగి యున్నది. ఇప్పుడు క్రిమ్మఱ నేలయట్లడిగెనో యరవిందకు బోధపడ కుండెను. ఆమె మొగమువంకఁజూచి యేదైనదురుద్దేశమున్న దేమోయని యనుమానించెను. అంతలో మరల"అయ్యో! నేనేలయామెయందు దురభిప్రాయపడవలెను? ఎక్కువస్నేహముతోఁ దిరుగువారట్లడిగినఁ దప్పేమి?"అని తనలోఁ దాననుకొనెను. ఆమె యాప్రశ్నమున కేమియు బిగ్గఱగా మాఱువల్కక, యేదో మెల్లఁగ గొణఁగుకొనుచు నడుచు చుండెను.

కామే.—దేవీ! తమక్షేమమే సర్వదా కాంక్షించుచున్నదానను. గావునను, దమయభ్యుదయమే నాకు ముఖ్యమని యెంచుదానను కావునను, దమతోఁ గొన్నివిషయములు మనవిచేయవలెనని యున్నది. దయతో వినవేఁడెదను. మఱియొకలాగునఁ దలఁపకుఁడు. అమ్మా! తమరాప్రభాకరునియందుఁ బ్రేమవహించినమాట సత్యమే కాదా? అది సహోదరప్రేమయే యనుకొందును.

అర.—ఏమమ్మా! ఇన్నిమాఱులడిగెదవు? మొన్న నీవీప్రశ్న వైచినప్పుడు నేను వానియెడల నప్పుడు భ్రాతృప్రేమ వహించితినని చెప్పలేదా?

కామే—అవును చెప్పితిరి. కాని తమ బాహ్యవైఖరిని బట్టి, లజ్జాధిక్యముచేతనో లేక మఱియే యితరకారణముచేతనో, నాకుఁ జెప్పక కొంత దాఁచితిరనుకొని యట్లడిగితిని. నా హృదయమంతయుఁ దమకు విశదమేకదా! ఏల నానుండి కొంచెము గుహ్యముచేసితిరి? తమ ముఖ్యస్నేహితురాలనగు నాతో నంతయు నేల నుడువరాదు? తమ్ముఁగూర్చి యీ ప్రాంతమం దందఱికిని దెలిసిన సంగతులు కొన్ని కర్ణాకర్ణి నేనును వింటిని.

అర—ఏమి సంగతులు?—అని యాశ్చర్యపడి యడిగెను.

కామే—చెప్పెదను, వినుఁడు. నాకు దాఁపఱికమేల? మీరు మీమేనత్తగారి కుమారుని వెంకటపతిరాజుగారిని ప్రేమించితిరని వింటిని. అది నిజమే యైనయెడలఁ బ్రభాకరునిపై సోదరప్రేమను మాత్రమే పొందియుండి యుందురు. అన్యథా యూహించుటకు నాకవకాశమే లేదు. తమరు రెండు పర్యాయములా యభిప్రాయమునే తెలియఁబఱిచితిరి, కాని—

అర—కామేశ్వరమ్మా! ఇఁక నా ప్రసంగమును జాలింపుము. కొన్ని రహస్యము లున్నవి. నానిని జెప్పుటకు—అని యేదియో యనఁబోయి మిన్నకుండెను.

కామే—దేవీ! తమ యుద్దేశము నాకుఁ దెలిసినది. మీరహస్యములను జిరస్నేహము కలవారికేగాని చెప్ప వలనుపడదని కాదా మీయూహ? నాకుఁ దమతోఁ జిరస్నేహము లేదు. కాని జన్మించిన తరువాత మైత్రియనునది తమయొద్దనే నేను గంటిననుకొనుచున్నాను. తమయెడ నెట్టిభావము నాకుఁగలదో నాకును భగవంతునకును మాత్రమే తెలియును. ఇంచుక పరిశీలనబుద్ధితోఁ జూచితిరేని తమకును దెల్లము కాఁగలదు.

అర—(కామేశ్వరమ్మ చేయి పట్టుకొని) అమ్మా! నీకు నా యందలి నెయ్యములో లోపమున్నదని నాయభిప్రాయముగాదు. ఎన్నఁటికట్లు తలఁపకుము.

కామే—అమ్మా! తమరు నవయౌవ్వనమందున్నారు. బంధువర్గములోఁ దమకాఁపుకోఁదుండినటులఁ దోఁపదు. తమకుఁ గొన్ని యుపదేశములు చేయవలసినధర్మము నావంటిస్నేహితురాలికిఁ గలదు. కరుణించి రెండుమాటలు నన్నుఁ జెప్పనిండు. నేను దమకంటె నెక్కుడు లోకానుభవముఁ గలదానను. మీహృదయములోనున్న యభిప్రాయమును గ్రహించి వచించెదను వినుఁడు. ఆవల నే నుపదేశమిచ్చుటకుఁ దగినదాననగుదునో కానో తమకే తెలియఁగలదు. తమరు వెంకటపతిరాజుగారియందొకప్పుడు గాఢానురాగమునుబొంది యుంటిరి. కాని యాతని నడత తమమతమునకు వ్యతిరేకముగా నుండెను. అది తమకుఁ దెలిసినప్పుడు తమ రాతని ప్రీతిను దమహృదయమునుండి పాఱఁ ద్రోలవలెనని నిశ్చయించుకొంటిరి. మనసు కేవలమును ద్రిప్పివైచి ప్రభాకరునియందే నిలుపుట మేలని తలఁచితిరి. పాపమిప్పుడాతఁడు పరలోకగతుఁడయ్యెనని తెలిసెను. ఇప్పుడు తమచిత్తమందు—తమరు పైకిఁ జెప్పలేరు—వెంకటపతిపై ననురాగము జనింపకపోదు. అత్తఁడెంత దుండగీఁడైనను దమ రనురాగార్హుఁడనియే—

అర—కామేశ్వరమ్మా! లేదు. లేదు. నీయభిప్రాయము తప్పు. నీవు పొరపడితివి. ఆ వెంకటపతియందు నాకు లేశమైన గౌరవభావము లేదు. గౌరవభావములేనియప్పు డనురాగ మెట్టులుండఁ గలదు?

కామే—సరియే. అటులైన మఱియొక్క-మాటఁ జెప్పెద. పిమ్మట నీసంభాషణమును విడిచిపెట్టెదము.

అర—ఆ యొక్క-మాటమాత్ర మెందులకు?

కామే—ఊరకే. తమ కంతగాఁ బ్రిపంచవృత్తి తెలియదు గావున, బుద్ధిపూర్వకముగాఁ గాకపోయిన నెఱుకగలుగమిచే, నొకవేళ వాతనిఁగూర్చి పొరపడితిరేమోయని చెప్పుచున్నాను. నేననేక కష్టనిష్ఠురములకు లోనైనదాననగుటచే, నట్టి విషయములందు సత్యవృత్తిఁ దెలిసికొనఁగలననుకొందును. తమకు వెంకటపతిరాజుగారి పూర్వవృత్తిని గూర్చి చక్కఁగాఁ దెలియదని నాయూహ. అందుఁ గొన్నిరహస్యములునుంగలవు. అతఁడు లోకులు చెప్పుకొనునంత దుష్టుఁడుగాఁడు. అవ్విషయము తమకుఁ దెలియకపోవచ్చును. మఱియు—

అని చెప్పుచుండ నరవింద విసుగుఁదలయు నించుక కోపపుఁగెంపును మొగమునం గుఁ జూపెను. కామేశ్వరమ్మ సాహసించి యింకనేమియుఁ బలుకలేకపోయెను. అత్తఱిని నరసింహరాజక్కడికి వచ్చెను. కామేశ్వరమ్మ దేవియొద్ద సెలవుంగైకొని వెనుకకు మఱలెను సుతయు జనకుఁడును జాలసేపు రాజ్యాంగ విషయములంగూర్చి మాటాడుకొని లోపలికిఁ జనిరి.

అరవింద తనగదిలోనికిఁబోయి యింతవఱకుఁ గామేశ్వరమ్మతో సంభాషించుకొనిన యంశములగుఱించి తలపోయసాగెను. ఆమెకొకవిధమైన యనుమానము మనమున జనించి బాధించుచుండెను. తన్నిట్లు ప్రశ్నించుటలోఁ గామేశ్వరమ్మ కేదియో దురుద్దేశముకలదని యామె యనుకొనెను. కాని వెంకటపతిపక్షమున మాటలాడిన నామెకేమి లాభమని తలఁచెను. 'లాభములేకుండిన నా తెఱఁగున వానినుగ్గడించునే ? అతఁడు, లోకులనుకొనినంత దుష్టుగాఁడనునే?' యని పృచ్ఛఁజేసికొనెను. ఆమె ప్రవర్తనమంతయు విపరీతముగా నీమెకుఁ దోఁచెను. ఎటులైనఁ గామేశ్వరమ్మ యంతగా నమ్మఁదగినది కాదని నిశ్చయించుకొనెను. నాఁటినుండియు దేవి కామె వర్తనాదులఁ బరీక్షింపవలెనని బుద్ధిపుట్టెను. ఎన్నఁడు మనసిచ్చి యామెతో భాషింప,

గూడదని కృతనిశ్చయురాలయ్యెను. ఈసమాగమమువలన దేవేరి కామె యందు నింతకుఁ బూర్వమున్న విశ్వాసమునయితము చెడెను.

పైనివివరింపఁబడిన సంభాషణము జరగినతరువాతఁ గొన్ని దినముల కొకనాఁడు మధ్యాహ్నము నరసింహరాజును గూఁతురును నిద్రి మందిరమున నుచితాసనములయం దాసీనులైయుండిరి. వారు సద్బ్రాహ్మణుల కగ్రహారంబులఁ గట్టించుటకును, సస్యాదులకనువగు తటాకములఁ ద్రవ్వించుటకును, అనాథులకు శరణాలయముల నిర్మించుటకునుఁ దగినయేర్పాటులఁ గావింప యత్నించుచుండిరి. అట్టి సమయమున భటుఁ డొకఁడువచ్చి 'మహాప్రభూ! ఒక కాలరి విశాఖపురినుండి వచ్చి యీజాబు ప్రభువువారికీయుమని నాచేతికిచ్చెను. అతఁడు దేవిడీకడ నున్నాఁడు' అని చెప్పి నరసింహరాజున కొకకమ్మనందిచ్చెను. పైని లిఖింపఁబడిన యక్షరములపొంకమిం జూచి యది భోగరాజు కామేశ్వర రావు వ్రాసినదని తెలిసికొని, నరసింహరాజు వెంటనే దానిని జదువ నారంభించెను. తండ్రి జాబుఁ జదువుచుండ నరవింద యాతనివంకఁ జూచుచుండెను. అతని మోమింపుక దుఃఖమును సూచించుట యామెకుఁ గన్పట్టెను. నరసింహరాజు దానిని సమగ్రముగఁ "జదివి 'అమ్మా! ఇది కామేశ్వరరావుగారి యొద్దనుండి వచ్చినది. అతఁడు మన వెంకటపతిని గూర్చియే వ్రాసినాఁడు. ఎన్నివిధములనైవానికొఱకు మనము దేవులాడిననేమి" వాఁడు మూర్ఖుఁడు. వానిని సరియైన దారికిఁ దెట్టుటకు మనతరముగాదు? అని కూఁతుతోఁ జెప్పెను.

అర—నాన్నగారూ! అతఁడేమిచేసెను? ఎవరినైన మోసము చేసినాఁడేమి?

నర—కామేశ్వరరావుగారు వ్రాసిన కమ్మను జదివెదనువినుము (అని కమ్మను దిలకించి) పోనీ. వలదు. అందలి ముఖ్యాంశములఁ జెప్పె

దను. వాఁడొకప్రభువును మోసముచేసి ధనముమబడసెనఁట. అది బయటికిఁ బొక్కెనఁట. వాఁడిప్పుడు చెఱసాలలో నున్నాఁడఁట.

అర—(ఆశ్చర్యముతో) ఏమి ? మొన్న మొన్ననుగదా వానికి మరణశాసనపరిహార మేఁబదివేలును మనము పంపితిమి ? అప్పుడే యాధనమును వ్యయముచేయుటయు, మరల నితరులను ద్రోహము చేసి సంపాదించుటయునా? ఎంతదుర్మార్గుఁడు!

అని కొంతసేపు పరధ్యానముగానుండి యోజించెను. "ఆహా! నేను దెలివితక్కువదాననై వానినేపెండ్లియాడియున్న నెంతముప్పైన సంభవించియుండును. పూజ్యుఁడగు నాపెదతండ్రి నాకన్నులఁ దెఱచి వాని సత్యప్రవర్తనము నాకుఁ దెలియఁజేయకుండిన నాపనియేమగు నో! ఆమహానుభావుఁడు చిరస్మరణీయుఁడుగదా! " అని తనలోఁ దా ననుకొనెను.

అర—అమ్మా ! నీవనినట్లు వాఁడు దుర్మార్గుఁడే. నిష్కళంక మైన తన వంశమునకు మచ్చఁదెచ్చినాఁడు. చందనవనములో ముండ్ల చెట్టువలెఁబుట్టి తండ్రిదాతలపేరులు చెడఁగొట్టుచున్నాఁడు. వాఁడు సాలూరురాజుగారితో దొంగపాచికలుపెట్టి జూదమాడి, పదివేల రూపాయలు గెలుపొందెనఁట. ఎవఁడో యొకయువకుఁడు, సుగుణవర్మ యను పేరివాఁడు, వానిమోసమును గనుఁగొనఁగా, వాఁడనిమీఁదనే వీఁడెదురుతిరిగి, యాతనినే చిక్కులువెట్టఁజూచెనఁట. అందు నిమిత్త ము కొందఱు దొంగలను సాక్షులనుగాఁ జేరఁదీసెనఁట,తుదకంతయుఁ బట్టుపడెనఁట. వానిమోసకృత్యము బట్టబయలయ్యెనఁట. ఎన్నిసారు లో చెఱసాలయందలి రుచిచూచిన వానిస్నేహితులతోఁ బాటు వాఁడు ను గారాగృహమున నుంపఁబడెనఁట.

అర—ఎంతయవమానము! ఎంతచిన్నతనము! నాన్నగారూ! పాపము, వానికేదైన నాయముం జేసితిమేని వాఁడు బయలుపడు నేమో? వానిదౌష్ట్యములను మఱచి—

నర—అమ్మా! వలదు. వలదు. సర్వసాధారణముగా నీకుం గల్గుచుండు దయ వీనిపైం జూపకుము. ఒరులయెడలం గరుణంజూపుట పుణ్యమే యైనను, వానియెడమాత్రమట్టిదిగాదు. మహాపాపకార్యమగును. వీఁడు ద్రోహముంజూపం గడంగిన యాయకావనుండు మిగుల మర్యాదగలవాఁడఁట. సత్యసంధుఁడఁట. అట్టివానిని గోతిలోం ద్రోయ యత్నించినాఁడని కామేశ్వరరావిందు వ్రాసియున్నాఁడు. అతఁడింకను వ్రాసినాఁడు. ఆనందరావను ఘనుఁడు సింహాచలయాత్రకుం బోవుచుండ, దారిలో నిద్దరుదొంగ లడ్డుకొని కొట్టినారఁట. ఆసమయమున దాసుగుణవర్మయను యువకుం డెటనుండియోవచ్చి యాతనిఁగాపాడి దొంగలం బాఱఁద్రోలెనఁట. వారెవ్వరా దొంగలమోములం జూడలేదఁట. కాని యెలుంగులు వినిరఁట. వారిద్దఱో మన వెంకటపతి స్నేహముం జేసి, దొంగపాచికలసంపాదించి, పైనిజెప్పఁబడిన ద్రోహముం జేసినాఁడఁట. అందఱును వెంకటపతిబసలోనే న్యాయాధికారులకుం బట్టుపడిరఁట. అట్టివాఁడు చుట్టముగానీ, మఱేమిగానీ, దయనీయుఁడా! కాఁడు. వానిపాపఫలము వాఁడనుభవింపక తీఱదు. లేనిచో నది యుపశమింపదు. కామేశ్వరరావింక నేదో వ్రాసినాఁడు. చెప్పవలసిన సంగతులు చెప్పితిని. అమాయకుఁడు, పరోపకారశీలి, సుగుణసంపన్నుఁడు, నగు నొకయువకుఁడు వానిమాయాజాలములోం బడకుండం దప్పింపఁబడినాఁడు. వాఁడుమనవాఁడయినను, బైటవాఁడయినను, ధర్మబుద్ధి గలవాఁడగుటచే జయముంగాంచెను. నాకు సంతోషముంగూర్చుట కదియే చాలు. వెంకటపతి బంధింపం బడెనన్న విచారము నాకు లేశమైనలేదు. విశేషించి వానికిం దగిన శాస్తియైనదని యానందముగూడ నున్నది. అరవింద యంతయు సావధానముగావిని తల పంకించి, యొకనిట్టూర్పువిడిచి "నాన్నగారూ! మనమిప్పుడు చేయఁదగినదేమి?" యనితండ్రి నడిగెను.

నర—తల్లీ! మనము చేయఁదగిన దేమున్నది? ఏమియును లేదు. ఆసుగుణవర్మయే యెన్నియో తెఱఁగుల మనవానిని. దప్పింపవలెనని ప్రియత్నించుచున్నాఁడఁట. ప్రియత్నించినాఁడఁట. ఎవనినాశముచేయ సమకట్టినాఁడో వాఁడే మనవానిపాలిదిక్కైయున్నాఁడఁట. మఱియు సాలూరురాజుగారు, వెంకటపతి, నేను దోషిని నన్ను క్షమింపుఁడు. అనిన దయఁజూపవలెనని చూచుచున్నారఁట. మనవాఁడట్టుగాక యి ప్పుడునయితము దోషమాసుగుణవర్మమీఁదనే త్రోయఁజూచుచుండె నఁట ఎవరెంతసాయముం జేసినను, వానికిఁ గొలఁదిగనో గొప్పగనో శిక్ష తప్పదు. కులగౌరవమునకు భంగము రాకమానదు. మనమేమి యు జోక్యముఁ గలుగఁజేసికొన జాలము. భగవంతుఁడే వానికి సద్బుద్ధి దోఁపించి కాపాడవలెను.

అర—నాన్నగారూ! అవును. మీరుపలికినదంతయు సత్యము.

అని మరలఁ గొంతతడవు యోజించి జరగిన సంగతులన్నియు జ్ఞప్తికిఁదెచ్చుకొని, పదపడి పెదతండ్రి వాత్మలో స్తుతించి నమస్కరించి తనకాదురాత్మునితోఁ బొందుఁ దప్పించినందులకుఁ బరాత్పరుని బొగడెను.

పదునేడవ ప్రకరణము.

జాఱవిడిచినబాబు.

మఱునాఁడు సొంతపనులనుఁ జక్క బెట్టుకొనుటకు నరసింహారాజు చంద్రమహాలెము వెళ్లెను. అరవింద దీర్ఘాలోచనచేయుచుఁ దనగదిముం దుఁ గూర్చుండియుండెను. ఆమె యనేకహేతువులచే విచారగ్రస్తయై యున్నది. ప్రభాకరుఁడు మృతినొందెనను విచారమొకటి. మేనత్తకొడుకు నలుగురిలో రవ్వపాలై పోవుచున్నాఁడని మఱియొకఁటి.ఇంకఁ బెక్కు కా

రణములుఁ గలవు. అరవిందకు వెంకటపతిఁగూర్చి కలిగినచింత యాతని యందనురాగముచేతఁ గాదు. అదిచాలకాలముక్రిందనే నాశమొందినది. తనముఖ్యబాంధువర్గములో నొకఁడట్టియపకీర్తిపాలై పోవుచున్నాఁడని యామె చింతించుచున్నది. అట్టిసమయమునఁ గామేశ్వరమ్మవచ్చెనని దాసిచెప్పెను. ఏమో నేఁడామెపేరు వినుటకే యరవిందకిష్టము లేకుండెను. ఇంతకుమును పెన్నఁడట్లులేదు. ఆమెయందుఁ గొంచెమను మానము మాత్రముండెనుగాని రోఁత గలుగలేదు. అట్లు కలుగుటకిదే ప్రథమపర్యాయము. అరవింద దాసితోఁ సరియే. రమ్మనుమని, మొగము ముడుచుకొనియే పల్కెను. కామేశ్వరమ్మ లోనికివచ్చెను. ఆమె దేవిముఖవికారమును దిలకించి, దేవీ! మీరేమోయిట్లు చింతాక్రాంతమై యున్నట్లు గాన్పించుచున్నదేమి? నేను దమయాలోచనలకేమియు నడ్డంకిగారాలేకుగదా? యని యడిగెను.

అర—లేదు. ప్రకృతము నాయోజనలకు నీవేమియు నభ్యంతరము గాలేవు. వింతలేవైనఁ గలవా?

కామే—అమ్మా! క్రొత్తవేమియును లేవు. తమరేల యిట్లున్నారు? నిండుచందురుఁబోలు మోము మేల యించుక కళాహీనమైయున్నది? నిన్నటి నాసంభాషణమేకాఁబోలు మీకీచింతఁదెచ్చిపెట్టినది? అవును. ఇందాశ్చర్యమేమున్నది? సోదరసమానుఁడగు వాఁడు పోయినప్పుడు దుఃఖముకలుగదా? మఱియు నొకనియందు నిలిపిన యనురక్తికి భంగమువచ్చినప్పుడు ఖేదముప్పతిల్లదా?

అర—కామేశ్వరమ్మా! దయయుంచి యాప్రసంగము మానుము. నాచేత గట్టిగాఁ జెప్పించుకొనకుము. పరుషభాషణము లాడుట నాకిష్టములేదు. ఇఁకనెన్నఁడు నీవాపేరెత్తిన నాకడఁదేకుము. (అనికొంత సేపు యోజించి) అమ్మా! నే నిట్లనుట నిన్నుఁగసరుట కాదు

సుదీ ! ఆవెంకటపతినిగుఱించి నీకంత బాగుగాఁ దెలియ దనుకొందును. తెలిసియున్న నిట్లు చెప్పవు. వాని విషయము లోమేమే దురభిప్రాయము పడితిమని నీవు తలఁచుచున్నావు కాఁ బోలు. ఎంతమాత్రమును గాదు. వాఁడెంతదుష్టుఁడనుకొందువు! కండ్లా రఁజూచి యనుభవించినవారమగు మాకంటె నధికముగా నీకు వానిని గూర్చి యెఱుకగలదనిన నేనునమ్మను. వానిప్రశంస యెన్నఁడును దల పెట్టకుండవలయునని నా మనోనిశ్చయము. ఇతరులు నాయొద్ద నట్లు లుండవలెననియే నాయూహ. నీమనస్సెక్కడ నొచ్చునోయని యింత శాంతముతో వచించుచుంటిని—

కామే—అట్లయిన నన్ను క్షమింపుఁడు. అమ్మా! తమరేచెప్పుఁ డు. నేనువిందును.

అర—నేనైన వానినిగూర్చి మిక్కిలి వచింపఁగోరను. కొన్ని కుటుంబరహస్యము లున్నవని నిన్ననుజెప్పితినిగదా ! ఆరహస్యములు కప్పిపుచ్చవలసినవేళాని వానిపైఁదెర తీయవలనుపడదు. అయిననందుఁ గొన్ని లోకమంతయు వ్యాపించియున్నవి గావునఁ జెప్పెదనువినుము.

కామే—చిత్తము. సావధానబుద్ధితో నున్నాను. చెప్పుఁడు.

అర—ఎందులకు నిన్ను వానిప్రసక్తినాకడఁదలపెట్టవలదంటినో, యేల నాకువానియెడ నొకప్పుడుగలిగిన యనురాగముమాట స్మరణకుఁ దేవలదంటినో, యెఱుఁగుదువా?

కామే—అమ్మా! ఏమియునెఱుఁగను; దయతోఁ జెప్పుఁడు.

అర—వాఁడు ద్రోహియని యింతకుఁబూర్వమే యెఱుఁగుదు ము. ఇప్పుడది మఱింత స్పష్టమయ్యె. న్యాయాధికారులచే విచారింపఁ బడి వాఁడిప్పుడు చెఱసాలలో నుంపఁబడియుండెను.

కామేశ్వరమ్మకీసమాచారము క్రొత్తదిగాఁగన్పట్టెను. ఆమాట విన్నతరువాత హృదయములో నొకవిధమగు నాందోళనము పుట్టెను.

కాని దాని నాఁడిపైవైచి యొక్కింతసేపు మూకీభావమువహించి యుండి, తలపంకించి, అమ్మా! చెఱసాలయందు బంధింపఁదగిన యకృత్యమాతఁడేమి చేసెను ? అని యడిగెను.

అర—వాఁడొక జమీందారుని జూదమందు మోసముచేసి విస్తారధనమును సంపాదించెనఁట; మోసకృత్యము కనుఁగొనఁబడెనఁట. మఱియు నతఁడు కడుదుర్మార్గులు, చోరులు, హంతకులు నగు నిద్దఱితోఁ జతఁగూడి యుండెనఁట. అదియు న్యాయాధికారుల యెదుటనే రుజువయ్యెనఁట. అన్నిటికంటెను ఘోరకార్యమింకొకటి చేసినాఁడట. జమీందారుని దాను మోసముచేసియు, నయ్యది యమాయకుఁడు, శుద్ధవర్తనుఁడు, ఘనుఁడునగు, సుగుణవర్మయను యువకునిపైఁ ద్రోయఁజూచెనఁట.

కామే—ఏమి? సుగుణవర్మయా ?—అని పరధ్యానముతోఁ జూడమొదలుపెట్టెను. ఆమె కెద్దియో సంభ్రమపాటు గలిగెను. ఎంత ప్రయత్నము చేసినను, దానిని వారించుకొనలేకపోయెను. హృదయావేగము మోముఁదమ్మియందుఁ దెల్లముగాఁ గనఁబఱిచెను.

అర—అవును. అదియే వానిపేరఁట. వానిని నీ వెఱుఁగుదువా?

కామే—(తడఁబడుచు) ఎఱుఁగుదును—కాదు కాదు—ఎఱుఁగను—అనఁగా వానినిగూర్చి వినియున్నాను. మీ మేనత్తకొడుకే?—వెంకటపతిరాజుగారి ?—అట్టి పని—

అర—సందేహమేమి ? వాఁడే యిట్టిపనిఁ జేసెను. అందు నన్యేతరమైనదేమియు లేదు. కామేశ్వరమ్మా! ఇప్పుడు వాఁ డెట్టివాఁడో తెలిసెనా ? ఇఁక—

కామే—దేవీ ! ఇఁక నెప్పుడు వానిపేరు తమయెదుట నుచ్చరించుదాననుగాను. అంతయుఁ దెల్లమయ్యెను. తమ యభిప్రాయము నాకుఁ దెలిసినది.

ఇయ్యెడఁ గామేశ్వరమ్మవైఖరి నంతయు దేవి చూడకపోలేదు. ఆమె జిచ్చపాటి, కలవరము, తడఁబాటుమాటలు, చూచి గ్రహించి విని యరవింద యాశ్చర్యపడెను. "నేనుజెప్పిన యీ చిన్నవార్తకే యీామె యిట్లు గూర్చొందనేల ? చూడఁజూడ నీను వెంకటపతికిఁబరి చయస్థురాలివలెనే కాన్పించుచున్నది"అని తనలోఁ దాననుకొనుచు దేవి తలపోయుచుండెను. కామేశ్వరమ్మ దేవి యాలోచన యంతయుఁ గనిపట్టుచుండెను. ఆమెయెన్నిరీతులఁ బ్రయత్నించినను హృదయావేగ మాఁగకుండెను. తుదకు లేనిదగ్గుఁ దెచ్చికొని పలుకమాఱినదానివలె నటించుచు నావలకుఁజనెను. పాపమామె కస్వస్థతకల్గినదే మోయని యరవింద "అమ్మా ! ఏమున్నుంటివి ? ఏదైన మాదుఁదెప్పింపనా ?" యని యడిగెను.

కామే.—తల్లీ! వలదు; కొంచెము దగ్గువచ్చినది. అది యేపోవు ను—అప్పుడే పోయినది—ఇప్పుడేమియును లేదు—ఆఁ జ్ఞప్తికి వచ్చె ను. దేవీ ! నేను బసకుఁ దొందరగాఁ బోవలసియున్నది. మరలఁదమ దర్శన మిప్పుడే చేసెదను. సెలవిప్పింపుఁడు.

అని యామె చనెను. అరవింద యామె తబ్బిబ్బుమాటలు, చిత్రచర్య చూచి వెఱగుపడుచుఁ బడకకురిచీమీఁద నట్టువ్రాలెను. ఒకగడియవఱ కారీతినే యాలోచించుచుండెను. అంత లేచియాగదిలో నే వ్యాచారము చేయుచుండెను. అప్పుడొకచోట నొకకాగితపుమడత కాన్పించెను. తనతండ్రి యేదైనజాబు నచ్చట జాఱవిడిచెనా యనిదాని నెత్తి చూచెను. దాని పైవిలాసము వ్రాయఁబడి యుండలేదు. పైవి లాస మింకొక కాగితముమీఁద వ్రాయఁబడెనేమో! దానిని జన కుఁడు చించివైచెనేమోయని తలఁచెను. జాబుకాక మఱియొక ముఖ్య పత్రమేమోయని యనుమాన పడెను. ఎట్లయిన దానిని విప్పి చూచి యుంపఁదగిన నుంచి, కానిచోఁ బాఱవైచుట మేలని యూహించి దా

నిని విప్పిచదువ నారంభించెను. మొదట నొకటిరెండుపదములు చదివినతోడనే యామె కమితాశ్చర్యము తోఁచెను. ప్రియా ! మాలతీ' యని యందు సంబోధింపఁబడియుండె. ఆమె యా పదముఁజూచి 'ఏమి? మాలతియా ? ఇది మా వెంకటపతి భార్యపేరు కాదా ? ఈమె మృతినొందినదని వాఁడు మొఱఁగూడఁ బట్టెనే ? ఇప్పుడిదెట్లువచ్చె ?' నని యనుకొనెను. వెంటనే "కాదు, కాదు, ఇది పాతగమ్మాయై యుండ నోపు. ఎప్పుడు వ్రాయఁ బడెనో చూచెద" నని మరల లేఖఁ దిలకించెను. అది కొలఁది దినంబులక్రిందటనే లిఖయింపఁ బడినట్లు స్పష్టముగాఁ జూపట్టెను. వ్రాఁతయూ వెంకటపతిదే యని యానవాలు పట్టెను. ఇప్పు డామెకుఁ గలిగిన యచ్చెరువునకు మేర లేదు. 'ఏమి ? ఆచిల్లంగి మాలతి యింకను జీవించియే యున్నదా ?' యని బిగ్గఱగా ననెను.

అత్తఱి గామేశ్వరమ్మ మరలవచ్చి నిలిచెను. అరవింద చేతిలోని జాబును జూచెను. తనగుట్టు బట్టబయలయ్యెనని గ్రహించెను. ఇఁక భయపడఁ బనిలేదని యనుకొని, కన్బొమలు ముడిచి దేవివంకఁ జూచుచు "నాజాబు నీవేల తీసితివమ్మా? తీసితివిపో, యేలచదివితివమ్మా?" యని యడిగెను. ఆ చుఱుచుఱు చూడ్కులు కరవింద మిగులఁగినిసెను. కాని కోపముఁ జూపుట యామె స్వభావమే కాదు.

అర.—నీజాబును జదువుటకు నాకేమి పని ? అది యేదో కాగితమని తెఱచి చూచితిని. అది యెవరికివ్రాయఁబడెనో, యెప్పుడు వ్రాయఁబడెనో యెఱిఁగితిని. నా కంతియే చాలు . నీ వెవరవో యిప్పుడు నాకుఁ దెలిసినది. ఇదె నీకమ్మ. నీవొక్క నిముషమైన నాయెదుట నిలువకుము. పొమ్ము.

మాలతి.—ఓ, అలాగుననే పోయెదను. విలువ యైననా కాలమంతయు నీవంటి మూర్ఖురాలియొద్దఁగడపి వృథపుచ్చితిని. ఇఁక నాకు నీతో నేమిపని యున్నది ?

తాను రాజ్ఞీపదమందున్న సంగతియైనఁ గమనింపక, యాకపట వేషధారిణి యగు మాలతి (ఇఁక మనము కామేశ్వరమ్మ యన నవసరము లేదు) నోటికివచ్చినట్లెల్ల వదరుచుండఁ జూచి యరవింద రోషావ్యాజాలక, ఎవరక్కడ? కనకలతా' యని యొకదాసినిఁ బిలిచెను.

మాల—నాకేకదా యిందఱు సేవకురాండ్రున్నారని నీవు విఱ్ఱవీఁగుచు వారలఁ బిలువ నక్కఱలేదు. అంత శ్రమనీకేల? నేనే పోయెదను. నా చిల్లరియుప్పులను దర్చుకొని నేఁడో తేపో యీయూరు విడిచి పోయెదను. నేనును నీవలె నాఁడుదాననే. నా మానమునకు భంగము రానిచ్చుట నీకుధర్మము కాదు. నేనీయూరు విడిచిపోవువఱకు నా రహస్యమును బయటఁబెట్టకుండవలెనని నాకోరిక. ఆవల నీయిష్టము.

అర—(కోపముతో) పొమ్ము, నీతోఁ బ్రత్యుత్తర మీయ నక్కఱలేదు, కనకలతా! ఈమెను సాగనంపుము,

మాల—సరియే, నీయిచ్చవచ్చినట్లు చేయుము, అంతెగోనాకుఁ బోవునది యేమియు ను లేదు, (అని పోఁబోవును.)

అర—(ఏదో తలఁపునకు రాఁగా) ఒక్క మాట, ఒక్కమాట విని మఱి పొమ్ము.

మాల—నాకిఁ దీరిక లేదు, చాల పనియున్నది. చెప్పఁదలఁచినది వెంటనే చెప్పు.

అర—ఆ ప్రభాకరునిగూర్చి నిజము చెప్పుము. వాని చావు మాట యసత్యమే కదా? అదియు నీ పన్నుఁగడలలో నొకటియే కదా? దయచేసి చెప్పుము. చెప్పినంతమాత్రమున నిన్ను శిక్షింతు నని తలఁపకుము. పశ్చాత్తాపపడి యిప్పుడైన నిజముఁ జెప్పితివ నంతసింతును. అంతియే. నీ పీగ్రామము వదలువఱకు సివిమయని

యొక్కయత్కురమైనఁ బరులతోఁ బలుకను. నిన్ను నలుగురినోళ్ళలోఁ బెట్టను. దయయుంచి చెప్పుము.

మాల—నేను జెప్పినకథ యంతయు సత్యము—అని తన సహజకపట స్వభావసూచకదృష్టులతోఁ జూచుచు నేఁగెను. అరవింద కీయాశయు వమ్మయ్యెను. ఆమె మరలఁ గుర్చీమీఁద వ్రాలెను.

---

## పదునెనిమిదవ ప్రకరణము.

### వివాహోదులు.

భూపతిరాజు సాంవత్సరికములు వచ్చినవి. నరసింహరాజు యథాశాస్త్రీయముగా నన్ని కర్మలును జరగించెను. పిమ్మటఁ బదు నెనిమిదినెలలు విశేషము లేవియు లేకుండ గతించినవి. సాంవత్సరికము లు ముగిసినతరువాత నరవింద తనరాజ్యములో నెన్నియోపాఠశాల లు, కర్మాలయములు, అనాథజనరక్షణమందిరములు నెలకొల్పినది. ప్రతిపర్వదినమందును బీదసాదుల కన్నవస్త్రాదులనిచ్చి యాదరించు చున్నది. మహమ్మదీయప్రభుత్వకాలమందు మూలఁబడిన స్త్రీవిద్యను బునరుద్ధారణముఁజేయ యత్నించుచున్నది. కొంతవఱకు సఫలీకృత మనోరథయైనది. అజ్ఞానతమస్సుచే నాక్రమింపఁబడిన మూఢవనితల ను దఱచుగాఁ దనకోటకు రావించి, సద్బుద్ధులు గఱపి, జ్ఞానజ్యోతిని బ్రసాదించుచున్నది. ఘనులగువైద్యులను రాజ్యమందుఁ దిరుగఁబనిచి, వారిచే బీదలగురోగుల కౌషధము లిప్పించుచున్నది. ఆమె యిట్లు జనులకు బహులోపకారము లొనర్చుచుండెను. ఆమె కీర్తిసౌరభము సర్వదేశసీమల వ్యాపించి యుండెను. యౌవనమందున్న రాజపుత్త్రి ప్రభువులెందఱో యామెకేలుపట్టి ధన్యులగుటకు జతనములు సలుపు చుండిరి. నరసింహరాజుతోఁ బరిచయము చేసికొనుచుండిరి. కొందఱు

నరసింహారాజును బ్రిత్యక్షముగాఁ గూఁతుపెండ్లివిషయమై పృచ్ఛ చేయుచుండిరి. అతఁ డేమికారణముననో యేరికిని సరియైనప్రత్యుత్తర మీయకుండెను. అతఁడు "కం॥ ఎప్పటి కెయ్యది ప్రస్తుత । మప్పటి కామాటలాడి యన్యుల మనముల్ । నొప్పింపక తానొవ్వక । తప్పించుక తిరుగువాఁడు ధన్యుఁడు సుమతి॥" అను వార్యవచనముఁ బాటించు వారలలో నొకఁడు. అతఁ డేరిమనసు నొప్పింపక, యరవింద వాంఛను జ్యేష్ఠభ్రాత యాజ్ఞను వ్యతిరేకముగాఁ జరిగింపక ప్రవర్తించుచుండెను.

భూపతిరాజు సాంవత్సరికముల కొకపర్యాయము, మఱుచటి సంవత్సరమున దశరాత్రిమహోత్సవమున కొకసారియును, నరసింహా రాజు తనపెద్దమఱఁదియగు నారాయణరాజును వానికూఁతులు రాగమ్మసుబ్బమ్మలను వాహ్వానము చేసెను. వారువచ్చిరి; కాని, వారి చర్య లెప్పటియటులే యున్నవి. అసూయ, అత్యాశ, అధికగర్వము మున్నగు వారిసహజదుర్గుణము లెప్పటివలెనే యున్నవి. దశరాత్రి మహోత్సవములకుఁ గాండ్రేకులప్రభ్వి యాహ్వానముమీఁద నెందఱో పృథివీశ్వరులు వచ్చిరి. వారిలో ననుకూలురగువారికిఁ దనకొమరితల నంటఁగట్టవలెనని నారాయణరాజు సర్వవిధములఁ బ్రయత్నించెను. వారెంతయందఁగత్తెలైనను సుగుణసంపత్తిలేనివారగుటచే, నారాయణ రాజుప్రయత్నములు వృథయయ్యెను. ఆనుందరాంగుల పెంకెతనపు మాటలు, నోరచూపులు, మొదలగుచేష్టల నరవిందచూచి యుఁక నెన్నఁడు వారలఁ బిలువఁగూడ దనుకొనెను. నరసింహారాజును సుత యభిప్రాయము నామోదించెను.

కృష్ణమరాజు రాజయక్ష్మరోగముచేఁ బీడతుఁడై, కామేశ్వరమ్మ మాలతియై కాండ్రేకులను విడిచినదినమందే విజయనగరములోఁ జని పోయెను. సురూపసుగుణసంపన్నలగు లక్ష్మీనరసమ్మరత్నమ్మలు తల్లి

దండ్రులు లేని బిడ్డలయిరి. కృష్ణమరాజుమరణవృత్తాంతము, కార్యాం
తరమునీఁద విజయనగరమున కేఁగిన కామేశ్వరరావునకుఁ దెలియఁ
గా, నతఁడు నరసింహరాజునకుఁ దెలియఁబఱిచెను. వెంటనే నరసింహ
రాజు మేనగోడండ్రికొఱకుఁ దగినపరివారమును బంపి పిలిపించెను.
అరవింద వారి నమితమైనప్రేమతో నాదరించుచుండెను. అప్పటినుం
డియు వారు కాండ్రేగులకోటలోనే యుండిపోయిరి. మునుపటివలెనే
వారు తమసహజసద్గుణములను వెల్లడించుచుఁ గాలక్షేపము చేయుచుం
డిరి. వారిలోఁ బెద్దయామె యరవింద యీఁడుదే. రెండవయామె రెం
డేండ్లుచిన్నది. దశరాత్ర్యుత్సవదినములలో నారాయణరాజు తనయుల
యుద్వాహములకై చేయుప్రయత్నములు సాగకపోయినను, కృష్ణమ
రాజు కుమారికలకయిన నవి లాభించినవి. కాండ్రేగులకు రెండామడల
దూరములో జగన్నాథగిరియను గ్రామముగలదు. ఆయూరిజాగీరు
దారునకు సీతాపతిరాజు, రఘునాథరాజు-అను నిద్దఱు పుత్త్రులు. వా
రిరువురును భిన్నోదరులు, స్ఫురద్రూపులు, విద్యావంతులు, గుణాఢ్యు
లు, ఐకమత్యమందు రామలక్ష్మణసమానులు. నరసింహరాజు వారికె
ట్లైనఁ దన రెండవచెలియలికూఁతులనిచ్చి వివాహము చేయవలెనని
బుద్ధిపుట్టెను. వారును గర్ణాకర్ణి నాకమలనయనలఁగూర్చి వినియుండుట
చే, నరసింహరాజుకోరిక నంగీకరించిరి. ఆదినములలోఁ బ్రధానము నాఁ
బడు పెండ్లికిఁ బూర్వమున జరగునుత్సవము నుత్సాహముతోఁ జేసిరి.
కొలఁదిదినములలో నొకశుభముహూర్తమున వారిరువురికిఁ గాండ్రే
గులకోటలోఁ బెండ్లిండ్లు జరగెను. ఆపరిణయములకు నారాయణ
రాజు పిలువఁబడియు నీర్ష్యచే రాకుండెను. అరవిందకుఁ దనకూఁతులపై
మాత్ర మంత ప్రేముడి యేలయుండరాదని యాతనికిఁ గోపముగా
నుండెను. ఆతనికోపమునకు నరసింహరాజుగాని, యరవిందగాని

లక్ష్యపెట్టరయిరి. విశేషించి గొప్పసారెలను బెట్టి యాతఁడి దంపతులు లేనిబిడ్డల నత్తవారియింటికి సాగనంపిరి. ఆమిథునద్వయము సీతారాములవలెఁ, బార్వతీ పరమేశ్వరులభంగి, రోహిణీసుధాకరులభాతి, నరుంధతీవసిష్ఠులకైవడి, వైభవములతో, విభూతులతో, ననురాగములతో, మైత్రులతోఁ గాఁపురములు చేయుచుండిరి.

కృష్ణమరాజుపుత్త్రికలు సుమారు పదునెనిమిది మాసములు కాండ్రేగులలో నుండిరి. వారున్నకాల మరవిందకు మిక్కిలివేడుకగాఁ గడచెను. దివసములు నిముసములవలె నామెకుఁ దోఁచెను. మనమందేచింతలనుండక మహావినోదముతో నామె మేనత్తకూఁతులవలనఁ గాలక్షేపము చేసినది. వారత్తవారియిండ్లకుఁ బోయినదాది, యరవిందకేమియుఁ దోఁచుటలేదు. దిన మొక్కయేఁడుగాఁ గడచుచుండెను. ఇప్పుడామెకుఁ బదునేనిమిదవయేఁడు. ఇఁక మూఁడునెలలకుఁ బందొమ్మిదవ సంవత్సరమామె చూచును. భూపతిరాజు వాంఛించిన ప్రకార మామెకు వివాహమాడుటకుఁ దగినప్రాయము రాఁబోవుచున్నది. ఇంతకాల మెందఱు మహారాజులు తన పాణిగ్రహించుటకుఁ బ్రయత్నించినను దటస్థభావముతో నామె యూరకుండుటకుఁ గారణము పెదతండ్రియాజ్ఞయే. అలనాఁడు కోటయావరణములోని పూఁదోఁటలో, నరవిందకు రతనాలపేటిక నిచ్చునమయాన, భూపతిరాజు 'నీకుఁ బదునెన్మిదేండ్లు నిండఁగానే దీనిని దెఱచి చూచుకొనుము' అని యరవిందతోఁ బలుకుట చదువరులకు జ్ఞప్తియందుండవచ్చును. మఱియు మరణశాసనమందు నరవింద పదునెన్మిదేండ్లప్రాయముపొందినఁ గాని వివాహమాడకుండుట తన కోరికయని భూపతిరాజు వ్రాసిన మాటలును జ్ఞాపకముండవచ్చును. వానినిదలఁచి పెదతండ్రిపనుపు పూర్ణముగాఁ జెల్లించుటకే యామెయింతకాలము వివాహమాడకుండ నున్నది. నరసింహరాజుకూడ మరణశాసనమందులిఖింపఁబడిన ప్రత్యే

తురమును గొనసాగఁజూచెదనని యన్నకు మాటయిచ్చియున్నాఁడు గావునఁ గోమాత్రి పెండ్లిమాట తలపెట్టలేను. అదియునుంగాక యరవిందకుఁ బ్రబోధ పలికిన పలుకులలో 'నిన్ను మొదటవలచిననాఁడే పెండ్లాడతాడమ్మా' యను వాక్యము సర్వదా జ్ఞప్తికి వచ్చుచునే యుండెను. ప్రభాకరుని మరణవార్త మాలతివలన వినియున్నదైన నామెకింక నావంక నాశ పోలేదు. ఆమెయొక్కతె కూర్చుండినప్పుడిట్లు తనలోఁ దాననుకొనుచుండెను. "బుద్ధిమాంద్యముచే నాకుఁగలిగిన వెంకటపతిమీఁదియనురాగము నాఁడే నశించినది. ఇప్పుడు నాకు వాని పేరుదలపెట్టుటయే రోఁతగానున్నది. పాపమా ప్రభాకరుఁడు నాపై నాఁడుచూపినయనురాగ మెన్నివిధముల మఱవఁదలఁచిన మఱపునకు రాకున్నది. అతనిహృదయ పారిశుద్ధ్యమును, ప్రేమపావిత్ర్యమును జక్కఁగా గమనింపకపోయితిని అతఁడు దూరమైనకొలఁది నామనస్సు వానిని సమీపించుచున్నది. అతఁడెక్కడనో యుండును. వచ్చునా రాఁడాయని యనుమానముతో మొదటనుంటిని, చాలకాలము జరగఁగా నికరాఁడనుకొంటిని, తరువాత మరణవార్తవింటిని; కాని యతనిఁగూర్చి కీఁడు శంకించినకొలఁదిఁ బ్రేమయధికమగుచున్నది. ఏదో నాహృదయమందుండి యతఁడింకను జీవించియేయున్నాఁడని చెప్పుచున్నది. ప్రబోధవాక్యములన్నియు నెఱవేఱె యిదిమాత్రము నెఱవేఱకుండునాయని తోఁచుచున్నది."

మఱియొకప్పుడు "ఏమి నావెఱ్ఱి! నాబుద్ధికి స్ఫురించినదెల్ల సత్యమనుకొనుచుంటినే! అతఁడు నిజముగా జీవించియే యుండునా ? చివర నేనడిగినపుడుసయితము మాలతి యతఁడు చనిపోయెనని యే చెప్పియున్నదిగదా ? ఆమెగుట్టులన్నియు నాకుఁదెలిసినపిమ్మట నింక నిట్టి యనృతములాడునా ? ఆమెకేమి పని ? అటులెన్నఁడు పలుకదు. అతఁడు మరణించియే యుండును. సోదెచెప్పువాండ్రవాక్యములు

ఘునాక్షరన్యాయముగాఁ గొన్ని సరిగానున్నను, నన్నియు నట్లుండు నా? వట్టిమాటలు. పోనిమ్ము. ఒకవేళ నతఁడు బ్రతికియేయుండె ననుకొన్నను, మరల నీప్రాంతమునకు వచ్చునా ? విద్యాబుద్ధులు గలవాఁడు గదా ! ఏరాజునొద్దనో గౌరవములఁ బడయుచునుండఁడా ! ప్రాంత చుట్టాలమగు మమ్ముఁజూడ నతనికిబుద్ధిపుట్టునా? పుట్టి నొకవేళవచ్చిన మాత్రముచేఁ బూర్వపుటనురక్తి నాపైఁ గలిగియుండునా? మఱియు నింతకాలము పెండ్లియాడకుండనుండునా ? పరిణయమాడకుండ నుండినను "సోదరప్రేమమాత్రమే నీయెడవహించి యుంటి" నని నేను బలికినమాటలు మఱచి నన్నుఁజేకొనునా ? అంతయుఁగల్ల. అయ్యో ! అతనిపోకకు నేనే కారణంబరు. అతని యిడుమలకు నేనే హేతువను. నేనతనియెడల గొప్పయపరాధ మొనర్చితిని. ఇప్పుడెంత పశ్చాత్తాపపడిన లాభమేమిగలదు? నాయనుతాపమును దెలిపి క్షమింపవేఁడుకొందమన్నను, నాతఁడు జీవించియైన నుండెనా ? లేదాయె. ఏమిసేయుదును? ఓభగవంతుఁడా! ఆర్తత్రాణ పరాయణా ! నేనాఘనునియెడ నపచారమొనర్చితిని. పాపాత్మురాలను. ఎటులయిన నాయపరాధమాతనికడ వెలిబుచ్చి క్షమాపణము వేఁడుటకును, నా సర్వస్వమాతని కర్పించి యతని ఋణముఁదీర్చుకొనఁగలుగుటకును, నాకేదైనఁ దెరువుఁజూపుము. నేననుకొనినరీతి నామాలతిమాట లసత్యములౌఁగాక. అతఁడు మరల నాకుఁ గన్పట్టుఁగాక. ఎఱుకతపలుకులు సత్యములగునుగాక. నేను ధన్యజీవినిఁగ నగుదునుగాక" యనుకొనెను.

మాలతి వెడలిపోయినతరువాత నరసింహారాజు కూఁతుతో సంభాషించుతఱి బ్రభాకరునిప్రశంసరాఁగా నతఁడిట్లనెను, „అమ్మా! ఆమాలతి మోసముచేయఁ గలిగినంత కాలము నిన్ను మోసముచేసినది, పిమ్మట నామెరహస్యము బైట బడియెను. ఇఁకనిన్ను మోసముచేయ వలసిన యవసరమామెకు లేదు. ప్రభాకరుని మరణవృత్తాంతమే యు

సత్యమైనయెడల, నామె కొంకక యీయూరిని విడుచునప్పుడైన నీ తోఁ జెప్పియుండును. మొట్టమొదట నసృతముపలికినను, దర్వాత నిజమువచించియుండును. ఆవిషయమై యామెవారు)చ్చినదే సత్యము. ప్రభాకరుఁ డీలోకమును విడిచి చనెను. ఏమియు సందేహము లేదు. వానిని మరల మనము చూడము.

తండ్రిపలికిన యీ పలుకులు జ్ఞప్తికివచ్చినపుడును, మాలతి మాటలు తలఁపునకువచ్చినపుడును, అరవింద ప్రభాకరునిపై నాస విడుచుకొనును. తనయంతరాత్మవచనము లాలకించునపుడును, బ్రబోధ వాక్యములు స్మృతికిఁ బాఱినపుడును, దప్పక వాఁడుజీవించియే యున్నాఁడని ధైర్యముఁ జెందును. కాని యెటునిశ్చయించుటకును దగినబుద్ధిబల మామెకు లేకుండెను. గడియగడియ కామెకు భూపతిరాజిచ్చిన పెట్టె మీఁదకు మది పోవుచుండెను. అష్టాదశవత్సరములు నిండినఁగాని దానిని దెఱవకుండుమని యీమహాపురుషుఁ డామె కాజ్ఞాపించియున్నాఁడు. అందులోఁ బ్రభాకరునిగూర్చి కొంచెమైనయుండకపోదని యామెయాశ. ప్రతిదినమును దానిలో నేమున్నదో చూడవలెననుతలఁపుతో నామె తనయగారములోనికిఁ బోవుచుండును. కాని,యప్పుడు పెదతండ్రి ప్రతిమ యెదుటనిలిచి తల్లీ! చాపల్యమును జయింపుమీ?” యనిగద్దించుచున్నట్లు కాన్పింప వెనుకకు మరలుచుండును. ఎప్పుడు పదొవ్మిదవయేఁడు వచ్చును, ఎప్పుడా వింతపెట్టెలోని వింతలను దిలకింపనగునని యామె నిరీక్షించుచుండెను.

ముయ్యాఱెండ్లున్నఁడు నిండునాయని యామె యెదురుచూచుచుండ నొకనాఁటియుదయమున నొకభటుఁడు విశాఖపురినుండి భోగరాజు కామేశ్వరరావునొద్దనుండి యొక లేఖ పట్టుకవచ్చెను. అరవిందకు స్వయముగా రాజ్యపాలనముఁ జేయు ప్రాయమొక నెలలో రాఁబోవుచున్నదనియు, నీలోపున భూపతిరాజుగారి యభీష్టితములు కొన్ని నెఱవే

ర్పవలసియున్నవనియు, రాజ్యములోఁగొన్ని క్రొత్తమార్పులు చేయ వలసియున్నవనియుఁ, బైనిఁబేర్కొనఁబడిన యంశములఁ గూర్చి నర సింహరాజుగారితోఁ దాను సావకాశముగా భాషింపవలసియున్నదని యుఁ బ్రకృతము తనకితర రాజకార్యములతొందరచేఁ గొన్నిదినముల రా వలనుపడదనియు, నరసింహరాజుగారే శ్రమయనుకొనక యొకపర్యా యము విశాఖపురమునకు వచ్చుటలెస్సయనియు వ్రాసెను. నరసింహ రాజునకుఁ జందృమపాలెమును విడిచిపెట్టినదిమొదలు శరీరములో న స్వస్థతగానుండెను. అతఁడు పల్లియలోనున్నంతకాలము మంచిపాటు, మేలైనగాలి, శుద్ధమైననీరు పొందియుండెడివాఁడు గావున, దార్ఢ్యము తోనుండెను. పిమ్మటఁ దనస్థితిగతులకుఁ దగినవైభవము ననుభవించు చుండి దేహపరిశ్రమల మానినవాఁడగుటచే రుగ్ణత యాతని నావ హించెను. ఇప్పుడు స్థూలకాయుఁడై యుండెను. ఊపిరితిత్తులు మును పటియంతటి దృఢస్థితిలో లేవు. కావున నతఁడు సముద్రపుటొడ్డుననుం డుపట్టణములలోనుండి యారామథ సేవ చేయవలెనని యూహించుచుండె ను. విశాఖపురి సముద్రపుఁదీరపట్టణములలో నొకటి. 'ఏకక్రియాద్వ్యర్థకరీ' యన్నట్లు విశాఖపురమేఁగినఁ గామేశ్వరరాయనితో మాటాడి రాచకర్జములఁ జక్కఁబెట్టుకొనవచ్చును, సందృపుగాలి ననుభవించుచు రోగచికిత్సయుఁగావించుకొనవచ్చునని యతఁడు తలఁచి ప్రయాణసన్నా హాముం జేయమొదలుపెట్టెను. మఱియుఁ గామేశ్వరరావు జేవికూడ జనకునితో రాఁదలఁచిన రాజనివాసయోగ్యంబై సమస్తవస్తుసవాసం యుతంబై సకలసౌఖ్యాలవాలంబయిన మందిరమొకటి సిద్ధముచేసి యుం చెదననియు వ్రాయుటచే, నరవిందకూడ తండ్రితోఁ బయనమయ్యెను. వారిరువు రచిరకాలములోనే రాజ్యభారమెల్ల సమర్థుఁడగు పూర్ణ య్యామాత్యునిమీఁదఁ బెట్టి, సముచితపరివారముతో బయలు వెడలిరి. విశాఖపురమందలి యారాడకొండమీఁద సుందరమందిరమొకడు

గలదు. దానినే దేవేరికి విడిదియగాఁ గామేశ్వరరా వేర్పాటుచేసెను. ఆ రమ్యభవనమందు వారు విడిసిరి. కామేశ్వరరాయనిభార్య సుందరమ్మ దేవేరికి స్వాగతమిచ్చి సర్వవిధముల నాదరించినది. నరసింహారాజున కొకయాంగ్లేయరోగచికిత్సశాస్త్రి వైద్యముఁజేయఁ బూనుకొనెను. రాజ్యాంగవిషయములలో నాచరణీయకార్యములఁగావింపఁ గామేశ్వర రావు గడంగెను.

వెంకటపతి యెంతచెడ్డవాఁడైన వానిపైఁ బ్రేమానుబంధము మాత్ర మింకను నరసింహారాజునకు దృఢముగాఁ గలదు. అతడు పట్ట ణముఁ జేరినతోడనే కామేశ్వరరాయని మేనల్లుని క్షేమోదంతమును గూర్చియే ప్రశ్నించెను. వారిట్లు మాటాడిరి.

నర—అయ్యా! మీరు మా మేనల్లుని యుంపుడుగత్తెనుగూర్చి యేమైన నీనడుమ వినియుంటిరా ?

కామే—అవును. వినియున్నాను. ఆమె మాఱుపేరితో దేవికడ నుండెనఁటకాదా ? అంతయు వింటిని. ఆమె మరణము నిశ్చయమని నేనుసయితము నమ్మితిని. ఎంతమోసము! ఎంతమాయదారితనము ?

నర—మావాఁ డెక్కడనున్నాఁడు ? ఏమి చేయుచున్నాఁడు ?

కామే—అతఁడు చెఱసాలనుండి విడుదలనొంది వచ్చినపిమ్మట నేమయ్యెనో తెలియలేదు. విన్న మీపేర వ్రాయకుందునా ?

నర—వాఁడు కారాగృహవాస మెట్లుసహింపఁగలిగెను?

కామే—నాజాబువలనఁ దమ కంతయు విశదమైయుండును. మొదటినుండియు సుగుణవర్మయనునతఁడే యతనిఁ గంటికిఱెప్పవలెఁ గాపాడె. శిక్షవిధించుటకుఁబూర్వము రెండునెలలవఱకు తనిని విశాఖ పురియందే యుంచిరి. ఆదినములలో సుగుణవర్మయే యతనికి సదు పాయమైన భోజనమును బంపుచు నవమానముఁబొందనీయక పరిరక్షిం

చెను. శిక్షవిధించినతరువాత మీ యల్లునియొద్దనుండి యాపదివేలరూపాయలును దొరతనమువారు పుచ్చుకొనిరి. అప్పుడు—

నర—అప్పుడుకూడ నా సుగుణవర్మయే కాచెనా ?

కామే—అప్పుడాతనికి సుగుణవర్మ పూటకాఁపుగానుండ యత్నించెను; గాని, యట్టిపనినాతఁడు చేయుటకు నేను సమ్మతింపనైతి. ప్రకృత మా సుగుణవర్మ వ్యవహారములన్నియు నేనే చూచుచుంటిని. నాయందతనికి భక్తి మెండు. కావున నామాట కెదురాడనోడి యూరకుండెను.

నర—అనంతర మేమి జరగినది ?

కామే—సుగుణవర్మ ప్రోత్సాహముమీఁద సాలూరుప్రభువే వానిపై నించుక దయఁ జూపుఁడని న్యాయాధికారులను గోరుటచేత వానికి మఱియొకమాసము మాత్రమే శిక్ష విధించిరి. ఆ నెలదినములును వానిని విజయనగరములోనుంచిరి.

నర—వానికి బంధవిముక్తి యైనపిదప జీవనోపాధి యెట్లు కలిగెను ?

కామే—వెంకటపతి పూర్వపుఖ్యాతికి లోపము రాకుండ జీవించుటకు సుగుణవర్మయే తనధనమునుండి వేయిరూపాయలను వానికిచ్చెను. నేనే యాపత్త్రమును మీ మేనల్లుని హస్తములలోఁ బెట్టితిని.

నర—ఆహా ! ఏమి యామహాత్ముని యౌదార్యము! ఏమి వాని సుగుణసంపత్తి ! అట్టివానినే మానిర్భాగ్యుఁడు మోసముచేయఁ జూచెనుగా! ఆమాలతినిగుఱించి యింకేమైనఁ దెలిసెనా?

కామే—ఆమె కాండ్రేగులనువిడిచి విశాఖపురికివచ్చి, భర్తతో మాటాడుటకుఁ బలుమారు చెఱసాలకడకుఁ బోయినదఁట. కాని కావలివాండ్రు సంభాషించుటకామెకవకాశ మీయకుండిరఁట. బంధవిమోచనమై యతఁడువచ్చుచుండ, రాజమార్గమందొక యింటియం

గిట నామెనిలిచి యతనికొఱకెదురు చూచుచున్నది. నేనును సుగుణ వర్మపనుపున వేయిరూకలను బట్టుకొని యామెనిలిచిన గృహమున కావలియింటికడనే వానికై నిరీక్షించుచుంటిని. అతఁడు దూరమున నుండియే నన్నుఁజూచి నాసమీపమునకు వచ్చెను. నేనావిత్తము వాని కిచ్చి నాకుఁదోఁచిన సదుపదేశము జేసితిని. అతఁడంతయు శ్రద్ధతో నాలకించి యట్లాచరించెదనని వాగ్దానముచేసియు వెంటనే ప్రియురాలితో వేడుకనుకులాడుచు నెచ్చటికోపోయెను. నాఁటినుండియు వారే మైరో నేనెఱుఁగను. మరలనాదంపతులు నాకంటఁబడలేదు.

నర.—ఆప్రకాశరాయ రామచంద్రాదులనుగూర్చి మీరు కమ్మలో నేదియో వ్రాసితిరి. అది నాకంత బాగుగా బోధపడలేదు. వారేమైరి?

కామే.—వారిద్దఱను నురిదీయుటకు న్యాయాధికారి యాజ్ఞాపించి యున్నాఁడు. కాని, యది జరగలేదు. వారినిఁగూర్చి పునర్విమర్శనము చేయఁబడెను. అందుఁగూడ సుగుణవర్మ సాయముచేసి వారికిఁ బ్రాణభంగము కలుగకుండఁగాపాడెను. ఇప్పుడు ద్వీపాంతరవాసశిక్ష ననుభవించుచుండిరి. వారిమీఁద రెండువ్యాజ్యెములు తేఁబడెను. రామదేవవర్మగారను ఘనునిచేఁ దేఁబడినదొకటి. వాండ్రు వర్మగారిని దీవ్రఘాతములచే నొప్పించిరి. సుగుణవర్మయే యాఘనునిఁ బరిరక్షించెను. వారు పాఱిపోవునప్పుడు "ప్ర॥ రా" యనువిడియక్కఱములుగల యుపవసనమొకటి తొందరలో జాఱవిడిచిరి. దానిని దుష్టజన పరిశోధక సభవారి కీయఁగా వారు తమనైపుణ్యముచేఁ బ్రకాశరాయ రామచంద్రులే యాదొంగలని మూరుమూలలనుబట్టి కనుఁగొనిరి. మఱియుఁ బ్రాణములు విడుచుచున్న రామదేవవర్మ తన్నుఁ గొట్టినవారిని సరిగాఁబోల్పలేకపోయినను, గంతధ్వనినిమాత్రి మూనవాలుపట్టెను. మరణసమయ

మున నాతఁడిచ్చిన సాక్ష్యమే యాచోరులకు మరణమాపాదింపఁ గల్గు నదయ్యె. రెండవయభియోగ మానందరావుగారిచేఁ దీసికొనిరాఁబడి నది. ఆయన సింహాచలమునకుఁ బోవుదారిలోఁ దన్నుఁ గొట్టినవారు వారలేయని నిశ్శంకముగాఁ జెప్పఁగలిగెను. సుగుణవర్మకూడ వాచో రాగ్రేసరులనుండియే వారిని గాపాడితినని సాక్ష్యమిచ్చెను. అందువలన వారలకు మరణదండనము విధింపవలెనని దత్తాత్రేయశాస్త్రిగారునిశ్చ యించుకొనిరి. కాని సుగుణవర్మ ప్రేరేపణమువలన నానందరావుగారు సాలూరురాజుగారును వారిపైఁ గరుణఁ జూపవలసినదని శాస్త్రితోఁ జెప్పుటచేత, వారికిఁ జావుతప్పినది. ప్రవాసశిక్ష మాత్రము విధింపఁ బడినది. వారి నిజమైనపేరులు రాముఁడు భీముఁడునువా రాజీకేరినవొం గలు. సుగుణవర్మకు మితిమీఱినదయ యున్నదిసుమీ.

నర — మీవలన నాసుగుణవర్మ సుగుణసంచయమును గూర్చి మిక్కిలిగా వింటిని. ఆతనిజూడవలెనని నామనంబుత్సహించు చున్నది. నామేనల్లు నంతయనుకంపతో వీక్షించినందుల కాతనికి నాకృతజ్ఞత ను జూపవలసియున్నది. వెంకటపతి చిక్కులలోనున్నప్పుడు —

కామే — తమరుకొంతసొమ్ము పంపెదమని నాపేర వ్రాసితిరి. కాని యట్లుచేయుట నాకిష్టము లేమి, నేనువదలదని మీకు జాబు వ్రా సితిని. ఆసుగుణవర్మను జూడఁగోరితిరి కాదా? అతఁడిప్పు డీపట్టణమున లేఁడు. రెండుసంవత్సరములనుండి విదేశములందుఁ దిరుగుచున్నవాఁడు. ప్రతిముఖ్యపట్టణమునకేఁగి యచ్చటిరాజకీయ సాంఘికాద్యాచార ములు పుణ్యక్షేత్రమాహాత్మ్యములు మున్నగునవి యెఱిఁగిరమ్మని నేను బంపితిని. అతఁడిప్పుడు పెద్దాపురముచేరి యున్నాఁడట. పదిదినము లలో నిచ్చటికి మరల రాఁగలఁడు. వచ్చినవెంటనే మాబసకే యతఁడు మొదటవచ్చును. అప్పుడు తమరాతనిఁజూడవచ్చును. అతనికి నానంద

రావుగారును, నేనును, బరమాప్తులము. ఆనందరావుగారికి సుందరాంగి యగునొక కొమరితెగలదు. ఆయనకెట్టులైనఁ దనకూఁతును వానికీయ వలెనని యభిలాషముండెను. దాన నాయన కాతనిపై మిక్కిలిప్రేమ.

నర—అట్లయిన మనమామహాపురుషుని వివాహమహోత్సవము చూచు భాగ్యముకూడ నబ్బునా?

కామే—కలుగవచ్చును. అరవిందాదేవి యాపెండ్లికూఁతును జూడలేక కాఁబోలు. చూపించెదను. కాని,యింక నావిషయంముగూర్చి తమరేమియు దేవితోఁజెప్పవలదు, ఆవర్ణనుగుఱించి మీతోఁజెప్పని విశేషాంశములు నాకు దెలియును. అతఁడు మరలివచ్చినఁగాని వాని నెఱుకపఱుపను.

ఇచ్చట వారిసంభాషణము ముగిసెను. కామేశ్వరరావు తననెల వుకేఁగెను. నరసింహారాజుతాను విన్నవిషయములన్నియుఁ గొమార్తె తోఁజెప్పెను. కడపటిమాట మాత్రము, అనఁగానానందరావుకూఁతు పెండ్లి మాటమాత్రము, తెలుపకుండెను. పదిదినములుగడచెను. ఈ లోపున నాంగ్లేయవైద్యశిఖామణి యొకఁడు రావింపఁబడెను. ఆతఁడు నరసింహారాజు దేహమంతయుఁ బరీక్షించి మందులిచ్చుచుండెను, క్రమముగా శరీరము స్వస్థపడుననియుఁ జెప్పెను. కామేశ్వరరావు నరసింహారాజున కాయూరనున్న వింతలన్నియుఁ జూపి యానందముం గూర్చెను.

---

## పందొమ్మిదవ ప్రకరణము.



విందు.

పదిదినంబులు గతించెను. ఒకనాఁటియుదయమునఁ గామేశ్వర రావు తనభార్య సుందరమ్మతో సంభాషించుచుఁ దనగృహామందొక గదిలోఁగూర్చుండియుండెను. అప్పుడొక సేవకుఁ డొకకమ్మఁ దెచ్చి యా తనికిచ్చెను. దానినిజదివికొని భటుని బంపివైచి యతఁడు భార్యతో "సుందరీ! సుగుణవర్మవచ్చెనఁట. ఆనందరావుగారే యీజాబును వ్రాసి పంపిరి ఈరాత్రియతఁడు మనయింటికివచ్చునఁట. మనమున్నేహితుల లో ముఖ్యులనుబిలిచి విందుచేసెదమా?" యనెను. కామేశ్వరరావు కేవలపూర్వాచార పరాయణుఁడుగాఁడు, తగినంత కారణమున్నదని తెలిసినఁగాని యాయాచారమును గమనించువాఁడు కాఁడు. భర్త భా ర్యను బేరితోఁ బిలువరాదందురు. "శ్లో॥ ఆత్మానామ గురోర్నామ నామాతికృపణస్యచ। శ్రేయస్కామో నగృహ్ణీ యాజ్జేష్ఠాపత్య కళత్రి యోః॥" ఇత్యాద్యార్యవచనము లంతగాఁ బాటింపకుండెను. కావుననే గృహిణిని 'ఔనే, ఓసి, ఆఁ, ఇదిగో' మున్నగు సంకేతశబ్దములఁ బ్రి యోగించి పిలువక యామెపేరితోనే పిలిచెను.

సుంద—ఆలాగుననే చేసెదము. ఎవరెవరిని బిలిచెదరు?

కామే—ఆనందరావుగారి కుటుంబమును బిలువవలెనుగదా? మఱియు నరవిందాదేవియు నామెతండ్రియు నిచ్చటనే యున్నారు గా వున వారినిగూడఁ బిలువవలయును. ఇంకను క్షత్రియులలో మనకా ప్తులు సాలూరురాజుగారు. వారు నేఁడే సాలూరునుండి వచ్చిరి. వారిని గూడ నాహ్వానము చేసెదము.

సుంద — అందులను క్షత్రియులే యగుటచేతఁ గావలసిన యేర్పాటులు మనము సులభముగాఁ జేయవచ్చును. సాలూరురాజుగారి నడుమ సాలూరులో నేయుండుచున్నారని మీరు చెప్పితిరే. వారు నేఁడేల వచ్చిరి?

కామే — వారు నాకొకపని నాజ్ఞాపించి యున్నారు. అందుఁ గూర్చివారితో మాటలాడవలసియున్నది. కావున, వారిని దత్క్షణమే బయలుదేఁజేరమ్మని నేను జాబు వ్రాసితిని. నాకోరిక ప్రకారము వారు వచ్చిరి.

సుంద — వారుమీకు నియమించినపని యేదియో నాతోఁ జెప్పవచ్చునా?

కామే — అది యంతరహస్యమైనపని కాదు. కాని, కొంతకాలమువఱకు గుహ్యముగామాత్రము ముంపవలసియున్నది. (చిఱునవ్వుతో) ఎట్టిరహస్యమైన నీకడదాఁచఁగలనా? చెప్పెదను వినుము. ఒకనాఁడు సాలూరురాజుతోఁ బ్రసంగవశమున శంకరయ్యయను బ్రాహ్మణుని పేరుపలికితిని. అతఁడప్పులచే విసివి గృహస్థాశ్రమమువిడిచి సన్న్యాసాశ్రమమును స్వీకరించుటయు, నట్లయినను వానికి ఋణబాధతగ్గకుంటయుఁ జెప్పితిని. ఆసన్న్యాసికొఱకే రాజుగారు వెదకించు చుండిరఁట. నన్ను వాకబు చేయుమని కోరిరి.

సుంద — ఎందులకో మీకుఁ దెలిసినా?

కామే — (మందహాసముతో) ఆఁడువాండ్రు కన్నిసంగతులును దెలుపవలసిన పనిలేదు.

సుంద — పురుషులొనర్చు పనులకన్నిటి కాఁడువాండ్రు తగక పోవచ్చును. కాని వానినిగూర్చి వినుటకైన వారు నోఁచలేదా? స్త్రీలకు స్వాతంత్ర్యమిత్తుమనిపలుకు మీవంటిసంఘసంస్కారప్రియులు, సమయమువచ్చినప్పుడిటులే వెనుకఁ దీయుదురు కాఁబోలు.

కామే—సుందరీ! కోపపడకు. ఏమందునో యూతమని యూర కంటిని. నీనుండిదాఁచునది నాహృదయమునో నొక్కటియు నుండదని నమ్ముము. సాలూరురాజుగారి భార్యవిషయమై నిహాస్యములు కొన్నియాతనికిఁ దెలియునఁట. అతనికొఱకెంతగా వెదకినఁ గానరాకుండెనఁట. నేనుగూడ నన్వేషింపఁగా నతఁడు కటకపురములోని చెఱయందు బంధింపఁబడి యుండినటులఁ దెలియవచ్చెను. జెఱఁను వృద్ధుఁడై యుంటచే నానాఁటికిఁ గృశించుచున్నాఁడనియు, నప్పిచ్చిన వానించు కంతియు వానిపైఁ గరుణఁబూనకుండిగనియుఁ దెలిసెను నాకానమాచారములు తెలిసినవెంటనే తేనిసి రమ్మని వర్తమానంపితిని. అతఁడు నాజాబందినవేగమే బయలుదేఱివచ్చెను. అంతయు నెఱుఁగఁ జేసితిని గావున, నిఁక నీమనస్సు స్వస్థపడినదా?

సుంద—ఆ. పడినది. పాపము చాలఁ గష్టపడితిరి. పెందలకడ భోజనముఁ జేయుఁడు. వంటయైనదేమో కనుఁగొనివచ్చెదను—అని లోపలికిఁ బోయెను. కామేశ్వరరావు దుస్తులను ధరించి నరసింహరాజాదుల నాహ్వానము చేయుటకు వెడలెను.

కామేశ్వరరావు కోరికప్రకారముసాయంకాలమున కేయానందరావు, జగన్నాథవర్మ, నరసింహరాజు మున్నగు పురుషపుంగవులును, అరవింద,మోహినీబాయి మొదలగు స్త్రీరత్నములును, విందునకు విజయముచేసిరి. అరవింద చదువరులకు మొదటఁ బ్రదర్శింపఁబడిన ప్పుడు పదునాలుగేండ్లవయస్సుగలది. ఇప్పుడామెకుఁ బదునెన్మిదేండ్లు నిండినవి. ఈనాలుగేండ్లలో నామెరూపము మిగుల మార్పొందినది మునుపామెనాగరికత నంతగా నెఱుఁగదు. ఇప్పుడో యొందఱినో రాణులనుజూచి వారియాచారాదులను గ్రహించియున్నది. వెనుక మీరు చూచినప్పుడామె యించుకపలుచనై యణుమాత్రము వయసునకు మించినపొడవుగలదై యున్నది. ఇప్పుడించుక పుష్టిగనుండి యొంతెంత

యందముగాఁ గాన్పించుచున్నది. ఇప్పుడామెకట్టిన పుట్టములయందు మార్పేమియును లేదు. కాని వానికొక వింతసొగసువచ్చినది. కట్టిన బట్టలు, పెట్టినసగలు నామెకందముఁదెచ్చెననుటకంటె, వానగలకే యామెసహజలావణ్యమువలన సౌందర్యమువచ్చెనని చెప్పుటలోనతిశయోక్తియుండదు. రాజీపదమున కర్హమైన నడక యామెకుఁ దనంతఁదానే యబ్బినది. వ్యవసాయబారుని కూఁతురు, అనాగరికురాలు, ఘనసంఘములోఁ దిరుగనిది, యని నారాయణకృష్ణమరాజుసుత లిప్పుడు గరువంపుఁబల్కులఁ బలుకనవకాశము లేదు. ఆమె సౌందర్యనిశ్రేణియందుఁ గడపటిసోపానమును దాఁటినదని చెప్పవచ్చును. అతిథులెల్లరు వచ్చిరి. గృహమేధికూఁతురు మింకను రాలేదు. ఎవ్వనిరాకకై యీయాతిథ్య మీయఁబడుచుండెనో యాసుగుణవర్మయింకను రాలేదు.

ఆనం—(సాలూరురాజుతో) రాజా! సుగుణవర్మ నేఁడు వచ్చెను. మీబసకు వచ్చినాఁడా?

జగ—వచ్చినారు. అదృష్టవశమున నేనీయూర నుండుట తటస్థించినది. నేఁటి ప్రాతఃకాలముననే నేను సాలూరునుండి వచ్చితిని సుగుణవర్మగారిని జూచినతోడనే నాకమితానంద మొదవెను. మీకు నటులే కలిగెనాయని నేనడుగనక్కఱలేదు. కుమారునిఁగా వానిని దలఁచుచున్నప్పుడు మీకు మోద ముప్పతిల్లకపోవునా?

ఆనం—దూరదేశములకేఁగి మరలవచ్చికాన్పించిన పుత్రరత్నమును గాంచినటులే నాకుఁ దోఁచెను. వాని సుగుణచయమే యిట్టి భావము కల్పించినది.

జగ—(తనకుర్చీ నొకకిటికీదగ్గఱకు లాగుకొని రహస్యముగా) మిత్రుఁడా! నీతో రెండేండ్లక్రింద నావిషయమై నొకకథఁ జెప్పితిని. జ్ఞాపకమున్నదా? అప్పుడు చిదానందయోగి యను నొకసన్యాసి

కొన్నిరహస్యములు నాభార్యనుగుఱించి యెఱుంగుననియు వానికొఱకు వెదకించుచుంటిననియుఁ జెప్పితినిగాదా?

ఆనం—అంతయు జ్ఞప్తియందున్నది. అందొక్కయంశమైన మఱచిపోలేదు.

జగ—ఇన్నాళ్ళకిప్పుఁడాతఁడు కనఁబడెను. కామేశ్వరరావుగారితో వారముదినములక్రింద నొకవిషయముంగూర్చి సంభాషించుచుండఁ బ్రసంగసందర్భమున నతఁడొకధనవంతున కొకబ్రాహ్మణుఁడీయవలసినధన మీయకపోవుటయు, వానికొఱకెంతగా నన్వేషించినఁ గనఁబడకపోవుటయుఁ, దుద కొకసన్న్యాసిరూపమున నాతఁడు కటకపురమందుఁ గాన్పించుటయు నాతోఁ జెప్పెను. నేనుగూడ నామనుష్యుని కొఱకే గవేషించుచుంటి నంటిని. అతఁడు తనయావచ్ఛక్తిని వినియోగపఱిచి వానినిగనుంగొన యత్నింతుననియుఁ జెప్పి యట్లుచేసెను. నాభాగ్యవశమున నతఁడు దొరకినాఁడు. అతనిపేరు శంకరయ్యయఁట.

ఆనం—ఏమి! ఇన్నినాళ్ళ కాతఁడుచిక్కెనా? కటకపురిలో నేల యున్నాఁడు?

జగ—ఆధనవంతుఁడాతని నచ్చటఁబట్టుకొని చెఱసాలలో నుంపించెనఁట. ఇదియంతయుఁ గామేశ్వరరావుగారు విన్ననే నొకకమ్మయందు వ్రాసి నాకుఁ దెలియఁబఱిచిరి. నేను దత్క్షణమే బయలుదేఱివచ్చితిని. నెయ్యుఁడా! నేనొక్కవరుగున గటకపురికిఁబోయి యుందును. ఆత్రమంతయధికముగాఁ దోఁచెను. కాని కామేశ్వరరావుగారు వలదనియొత్తియొత్తి వ్రాసిరి. ఆసన్న్యాసితనదురవస్థచే మతిపోయి రోగపీడితుఁడై, చావునెదురుచూచుచున్నాఁడనియు, నావంటి మూర్ధాభిషిక్తులట్టివానిని జూడరాదనియు నతఁడువ్రాసెను. అతనియుపదేశ ము

నుసరించితిని. ఆవల నేనేల వానిఁ గనఁగోరితినో చెప్పితిని. అసఁగాఁ బూర్వము నీతోఁజెప్పిన నాకథయంతయు మనస్నేహితునితోఁగూడఁ జెప్పితిని. నేఁటి రాత్రి యాతాపసినిఁ జూడఁగలననుకొందును. ఇప్పుడు కామేశ్వరరావుగారు నాపనినిమిత్తమే యావలకేఁగినారు. ఎప్పుడు వత్తురు, శ్రవణపర్వమైనమాట యెప్పుడు వచింతురని సంభ్రమము తో నిరీక్షించుచున్నాను. నేనిచ్చటికి వచ్చితిననుటయే కాని, మనసంతయు నాసన్న్యాసియందే యున్నది. సార్థకనామధేయుఁడగు సుగుణ వర్మతో విందుఁగుడుచుసమయము తప్పునని యు, మిత్త్రుఁడగు కామేశ్వర రావు హృదయమం దన్యథా యూహించునని యుఁ దలఁచి వచ్చితిని గాని, లేనిచో రాకయుందును.

ఈసమయమున సుగుణవర్మ వచ్చెను. అందఱును బ్రీతితో నత నికి స్వాగతమిచ్చిరి. ఆనందరావు 'నాయనా! వచ్చితివా? ఆలస్యముచే సితివేమి?' యని సహజమైనవాత్సల్యముతోఁ బలుకరించెను. సుగుణ వర్మకిప్పు డిరువదిమూఁడేండ్ల వయసుండెను. అతనిరూపలేఖవిలాసాదుల నిదివఱకే వర్ణించియున్నాము. వాని వస్త్రధారణము, చిత్రభాషణముఁ జూచిన, నతఁడు ఘనులలోఁదిపగువాఁడని యెల్లవారును దలఁచినిరి. అతఁడు కొంచెముసేపచ్చట వారితో మాటాడి లోనికిఁ జనెను. సుందరీమోహినీబాయిగారు లతనిని దూరానఁజూచి యెదుర్కొఁగూర్చి రముసఁ గుశలమడిగి లోపలికిఁ దీసికొనివెళ్ళిరి. అరవింద యంతమోద వాతుజాలమునుండిచూచెను. ఆమెకొక విధమైన భ్రాంతిపలన్నదో అతనిసుగుణాదులఁగూర్చి తండ్రివలనఁ జాలవినియున్నది. [illegible] నా ను జూచియుండలేదు. నేఁడే యాతనిని బ్రథమముగా [illegible] వందనీ సేపు నిర్వ్యాజపాటుతో వానివంకఁజూచి 'కాదు' లేకపోయెను. అతనిస్వా దానముకొనినది.

[illegible] సింహాసాజు రెండుచేతు లం డెను.

నితనికా మెయుఁ గాన్పించుచుండిరి, భోజనము సలుపునంత సేపును, నర
వింద మధ్యమధ్యమున సుగుణవర్మవంక జూచుచునే యుండెను. ఏది
యో [illegible] కివచ్చి కలఁతపడుచునే యుండెను. సుగుణవర్మ [illegible]
స్థలోనే యున్నట్లు కాన్పించెను. కాని యాభయముగా [illegible] నుండి వారల
వీక్షించికొనలేను. అతఁడు చూచినప్పుడామె [illegible] యామె చూచినప్పుడా
తఁడును, మోమును వంచికొనుచుండిరి. [illegible] కామేశ్వరరా
వంతయుఁ గనిపట్టుచునే యుండెను. కాని మాటిమాటికి భుజించుచుండుటను
సుగుణవర్మ తనయాత్రిలనుగూర్చి చక్కఁగా వర్ణించి చెప్పెను. అంద
ఱును సావధానబుద్ధులతో వినిరి. కూతురుకుఁ బెండ్లియైన నరసింహారాజు
నకును నేదో యొకవిధమైన యభిప్రాయము సుగుణవర్మనుగూర్చి మన
స్సులో బాధించుచుండెను. వానికి [illegible] గోచరముగాఁ
గాన్పించుటలేదు, వానిని జాలకాలమునుండి యెఱిఁగియున్నటులే యాతని
మదికిఁ దట్టుచుండెను. చెప్పనలవిగాని యాందోళన మాతనిమనసునం
దుదయించెను.

భోజనములైనవి. అందఱును లేచి వారివారి యుచితాసనములపైఁ
గూర్చుండిరి. సేవకులు తాంబూలాదికములు తెచ్చియిచ్చిరి. వానిని
నములుచు నిష్టగోష్ఠిని మాటాడికొనుచుండిరి. నరసింహారాజు సుగుణ
వర్మసమీపమున సుఖాసీనుఁడై యుండి "అయ్యా! తమ్ముఁగూర్చి
మిక్కిలి వినియుంటిని. తమనిరుపమానగుణగణములకు నాకమితమోద
ముదవె. ముఖ్యముగా నా మేనల్లుఁడు వెంకటపతి తమయెడలపట్టిద్రో
హము తలపెట్టినను, దయరంతకరణతో వానిని గాపాడినందులకు నా
కృతజ్ఞతను దెలుపుచున్నాను. మీరువయసునఁ జిన్నలయ్యును వందనీ
యులు" అని పలికెను, సుగుణవర్మ మారుపలుకలేక పోయెను. అతనిహృ
దయమున సేవాభావములు నిండియున్నవి. నరసింహారాజు రెండుచేతు
లు మాతనిముపట్టి, కన్నుల నద్దికొని యూరకుండెను.

ఇట్లితఁడనిగా మేశ్వరరాయని లేఖకుఁడు వచ్చియజమానుని చెవిలో నేదియో పలికెను. కామేశ్వరరావానందరావుతో మాటలాడుచున్న సాలూరుధరాకాంతునియొద్దకుఁబోయి మెల్లఁగా 'అయ్యా! శంకరయ్య వచ్చెను.' అనిచెప్పి బిగ్గఱగా 'స్నేహితులారా! నేనును రాజుగారును నొకపనిమీఁద నావలకుఁబోయి వచ్చెదము. నాకుమారుఁగా నా లేఖకుఁడు తమకుఁగావలసినవన్నియుఁ దెచ్చియిచ్చుచుండును. పదినిము సములవఱకు నాకు సెలవుదయచేయఁగోరెద' నని యతనితోఁ బలకుఁజనెను

---

ఇరువదవ ప్రకరణము,



శంకరయ్య.

శంకరయ్య కఱువదియేండ్లున్నవి. కాని యతఁ డెనుబదియేండ్లు మీఁజినవానివలెఁగాన్పించును. అతనిదేహమున నస్థులుమాత్రమే యున్నవి. మాంస మేకోశమందును లేదు. శరీరమంతయు ముడుతలు వడియుండెను. దౌడలు లొట్టలుపడిపోయెను. పండ్లన్నియుమూడిపోయె ను.చూపునకంతగాఁ బాటవములేదు. నరములుబలిమిలేమి మేను వడఁకు చుండెను. తురీయాశ్రమస్వీకారియగు నాతఁడు పంచత్వము నొంద సిద్ధముగానున్నట్టులుండె.అతఁడుగృహస్థాశ్రమమునువిడిచిపెట్టినతరువాతఁ జిదానందయోగి యనునామమునువాల్చి యుండుటచే నట్లు చదువరు లెఱిఁగియేయున్నారుగదా! లేఖకుఁ డతని నొకగదియందుఁ గూర్చుండ బెట్టెను. అక్కడికిఁ గామేశ్వరరాయజగన్నాథవర్మగారలే తెంచిరి. జేఁడు సన్న్యాసిని జూచినతోడనే సాగిలఁబడిమ్రొక్కి "స్వామీ! సుమారిరువది రెండేండ్లనుండి నా మనమునుబాధించుచున్న నా భార్యనుగూర్చి యున్న రహస్యమునుబ్రకటించి నా యులమటఁ దీర్తురా" యని యత్యా తురముతో నడిగెను.

శంక—ఎవరు ? బ్రతికియుండిన, సాలూరు రాజియైయుండెడి స్త్రీరత్నమా నీభార్య ?

జగ—స్వామీ ! ఏమి బ్రతికియుండిన ననుచున్నారు ? ఆమె గతించినదా ? (డగ్గుత్తికతో) అయ్యా! తమకుఁదెలిసియున్నఁ జెప్పుము.

శంక—అయ్యా ! ఆపె సజీవయై యున్నదనియుఁ జెప్పలేను. మృతినొందినదనియుఁ జెప్పలేను.

జగ—(తొందరతో) అట్లయినచో మీకామెనుగూర్చి తెలిసినంతవట్టు వచింపుఁడు. నన్నీ సందిగ్ధావస్థయం దుంపకుఁడు.

శంక—చిత్తము. నాకథ సంగ్రహముగఁ దెలిపి యావల—

జగ—అయ్యా ! తమకథ నాకుఁ బూర్ణముగఁ దెలియును. నేను విజయనగరములో విద్యాభ్యాసముఁ జేయునపుడు తమ్ము ననేక పర్యాయములు చూచితిని. అప్పటి మీపేరు నే నెఱుఁగుదును. అదియెల్ల మరలఁ జెప్పనక్కఱలేదు. దయచేసి నేఁ గోరునంశముం జెప్పుఁడు.

శంక—ఒకనాఁటిరాత్రి యొకవృద్ధబ్రాహ్మణుఁడు నాయొద్దకు వచ్చి తనయింట నుపచారముఁ జేయుదాసి యొకర్తుక మరణావస్థనొందఁ బోవుచున్నదనియు, నదొకరహస్యమును నాతోఁ జెప్పఁదలఁచి రమ్మనిన దనియుఁ జెప్పెను. నే నాలస్యముఁ జేయక నా యాశ్రమమునువిడచి వెడలితిని. తమకాదాసి యెవ్వరో తెలియఁజేయ నక్కఱలేదు కదా ?

జగ—అక్కఱలేదు. వేవేగఁ జెప్పుఁడు.

శంక—దాసిలో నతఁడు తన వేదటికమునుగూర్చియు, ముసలిది తన కొసఁగిన సాయములఁగూర్చియు విరివిగాఁ జెప్పెను. ముసలిదాని కంతకుఁబూర్వమే మతిపోయినదఁట. కాని నన్నుఁ బిలువనంపునప్పుడె తెలివియుంతయు నొక్కమా ఱామెకు వచ్చెనఁట. అదియే ఛాప్ర

తెలిసియుండును. దానిని వీధివైపుననున్న యరుగుకడ నొక తాటియాకుల చాపమీఁదఁ బండుకొనఁబెట్టితి. అది పూర్ణవ్యక్తితో నుండుటచే నేను వచ్చినతోడనే కనుఁగొనియుండియే నమస్కరించినది. అది వచింపఁబోవు రహస్యాంశములు నాకుమాత్రమే వినిపింపఁ దలఁచినదని యా ముసలిపాటు దెలిసియుండుటచే, నతఁడు మెల్లఁగా నావలకు జారెను. ఆమె యంతటితోఁ దృప్తి నొందక, యతం డేమూలనైన నక్కి వినుచుండునేమోయని నన్ను మరల నావలకుఁజని చూచి రమ్మనినది.

జగ—సరియే. సరియే. త్వరతో శీఘ్రముగ ముఖ్యాంశములం జెప్పుఁడు.

శంక—దానిదగ్గఱ నే నొక్కఁడనే యుంటిని. మొదటఁ దాను జెప్పఁబోవునది తమకుఁదక్క నితరులతో జెప్పనని ప్రమాణముచేయుమనినది. నేనట్లొనర్చితిని. తమసెలవైనఁ దమనెయ్యురలో నెవనితో నైనఁ జెప్పవచ్చుననియు నది చెప్పినది.

జగ—(కామేశ్వరరావువంకఁ జూచి) ఇతఁడె నానెయ్యుఁడు. ఈతనితోనుం జెప్పుటకు మీకధికార మిచ్చితిని. చెప్పుఁడు.

శంక—చిత్తము. పిమ్మట నది తనచరిత్ర మేకరువుపెట్ట మొదలిడెను. జగన్నాథుఁడను పేరుగల యొకపడుచువాఁడు, లోకాతీత సౌందర్యవతియు గుణవతియు నగు తనయజమానురాలిపై జగదంబ యనుపేరుగల దానిపై నెట్లు వలపు నిలిపెనో—

జగ—స్వామీ! అదంతయు విడిచిపెట్టుఁడు. నే నెఱుఁగని విషయములు మాత్రమే సెలవిండు. నేను నా ప్రియురాలగు జగదంబతోఁ బిఠాపురమునుండి మరలివచ్చి యామెను విజయనగరమందలి కుటీరమందు దిగవిడచి, ప్రబలరోగపీడితుఁడైయున్న నాజనకునిఁజూడ వాల్తేరున కేతెంచినతరువాత నేమిజరగెనో వాక్రువ్వ వేఁడెదను.

శంక—ఆ దురదృష్టవంతురాలగు జగదంబ కొంతకాలము వఱకుఁ దమరు తప్పక మరలవత్తురని నమ్మినదఁట. ఆనమ్మికయుఁ జెడి యాశలోనిక దిగినదఁట. తుదకదియుఁ బోయి, నిరాశచేసికొని తమ పేర నొకకమ్మ వ్రాసినదఁట.

జగ—అయ్యో! నాకది యంతయుఁ దెలియును. ఆలేఖకు ఘాతుకుఁడగు నాపినతండ్రి ప్రత్యుత్తరమిచ్చెను—మృతి నొందినవానిని ఘాతుకుఁడని నిందించితిని. క్షమింపుఁడు—ఆలేఖయందలి ద్రోహంపు వాక్యములును వింటిని.

శంక—అట్టికమ్మ తన కందినప్పు డామె యపరిమితపరితాప మొందినదఁట. అయిన మీపై నొక్కనిందావాక్యమైన నామెనోటినుండి వెలువడలేదఁట, అప్పుడును మీపైఁ బ్రేమమును వెలిఁబుచ్చినదఁట. మీ రన్యాయముగాఁ గట్టళ్ళయం దుంపఁబడి యుందురని తలపోసినదఁట.

జగ—(వదనవినిహితపరిధానుఁడై) హా! జగదంబ! నా మనోహారిణీ! అట్టిపట్టునను గట్టడినని నన్నుం దిట్టకుంటివే? ఏమి నీసు గుణసంపత్తి? అయ్యో! ఆ ప్రాయము—ఆ సౌందర్యము—ఆ సాధుత్వము—ఆ ప్రేమము—

శంక—మఱియు రాజా! నేను దుఃఖవార్త చెప్పక తప్పదు—(భయపడుచుఁ దడఁబడుచు) ఆమె యప్పుడు—గర్భిణియైకూడ—

జగ—ఏమి? గర్భవతియైకూడ నుండెనా? అట్లైన నేను రెండు ప్రాణములఁ దీసితినా? అయ్యో! ఎంత ఘాతుకుఁడను! ఎంత ద్రోహిని! స్వామీ! వినఁజాల. వినఁజాల. ఇఁకఁ జెప్పకుఁడు.

శంకరయ్య మాటలాడలేకపోయెను. ఇంకను జెప్పవలసిన ముఖ్యాంశములు కలవు. ఆమె గర్భముఁ దాల్చినమాట విన్నమాత్రముననే యంతగాఁ బొక్కినయాతఁడు, ముందుఁ జెప్పవలసిన మఱియు

ఘోరవార్తలు వినిన నెట్లు దుఃఖించునోయని యతఁడు భయపడెను. కామేశ్వరరావు రాజునకు ధైర్యము చెప్పెను. "ప్రభువువారు సత్యము నెఱుఁగఁగోరి కదా, యీపూరుషుని రావించిరి? అతఁడు సత్యము వచించునప్పుడిట్లు తొట్రుపడియెదరేల?" అనియుసతఁడు పలికెను.

జగ—(కన్నులఁ దుడిచికొని) మిత్రమా! నేను దొట్రుపడ రాదు. నిశ్చయమే. స్వామీ! నాయవివేకమునకు మన్నింపుఁడు. తరు వాత నేమి జరగెను?

శం—రాజా! గర్భముధరించిన సంగతి నామె యెవ్వరితోఁ జెప్పకుండెను. తుదకు విధిలేక యావృద్ధదాసితో మాత్రము చెప్పినది. క్రమముఁగా నామెకు దాఁపరానియవస్థ వచ్చినది. నలువురును దన్ను నిం దింతురేమో యను వెఱపుపుట్టెను. గర్భమభివృద్ధియగు కొలఁది నా మెకు మనోవేదన హెచ్చఁదొడఁగెను. ఆమె పరిణయమయ్యెనని తె లుపఁజాలకుండెను. తెలుపఁదలఁచిన భర్తయెవ్వరో చెప్పవలసియుండు ను. రాజ్ఞీసంజ్ఞను వహింపవలసి యుండును. కాని యట్లొనర్చుట యామె కిష్టము లేదు. ఏలయన మీాపినతండ్రివ్రాసిన జాబునుబట్టి యామెకట్టి బిరుదునుధరించుట కధికారము లేదనితలఁచెను. మఱియుఁదమయాజ్ఞకు వ్యతిరేకముగాఁ జరించినఁ దమరు కోపింతురేమో యని భయపడెను. కొండవిఱిగి మీాఁదఁబడినను మీామాట దాఁటవలెనని యామెకు లేదు. ఒకనాఁడామె ముసలిదాసితో నిలువిడిచియెటకో పోవుచున్నాననియు, మరల రాననియుఁ జెప్పినదఁట. అప్పుడావృద్ధస్త్రీ కన్నులనీరునించి యజమానురాలి నెన్నెి తెఱఁగులనో బ్రతిమలాడెనఁట. కాని, జగదంబ నిశ్చ లయైయుండెనఁట. ఆమెయొద్ద నప్పుడున్న కొలఁది ధనములోఁ గొంత భాము సలిదానికిచ్చి, మిగిలినదానితో బయలుదేఱి యేయూరో వెడలి పోయెనఁట.

జగ—(అశ్రుబిందువులు రాల్చుచు) హా! ప్రియా! నాపరిభవిత—తిరస్కృత—హృదయేశ్వరీ! నీకెట్టిపాటుఁగల్గించితిని? ఆనిర్భాగ్యశిరోమణి—ఆకపటశీలుఁడు—ఆదుష్టవర్తనుఁడు—ఆచండాలుఁడు— ఆ పాపియా నాపితృవ్యుఁడేకదా నిన్నిట్టిగుట్టలకుం ద్రోసెను?

కామే—రాజా! సర్వమెఱింగినవారు తమరేయిట్లు మృతులైన వారిని దూషింతురా?

జగ—మిత్రుఁడా! అవును. కూడదు. వివేకహీనుఁడనై యొడలెఱుఁగక ప్రేలుచున్నాను. ఒకరి ననఁబనిలేదు. విధియట్లు నానొసట వ్రాసినాఁడు ‘లలాటలిఖితరేఖా నపునఃప్రయాతి’ ఓపరిహాసితరాకాసుధాకరబింబవదనా! తిరస్కృతగజరాడ్గామినీ! పరిభవితవిద్యుల్లతాంగీ! ఏలోకమందుంటివో! ఏస్థితియందుంటివో? ఏమిచేయుచుంటివో! ఈవిశ్వాసఘాతుకుని, ఈదయావిహీనుని, ఈయస్థిరచిత్తుని, నీయిచ్చవచ్చినట్లు శిక్షింపుము. నీవు మృతినొందినను శాశ్వతజీవినివే. నేనన్నన్నో బ్రతికియున్నను జచ్చినవాఁడనే.

అని పరిపరివిధముల భార్యనుదలఁచుకొనుచుఁ, దన్నునిందించుకొనుచు నాథునుండు శోకించుచుండఁ గామేశ్వరరాయనిగుండె నీరైపోయెను. అతఁడు మొగము చాటుగాఁబెట్టుకొని కన్నులనుండి జాఱుచున్న నీటిచుక్కలఁ జేలములతో నద్దుకొనెను. బహుకష్టములకులోనై దుఃఖముల కలవాటుపడిన శంకరయ్యకూడఁగన్నుల నీరునించెను. జగన్నాథవర్మ చాలసేపట్టులుండెను.

జగ—(ధైర్యమువహించి) స్వామీ! ఆమెనుగూర్చి మీకు దెలిసినదింతియేనా?

శంక—ప్రభూ! ఇంతియేకాదు. ఇంకను జెప్పవలసియున్నది.

జగ—ఏమి! ఇంకను మీకుఁదెలియునా? దయచేసి చెప్పుఁడు,

శంక—నేను జెప్పఁబోవునదియే ముఖ్యమైనది. ఆమె గృహ మువదలి చని యేడెనిమిది నెలలైనది. ముసలిది యామెను మఱచియే పోయినది. ఒకటినాఁటిసాయంకాల మది యూరివెలుపలి కోఁటలోనికిఁ బోవుచుండఁగా, సంజకెంజాయలో లీనమైన వర్ణముగల యొకయువతి యామెకుఁ బొడఁగట్టెను. జగదంబ దయ్యమై యట్లువచ్చినదని యామె భ్రమపడి, భయముఁజెంది మూర్ఛపోయినది. ఆమె తెలివొంది చూచుసరి కొక చెఱువుగట్టుమీఁదఁ జెట్టునీడను జగదంబతొడపైఁ దల నూనుకొని, పండుకొని యున్నది. ఆమె నిజమైన జగదంబయే. కాని రూపమందు మిగుల మార్పొందినదఁట. పలుచనై, నల్లనై, కృశించి యున్న దఁట. రాజా! విన్నదంతయుఁ జెప్పుచుంటిని. మీరుమాత్రము ధైర్యపడకుఁడు. పడితిరేని పిచ్చియెత్తును.

జగ—నాకు నిజముగాఁ బిచ్చియెత్తియేయున్నది. కానిమ్ము. అనంతర మేమయ్యెను?

శంక—ఆమెయెట్లున్నను వృద్ధదాసి యానవాలుపట్టఁగల్గిన దఁట. ఆమె యెచ్చట నెట్లుజీవింపఁగల్గెనో చెప్పుమన్నదఁట. తాను మారుపేరితో నొకపల్లెయందు జీవించియుండి, మూఁడునెలలక్రింద నొక బిడ్డను గనినట్లు చెప్పినదఁట.

జగ—(సంభ్రమముతో) ఆబిడ్డ యేమయ్యెను?

శంక—ఆమగబిడ్డ—

జగ—నాకుఁ గుమారుఁడే! ఏమి? వాఁడేమయ్యెను?

శంక—రాజా! నేనికఁ జెప్పఁజాలను.

జగ—వాఁడు మృతినొందెనా? అంతయేమైయుండనోపు. దాఁపక చెప్పుఁడు. ఎట్టిఘోరవార్తయైన వినుటకు సిద్ధముగానుంటిఁగదా?

శంక—లేదు. మృతినొందలేదు. ఆమె యాపిల్లవానికి జక్కఁదనమును బట్టి మకరందుఁడని పేరుపెట్టితిననియు. మూఁడుమాసము

బాబిడ్డను నానాక్లేశములుపడి పెంచితిననియుఁ, గాని వానికిఁ గడుపు నిండఁ బాలైనఁబోయుటకు దొరకకుంటచే వాఁడు మృతినొందినను బాగుగనుండునని తలఁచితిననియు ముసలిదానితో నన్నఁదట.—

జగ—అయ్యో! లేమి పుత్త్రప్రేమను సయితము దిగనాడు నుగదా! ఆవల నాబిడ్డఁడేమయ్యెను?

శంక—ఆమెకుఁ గ్రమముగా మతిక్షీణించెనఁట. శిశువును వ్యథగాఁ జంపివైచుటకన్న నెచ్చటనైన విడిచిపెట్టిన, నెవరైన నెత్తికొనిపోయి పెంచుదురని తలఁచినదఁట. అట్లుతలఁచి వానినొకచోట, యాత్రాజనులు చూచునట్లుగ నుంచి వచ్చినదఁట.

జగ—ఏమి? ఎంతసాహసము! కన్నబిడ్డనే? ఆమె విడిచిపెట్టిన స్థలమెద్ది?

శంక—అందునుగూర్చి జగదంబ యేమియుఁ జెప్పలేదఁట. వానినారీతి విడిచిపెట్టి వడివడినడచి యాత్రోటకడకు వచ్చినదఁట. ఆమె దివారాత్రములు వారముదినములు నడచినదఁట. ఎంతదూరము నడచినదో యామెయే యెఱుఁగదఁట. ప్రతిదినమొక్కపూఁట మాత్రమే దారిలో భోజనము చేయుచుండెడిదఁట. తానెక్కడికిఁ బోవుచుండెనో, యెందులకుఁ బోవుచుండెనో, యెఱుఁగకుండఁగనే తనపూర్వస్థానముఁ జేరఁగల్గినదఁట. పిమ్మటఁ దమయొద్దనుండి యేదైన జాబువచ్చెనాయనియుఁ దమక్షేమసమాచారమేమైనఁ దెలిసెనాయనియు దాసి నడిగినదఁట. అదిలేదన మఱింతవగచి, యావలబిడ్డని సౌందర్యాదులను వర్ణించి చెప్పినదఁట. ఎట్లు చనుఁబాల్గ్రోలి చందమామవంటి మోముతోఁ గిచకిచనవ్వుచుండెడువాఁడో, యెట్లు చిన్నతొట్టిలోఁ బండుకొని యెదుటివస్తువులకేసిచూచి కాలుసేతులాడించుచుండెడివాఁడో, యెట్లు బొజ్జనిండినతృప్తి దవ్యక్తమధురధ్వనులు చేయుచుండెడివాఁడో, వర్ణించి వర్ణించి చెప్పినదఁట. ఒక్కొక్కమాటు చెప్పి కన్నీరు మున్నీరై పాఱు

నట్లువాపోవుచుండెడిదఁట. ఆబిడ్డనికిఁ గుడిభుజముమీఁద మూఁడుపుట్టు మచ్చలు త్రికోణాకారముగ నుండెనఁట. ముక్కులుమూటఁగట్టు వాని యాకృతికవి మఱింతయందమును దెచ్చినవఁట.

జగ—ఆహా! నాకునటులే దక్షిణభుజస్థలమునఁదే, మూఁడు మచ్చలున్నవి. ఇవే చూడుఁడు. (అని చూపెను) హా! కుమారా! మారాకారా! నీవేమైతివో! ఎందునుంటివో! స్వామీ! తదనంతర వృత్తాంత మేమి? ఆమెయేమైనది?

శంక—భూపాలా! నాచెప్పఁబోవు కథ కొంచెముమాత్రమే యున్నది. ఆమె యాదాసితో నచ్చోటుఁ నొక యరజామువఱకుఁ గూర్చున్నదఁట, ఆబిడ్డఁడెక్కడనున్నాఁడో తెలిసికొనవలెనను కుతూహల మున దాసి యెన్ని ప్రశ్నములవైచినను సంభాషణము మూర్ఛవేయు చుండెనఁటగాని, యామె సరియైన ప్రత్యుత్తరమీయకుండెనఁట. చాలసేపు తమ్ముఁగూర్చి ప్రసంగించినదఁట. తమరామెను గాంధర్వ విధిని వివాహమాడుట, పిఠకాపురము పోవుట, యచ్చట స్వల్ప కాల మత్యంతోల్లాసముతోఁ గడపుట, మున్నగు సంగతులు మరలమరలఁ జెప్పినదఁట. తమరు దేశాధీసులైన ట్లింతకుఁబూర్వ మాదాసికిఁ దెలి యదఁట. అప్పుడు జగదంబ చెప్పుటవలననే తెలిసెనఁట. అంతట నామె యకస్మాత్తుగా లేచి 'ఓసి! నీవిచ్చటనే లేవు నన్నుఁ గలసికొను'మని యతిశీఘ్రగమనముతో మెఱుపుమెఱసిన ట్లిచ్చటకే పోయెనఁట.

జగ—అన్నమాట నిలుపుకొని మఱునాఁడు వచ్చెనా?

శంక—రాలేదఁట. పాపము దాసి ప్రతిదినము సాయంకాల మున నా తటాకంబుదరిదరికివచ్చుచుండెనఁట. కాని దానియాశలు వ మ్మయ్యెనఁట. అది యజమానురాలికొఱకు నిరంతరము దుఃఖించుట వలన, వార్ధక్యముకతంబున, మతిభ్రమనొందినదఁట. జగదంబ చరిత్ర మెవ్వరితోను జెప్పఁదలఁచికొనలేదఁట. అంతట మీరువచ్చితిరఁట.

జగ—అవును. నేను జెయిలునుండి విముక్తిఁజెందిన వెంటనే య
క్కడికిఁ బోయితిని.

శంక—కాని మిమ్ముఁజూచిన దాని కమితకోపమువచ్చినదఁట.
మీరు పదునెన్మిదిమాసములు కారాగృహమునం దుండుట మున్నగు
నంశము లబద్ధములనియుఁ, గల్పించిన నెపములనియు నమ్మినదఁట
దాని యజమానురాలిపోకకు, హీనస్థితికి, వేయేల, నాశమునకు
మీరే హేతుభూతులని నమ్మి మీతో నొక్క మాటయైనఁ
జెప్పినదికాదఁట. తరువాత నది రెండుమాసములు మంచముమీఁదనే
యుండినదఁట. అప్పుడించుక పశ్చాత్తప్తహృదయయై సర్వము మీకు
నివేదింపవలెనని యూహించినదఁట. దానికిరోగము మిక్కుటమైన
కొలఁది,మీతో నారహస్యమునుజెప్పవలెనను నారాటముకూడహెచ్చె
నఁట. తుదకుఁ జావు సమీపించిచున్నదని తెలిసినపిమ్మట నదినాకొఱ
కావిప్రునంపి సర్వము నివేదించినది. అదిచెప్పఁదలఁచినమాటలన్నియుఁ
జెప్పి,అమ్మయ్య! ఇప్పుడునామనసు కుదురుపడినది. ఇఁకఁబ్రాణములు
విడిచెదనను చునే యుసురులు వదలినది.

జగ—అయ్యో! మీరు వెంటనే నాకడకేలరాకుంటిరి? అప్పు
డే వచ్చితిరేని, సతీమణి యూనవదిలుకొన్నను బిల్లవానికొఱకైనఁబ్రి
యత్నించియుందునే?

శం—రాజా! అప్పుడే తమకోటకేఁగితిని. తమరూరలేరు.
తమతోనొక ముఖ్యవిషయము మనవిచేయవలసియున్నదనియుఁ దమ
సేవకులకుఁ జెప్పితిని. కాని వారావిషయము దుఃఖకరమైనదైనఁ జెప్ప
వలదనియుఁ దామప్పుడేకష్టప్రహ్రదమునుండి బైటఁబడితిరనియుఁ జెప్పిరి,
నాశత్రుప్రులు నన్నుఁ గనిపట్టుదురేమోయను భయముచే నాపట్టణ
మును విడిచి బ్రహ్మపురమున కరుగుదెంచితిని. అక్కడ ,నాయన్న
యుండెడువాఁడు. అతని యండనుజేరి యించుక ఋణములుతీర్చుమార్గ

మూలోచింతమని తలఁచితిని. కాని నేను బ్రిహ్మాపురము జేరినదినమున నే యతఁడీలోకమునువిడిచి శాశ్వతబ్రిహ్మలోక మనుభవింపఁ బోయెను. నేను నిరాశావాతుఁడనై ముందుకుఁబోయి యిచ్చటిపురినిఁ జేరితిని. ఉత్తమస్థులు నన్ను వెంబడించి నాహాదీలు కని పట్టి వచ్చుచునేయుండిరి. నన్ను నారాకటకపురియందు బట్టుకొని న్యాయాధికారుల కప్పగించి చెఱసాలలో నుంచిరి. సుమారుగు పదిసంవత్సరము లందుంటిని. నేఁటికి మీయనుగ్రహమువలన ఋణవిముక్తుఁడనై, బంధవిముక్తుఁడనై, రాఁగలిగితిని. జీవచ్ఛవంబనై యున్నాను. ఇఁక నెంతకాలమో బ్రితుకను.

జగ — (కొంతవినియుఁ గొంత వినకయునుండి) ఆశిశువు పెంపఁబడిన యూరుపేరేమి?

శంక — జగదంబ యాపేరు చెప్పలేదఁట. విజయనగరమునకు వారముదినముల ప్రయాణమున నుండుటచే నది దూరగ్రామమేయై యుండవచ్చును.

సాలూరుప్రభువు లేచి రెండునిమిషములు ముందునకు వెన్కకు నడయాడి, యేదియో యోజించి సదుమను "కామేశ్వరరావుగారూ! ఇప్పటి మనసంభాషణములో నొక్కమాటయైన నితరులకుఁ దెలియనీయకుఁడు. యోగీంద్రా! మీరును సర్వమును రహస్యముగా నుంతురనియే నమ్ముచున్నాను. నాకుమారుని గనుఁగొనఁ గల్గితినా, రహస్యమే యక్కఱలేదు. ఒకవేళ నాప్రియత్నములు వ్యర్థములైన నాదుశ్చారిత్రము నెరుల కెఱుగఁబడుటవలన బనిలేదు. నాదుఃఖము నేనే దిగమ్రింగవలయును. నారహస్యములు నాలోనే యంతమొందవలెను. కామేశ్వరరావుగారూ! నేను రేపే యీవిశాఖపురివిడిచి చనువాఁడ. మీరీపురుషసింహునికిఁ గావలసిన వానంగి కాపాడుచుండుఁడు. ఈయనకుఁ దగినంతధనము వ్యయపఱిచి రోగచికిత్స చేయింపుఁడు.

నాకిదే సెలవు దయచేయుఁడు. ఆనందరాయాదిమిత్రవర్గముతో నేనొక్కొందరపనిమీఁదఁ బోయితిననియు, క్షమింపవేఁడితిననియు మనవిఁ జేయుఁడు. వారితో నింకను నెట్లు పలుకవలెనో మీకే తెలియును. నేను జెప్పనక్కఱలేదు నమస్కారములు, సెలవింకు." అనిచేఁదులేచి వెడలఁ బోయి యేదోజ్ఞప్తికిరా నాఁగి కామేశ్వరరావుతో మెల్లఁగా "అయ్యా! నాకథ యంతయు నానందరావుగారితోఁ గూడ నొకప్పుడు చెప్పితిని. ఆయనతో శంకరయ్యగారిని గలసికొంటినని చెప్పఁడు. కాని జరగిన యంశము లన్నియుఁ దెలియనీయకుఁడు. వానిని నానోటితోడనే మఱి యొక యనుకూలసమయమున నాతనితోఁ జెప్పెదను." అని చెప్పెను.

ఆఘనుఁడు తత్క్షణమే పాదచారియై తనబస కేఁగెను. వేఁగి తనపుస్తకాలయమందుఁ గూర్చుండి, మరల జగదంబావిగ్రహమును హస్తమునందుఁబట్టుకొని తలపోఁతలకు మొదలుపెట్టెను.

## ఇరువదొకటవ ప్రకరణము.



### ఆనందము.

అతిథు లెల్లరుఁ దమతమనివాసములకుఁజనిరి. అరవిందా నరసింహ రాజులు సుగుణవర్మనుగూర్చి ముచ్చటించుకొనుచు నొకయశ్వశకట మెక్కి తమమందిరమున కేఁగిరి. ఆమె యావర్మ నెన్నివిధముల మఱచి పోవలెనన్నను. మఱవలేకుండెను. రాత్రిచాలసే పాతనింగూర్చియే ధ్యానించుచుఁ బండుకొనెను. తుద కెట్టులో కన్నుమూఁతపడి నిద్దురఁ జెందెను.

ఆసుగుణవర్మను మొదటఁ జూచినప్పుడరవిందకట్లు కలఁతగలుగ నేల? మోహినిబాయి యాతని సమీపించి స్వాగతమిచ్చునప్పుడామె తొట్రుపాటు నొందనేల? భోజనసమయమం దతనివంకఁజూచి పరా

యుత్తచిత్త కానేల? ఆతఁడు తన్నుఁఱుఁగఁడే! కేవల నూతనపురుషుఁడే! అట్టివాఁ డితరసూావనాంగనలతో భాషించుచుండ నామెసహింపలేమి యేమిటికి ? అది యసూయయా ? మన కథానాయిక కెప్పుడట్టి గుణము లేదే! నరసింహారాజాతనిఁ బ్రస్తుతించినప్పు డాతఁడు మాఱు పలుకలేక యాఘనుని హస్తములు పట్టుకొని కండ్ల కద్దుకొనుటకూడ నరవింద చూచెనేని, యిఁక నెట్టిమనోవికారము లొంగునో ? అను కప్పుడొదవిన యాత్రము, నిర్వేదము, భంగము, సందేహము మున్న గునవి వర్ణింప నశక్యములు. అవి కలుగుటకుఁ దగినకారణము లంత కన్నఁ జెప్పఁ జాలము.

అరవింద యెప్పు డిట్లు పరిచలితయై యుండలేదు. ఆపున్నాగుని శాంతసంభాషణములు, ఋజువర్తనములు, ఘనోద్దేశములు, గురు జనవిధేయత, దంభరాహిత్యము, మొదలగు గుణములామె నాకర్షించి నవి. ఆమె కాతనియందు మోహము జనించినది. కాని యామె యింతకుఁబూర్వము పరిభాకరుఁ కుమారిని తనహృదయము నర్పింప నిశ్చయించుకొనినదే! పెదతండ్రి మనోవాంఛ యదియేయని గ్రహించి యున్నదే! ఇప్పు డీతనిపై వలపునిలిపి తనవ్రతమునకు భంగముఁ దెచ్చుచున్నదా ? పెద్దతండ్రియాజ్ఞ నుల్లంఘనముచేయఁ దలఁచినదా? అట్టి సందేహములు మనకువలెనే యామెకును గలుగకపోలేదు. పూ నికతో నామగుణవర్మను హృదయమునుండి వెడలఁగొట్టవలెనని యత్నించెను. కాని యామెకు సాధ్యము కాదయ్యెను.

మఱునాఁటిసాయంకాలము నరసింహరాజు హూణావైద్యునితోఁ గూడి గుఱ్ఱపుబండినెక్కి చల్లనిగాలి ననుభవించుటకుఁ బోయెను. అరవింద యొక్కతె సౌధోపరితలమునఁ గూరుచుండి, సముద్రతిరంగ ముల నవలోకించుచు, నంతరంగమందు సుగుణవర్మనుగుఱించి చింతించు చుండెను. అట్టితఱి సుగుణవర్మ నరసింహారాజుగారినిఁ జూచుటకై

వనముకడకు వచ్చెను. భటులాతఁ డిప్పుడే రాఁగలఁడని చెప్పి, యొక యుచితాసనముపై నాతనిం గూర్చుండుమని కోరిరి. అతఁ డేదియో యాలోచించుచు నొంటరిగా నాసీనుఁడై యుండెను. కొంతసేపటి కరవింద మేడమీఁదినుండి దిగి తండ్రియుండు తావునకు వచ్చి చూచెను. కాని యచ్చట నాతఁడు లేఁడు. పరధ్యానముతో సుగుణవర్మయుఁ గడు దాపునకు వచ్చెను. స్మృతికివచ్చి చూచునరి కాతఁ డెదుటఁ గాన్పించెను! అరవింద మది కళుక్కుమనియెను. అంత సమీపమున నిలిచి యాతని నెమ్మొమును జూడలేక నేఁడు చూచినది. మనస్సులో నొక విధమైన సందేహము, సంభ్రమము, సంతోషముజనించెను. అతఁడుకూడ నొకమా ఱామెవైపుచూచి తలవంచుకొనెను. వెంటనే యరవింద లోనికిఁ బోయెను నరసింహరా జెంతకును రామి సుగుణవర్మయు ఇనకు వెడలెను.

ఐదాఱు వారములు గడచెను. ఈలోపున సుగుణవర్మ యెన్నియోసారులు కాండ్రేగులదేవేరిమందిరమునకువచ్చి నరసింహరాజుతో సంభాషించెను. అన్నిసారులు నరవింద యాతనిఁ జూచుట తటస్థించెను. చూడఁజూడ నామె కాతనియందుఁ బ్రభాకరునిపోలిక యున్నట్లు గాన్పించెను. ఇతఁడే ప్రభాకరుఁడేమోయని యనుమానపడెను. కాని యతఁడు చిరకాలముక్రిందనే మృతినొంది యున్నవాఁడగుటచే నతఁ డెట్లు రాఁగలఁడని యప్పుడే సమర్థించుకొనుచుండెను.

ఒకనాఁడు నరసింహరా జరవిందతో సంభాషించుచు సుగుణవర్మ ప్రసక్తి రాఁగా నరవింద తండ్రితో "నాన్నగారూ' ఆసుగుణవర్మవిషయములో మీయభిప్రాయమేమి ? అతఁ డెట్టివాఁడు?" అని యడిగెను.

నర — నేనతనిఁ జూచినకొలఁదిని వానిపై నధికస్నేహభావము నాకుఁ గుదురుచున్నది. అతఁ డేదియో యించుకలజ్జగల వానివలెఁ గాన్పించుచున్నాఁడు. ఎప్పుడు నాతో మాటాడిన మోమువంచియే మాటాడును. తన్నంతద్రోహముచేసిన వెంకటపతికి నేను మేనమామనైనను, నాతో నెంతయో కలిసిగొట్టుఁదనముతో భాషించుచుండును. కామేశ్వరరావుగారియింట విందునాఁడు నాకృతజ్ఞతను వానితోఁ దెల్ప నతఁ డతిప్రీతితో నాహస్తములఁ బట్టెను.

అర — అతని సుజనత్వము ప్రసిద్ధియైనదే. అతఁడు దేశాటనము మిక్కిలిగాఁ జేసెననియుఁ, బరిజ్ఞాన మార్జించెననియు, మహాఘనసంఘమందుఁ జరించుననియు వింటిని. నిజమే?

నర — నిక్కువమే. సాలూరురాజుగారు, ఆనందరావుగారు మున్నగువారాతని కితరప్రభువులతో స్నేహమునుగూర్చిరఁట. అతని నెచ్చటనో చూచినట్లు తట్టుచుండును.

అర — నేనును వానిని మనబసకువచ్చినప్పుడెల్లఁ జూచుచుండునుగదా! నాకు నటులే స్ఫురించుచున్నది. ఆశ్చర్యముగానున్నదే!

నర — నిన్నను కామేశ్వరరావుగారియింట నేనతనితో మాటాడుచు "అయ్యా! మీరు చంద్రగుప్తానె మెన్నఁడైన నచ్చితిరా?" యనియడిగితిని. అతఁడు తెల్లఁబోయి నావంకఁజూచెను. అప్పుడే యానందరావువచ్చి యతనింబిలుచుకొనిపోయెను. అతఁడు నాకుఁ దగిన ప్రత్యుత్తరమీయలేదు.

అర — అతని కానందరావుగారితో నెక్కుడుస్నేహమఁట కాదా?

నర — స్నేహమే కాదు. ఇంకనుంగలదు. నీతోఁ జెప్పుటయే మఱచితిని. త్వరలో నొక వివాహముజరగును. అందుఁ బెండ్లికూఁతురు పక్షమున నీవు ముఖ్యముగా నుండవలసియుండును.

అరవింద వెలవెలఁబోయి శిరమువంచినది. "అమ్మా! ఏమి యట్లుంటి" వని యామెను దండ్రియడుగఁగా నేమియును లేదని యామె యూరకున్నది. జనకునిపలుకు లామెకు రెండర్థములిచ్చినవి. అందు మొదటదానియందామెకు భయముకలిగెను. సుగుణవర్మ మోహినిని వివాహమాడునేమో తన హృదయగతాభిప్రాయములు వమ్మగునేమో యని తలఁచెను. రెండవదానియం దామె కానందమొదవెనుః తనమదిని బాధించుచున్న యనుమానము నిక్కువమై తనకు సంతోషదినములు వచ్చునేమోయను నాశకలిగె. ఆమెకుసుగుణవర్మయెడ మోహముండెనని యిదివఱకే చెప్పఁబడెఁగదా! ఇప్పుడు తండ్రిపలుకులచే దానికి విఘాతమువచ్చునని భయముదయించెను. ఆమెకింకను గలవరము వదలనేలేదు. అప్పుడు సుగుణవర్మ ప్రవేశించెను. చప్పున నామె లేచి ప్రక్కనున్నగదిలోనికిఁబోయి తలుపు సగముమూసికొని యొకపడకకురిచీమీఁదవ్రాలి యేదో యాలోచించుచు మధ్యమధ్యమునఁ దలుపుసందునుండి యాతనివంకఁ జూచుచుండెను.

నర—అయ్యా! మేమిప్పుడు మీమాటయే చెప్పుకొనుచుంటిమి. అంతలో మీరేవచ్చితిరి. మాయమ్మాయితో మిమ్మునుగూర్చి యొకరహస్యమును జెప్పితి.

సుగు.—నన్నుఁగూర్చి రహస్యాంశమా? అదియేమి?

నర—మాయరవిందతోనొకవివాహము తర్వాలో జరగఁబోవుచున్నదనియు, మోహినీబాయిపక్షమున నామె ముఖ్యబాంధవిరాలై యుండవలెనని యామెఁ జెప్పితిని. వినుటనభినయించి ఈకలకలమేమి ?

అని యేదోధ్వని వినఁబడ నరసింహరాజు మేడమీఁదినుండి క్రిందికిఁ జూచెను. నాల్గుగుఱ్ఱములబండియొకటియతిశీఘ్రముగ భవనమువైపు వచ్చుచున్నట్లాతనికిఁ జూపట్టెను. మఱిరెండునిముసములకదుం సాలూరుప్రభువు కాన్పించెను. వెంటనే యతఁడు సుగుణవర్మతో

'అయ్యా! మరేమియును లేదు. జగన్నాథవర్మగారు వచ్చుచున్నారు. వారి
శకటధ్వానమది' యని చెప్పెను. సురల సత్యుడు శకటమువంకఁ
జూచి కామేశ్వరరావుగారుకూడ వచ్చిరే! ఇంతేల యింత యాత్రిమి
తో వచ్చుచున్నారు చెప్పుమా, యని తనలోఁ దాననుకొనెను.
అత్తణమందే యొక భటుఁడు పైకివచ్చి 'మహాప్రభూ! సాలుగారు రాజుగారు
కామేశ్వరరావుగారితో వాకిటఁ గూర్చుండిరి. మిమ్ముఁ దత్క్షణము
రమ్మని కోరిరి' అని చెప్పెను. నరసింహరాజు 'అయ్యా! నేనిప్పుడే వత్తును.
తమరిచ్చట నేయుండుఁ'డని మేడదిగెను.

అరవిందాసుగుణవర్మ లిరువురుమాత్రమే యాసౌధమునందుండిరి.
ఉభయుల భావప్రవాహములు నవిచ్ఛిన్నముగఁ బ్రవహించుచున్నది.
నరసింహరాజాదులేల కలతపడుచుండిరో, యేమిమాటాడుచుండిరో
వారికిఁ దెలియదు. తెలిసికొనవలెనని వారు ప్రయత్నించుచుంట లేదు.
అరవిందకు మాటిమాటికిఁ బ్రభాకరుఁడు తలఁపునకువచ్చుచున్నాఁడు. వా
నివిగ్రహము నెదుటఁగాంచినట్లు భావించుకొనియామె తన్మయత్వము నొంది
యుండి కొంతసేపటికి చూచి 'అయ్యా! ప్రభాకరా! అపరాధినిక్షమింపు
మని బిగ్గఱగానని మూర్ఛవోయెను. ప్రక్కనున్నగదిలోఁ గూర్చుండి
యున్న సుగుణవర్మ యామెలుంగువిని, యామెను సమీపించి, తన
యుత్తరీయాంచలముతో వాయుకు విసరి, చెఱఁగుతోఁ జెమ్మటలుదుడిచి
'అరవిందా! ఏల సొమ్మవోయితివి?' అని పలుకరించెను. ఆమెకా
కంఠధ్వని యమృతధారాపాతమువలె వీనులకుఁ దోఁచెను. అప్పుడే
తెలివివచ్చి యొకసారి కన్నులుదెఱచి మరలమూసికొనెను. వానిమేను
తనశరీరమును దాఁకుటచే నవాచ్యానందమునొంది మైమఱచియుండెను.
'అయ్యా! స్వస్థపడినది. పోయికూర్చుండుఁడు' అని యామె పలికి లేచి
కూర్చుండెను. సుగుణవర్మ యక్కడ నేనిలిచి "అరవిందా! ఇంతవఱకు
నీమతినిగల యభిప్రాయముల గ్రహించితిని. నేను మోహిని బాయివై

మోహము నిలిపితినని నీవనుకొనుచున్నావు. అదియసత్యము. నాకామె చెల్లెలు. సహోదరీభావముతోనే యామెను వీక్షించుచున్నాను. మనోహారిణీ! భవదర్పితమైనహృదయ మన్యులకెట్లర్పింపనేర్తును? "అని యామెతోఁ జనెను. ఈనుడులు విన్నప్పుడామెకుఁ గలిగిన యానంద మే మనవచ్చును? ఆమె నిశ్చలముగా నాతనివంక నొక్కింతసేపు చూచెను. ఈసుగుణవర్మయే పరిభాకరుఁడై యుండవచ్చునని తలఁచెను. కాని యది భ్రమయేమోయని యనుమానించెను. ఆమెమనసు నెటుఁగాకుండఁ దబ్బిబ్బుపడుచుండెను. అట్టితఱిని మరల భటుఁడు ప్రవేశించి'అయ్యా! సుగుణవర్మగారూ! సాలూరురాజుగారు తమ్మొకసారి తత్క్షణ మాక్రిందిగదిలోనికి దయచేయుమని కోరిరి.' అని చెప్పెను.

అతఁడు 'అరవిందా! ఇప్పుడె వచ్చెద'నని యావలికేఁగెను. అరవింద యొక్కతె యున్నది. మరల నామె భావనాప్రపంచము విస్తరింప నారంభించెను. సంతోషము, సందేహము, ఆశ, భయము, మోహము సంభ్రమము, జంటజంటలై యామెహృదయవీధిని జరించుచుండెను. "నాయనుమానమే సరియై, యీసుగుణవర్మయే పరిభాకరుఁడయ్యేనేని నామోహప్రవాహమును బోనిచ్చెదను. అదియంతయు నాచిత్తభ్రమ మాత్రమేయైన దానినిఁక నాఁటి వెనుకకుమరలించెదను. నాపెదతండ్రిని స్మరణకుఁ దెచ్చికొనెదను. ఆసంకల్పసిద్ధుని యాత్మ సర్వదా నన్నుఁ గాచుచుండును. అతఁడే నాకు సద్భావములు పుట్టించును"అని యామె యనుకొనెను అప్పుడామెకు మేడమెట్లమీఁద నడుగులు చప్పుడు వినఁబడెను. ఒక్కనిముసమునకే తలుపు బడాలునఁ ద్రోయఁబడెను. ఒక గుంపు లోనఁబ్రవేశించెను. మొదట సాలూరురాజుగారు సుగుణవర్మను కౌఁగిలించుకొని ఆవల నానందరావుగారును, బిమ్లట నరసింహరాజు కామేశ్వరరావుగారును విచ్చేసిరి. అరవింద యత్యాశ్చర్య నిమగ్న చిత్తయయ్యెను. జగన్నాథవర్మ యానందబాష్పములతో డగ్గుత్తికతో

“అమ్మా! అరవిందా! ఇదె నీమహిమవలనఁ, గామేశ్వరరాయని నిరంతర కృషిచే, సర్వాంతర్యామియగు పరాత్పరుని యపారకృపచే, నాపుత్త్రుని నాయనుంగుఁబుత్త్రిని పాలూరు యువరాజుని నేఁడు చూడఁగల్గితిని. ధన్యతను గాంచితిని. ఇతఁడె నాకుమారుఁ”డని వచించెను. అరవింద యాయావనునివంకఁ దేఱిపాఱఁజూచుచు నిశ్చేష్టయయ్యెను. ఆయువకుఁడు ‘అరవిందా! నేనెంత యువరాజునైనను నీకుమాత్రము ప్రాఁతచుట్టమనగు ప్రభాకరుఁడనే’యని యామెకుఁ గనుదాపుననిలిచి పలికెను. అరవింద సంతోషపరవశయై యందఱుపురుషులుండిరనియైన వెఱవక, యనుమానింపక, సిగ్గుపడక, తన చిన్ననాఁటినేస్తమును, దనహృదయవల్లభుని దనప్రభాకరుని హస్తముఁబట్టి యానందదుఃఖసమ్మిశ్రితములగు బాష్పబిందువుల విడిచెను.

---

## ఇరువదిరెండవ ప్రకరణము.



### రు జా వు లు.

చదువరులారా! ప్రభాకర సుగుణవర్మ నామధేయములఁగోఁ బరగిన యాయువకుఁడు తనకుమారుఁడని జగన్నాథవర్మ యెట్లు తెలిసికొనెనో యించుక తెలిపెదను.

శంకరయ్య తానెఱిఁగిన రహస్యములను రాజుతోఁ జెప్పినపిమ్మట, రాజు ‘నేను రేపే యీయూరు విడిచిపోయెద’ నని చెప్పెను. మీకు జ్ఞాపకమున్నదా? అతఁడన్నట్లు చేసెను. జగదంబ బిడ్డని విడిచిపెట్టి విజయనగరమునకు వారముదినములు ప్రయాణమున వచ్చినదిగదా? ఆమె ప్రాయశః గోదావరీమండలమునుండి వచ్చి యుండు, నని యూహించి యతఁడు వెంటనే యామండలమునకేఁగి ప్రతిగ్రామమును బట్టణమును దిరుగ నారంభించెను. ఆయాచోట్లఁగల వృద్ధులను

బ్రశ్నించిచూచెను. ఎవ్వరునుజగదంబావృత్తాంత మెఱుఁగమనిరి. ఇట్లు నాలుగయిదువారము-లు తిరిగి, చంద్రమహాలెమునకువచ్చి యతఁడు 'వాకబు' చేసెను. నరసింహారాజుగారి తోఁటమాలియగు నారాయణ స్వామి వలనను వానిభార్య వెంకమ్మవలనను, నిరువదిమూఁడేండ్లక్రింద నొకబాలుఁడు వారికి దొరకుటయు, నాతని నాయూరికాఁపురస్థుఁడు వెంకటరాజుపుచ్చుకొని పెంచుకొనుటయుఁ బిమ్మటనాతేండ్లపాయమున వానిని నరసింహారాజుగారికప్పగించుటయుఁ దెలిసికొనెను. వానిచరిత్ర మంతయు నాదంపతులెఱిఁగినంతమట్టునకు జేనిఁతోఁజెప్పిరి. జేనికా మాటలన్నియు నచ్చినవి. కాని వానిపేరు ప్రభాకరుఁడని వినుటచే నె వ్వఁడైయుండునాయని యాలోచించెను. మఱియు వెంకటరాజుగారు త మకుఁబ్రభాకరుఁడు దొరకినప్పుడొక యందమైనచొక్కా తొడిగికొని యుండెననియు, దాని యంచున 'మకరందుఁడు' అని యెఱ్ఱదారముతోఁ గుట్టఁబడి యుండెననియుఁ జెప్పుటచేబ్రభాకరుఁడే తనకుమారుఁడని నిశ్చయించెను. ఏలయన శంకరయ్యయాపిల్లవానికి మకరందుఁ డనుపేరు తల్లిచేఁ బెట్టఁబడెనని రాజుతో మనవిచేసియేయున్నాఁడు వెంకమ్మయు నారాయణస్వామియుఁ బ్రభాకరునిఁగూర్చి చేసిన వర్ణనముంబట్టి యు తఁడే సుగుణవర్మయను మాఱుపేరితో నుండెనని భావించి నృపాలుఁడు వెంటనే యక్కడివారలకు బహుమతులిచ్చి విశాఖపురికి బయలు దేఱి వెడలెను.

తోడనే కామేశ్వరరాయని దర్శించి యావద్వృత్తాంతమును నివే దించెను. ఆతఁడుసుగుణవర్మయేప్రభాకరుఁడనిచెప్పెను. కాని తనకుమా రునకుఁ గుడిబుజముమీఁద మూఁడు పుట్టుమచ్చలున్నట్లు వినియుండెను. ఆయాః వాలు ప్రభాకరునకుఁ గూడఁ గలదాయని వెంకమ్మనారాయణ స్వాములను, వెంకటరాజుగారినిఁ, గామేశ్వరరావుగారినిఁ బ్రశ్నించెను. వారందఱెఱుఁగమనిరి అప్పుడతఁ డావిషయము నరసింహారాజునకుఁ

తెలియునేమో కనుఁగొననెంచి, యనంతజవసంపత్తిగల నాల్గుగుఱ్ఱము
లు పూన్చినబండి నధిరోహించి, యరవిందాదేవి పరిష్కృతముసఁ గాపుర
మున్న మేడకడ కేతెంచెను. నరసింహారాజును దొంగదొరగాఁ బిలిపించి య
డిగెను. అతఁడు ప్రభాకరునకుఁ ద్రికోణాకారముగల నూఁపు చక్కని
చుక్కలు దక్షిణభుజమునయం దున్నవని చెప్పెను. అతఁడప్పుడు తమ
కముంబట్టఁజాలక సౌధముపైనున్న సుగుణవర్మను రావించెను అతఁడు
దూరమునఁ గాన్పించినతోడనే యెదురేఁగి 'నాయనా! నీవు నాకుమా
రుఁడవురా' యని బిగియారఁ గౌఁగిలించుకొని యానందబాష్పములచే
వానిమేనుఁ దడిపెను. అప్పుడే యానందరావచ్చోటికేతెంచి పితృపు
త్రుల పరస్పరాశ్లేషములఁ గాంచి యానందించెను.

మఱియు నాలుగేండ్లక్రిందటఁ బ్రభాకరుఁడు చంద్రమపాలెము
విడిచి యెచ్చటికిఁ బోయెనో, యెట్లుండెనో యించుక వచించెదను—

ఒకనాఁ డతఁడరవిందయుప్రయత్నముగాఁ గోసతెచ్చిన తెల్లగు
లాబిపువ్వును దనకిమ్మని యామె నడిగెనుగదా? అప్పుడు దాని నామె
యీయక కొంతసేపుండి యొకనూతనపురుషుఁడు రాఁగా దాని నప్రి
యత్నముగ నేలజాఱవిడుచుటయు, దానిని ప్రభాకరుఁడు భద్రపఱుచు
కొనుటయు మీకు జ్ఞప్తియున్నదా? శోభనాద్రి యాతఁ డరవింద
నోటినుండి ప్రేమించుటయో లేకపోవుటో తెలుప్పికొని రమ్మనుట
యెఱుఁగుదురా? అరవింద వానియందు సోదరప్రేమను మాత్రమే
వహించితినని చెప్పినదిగాఁదట శోభనాద్రి వానినిబిలిచి యిట్లనెను.
" నాయనా! నీగుణములు నామనసున కెక్కినవి. నీవిచ్చట నుండఁదగవు.
నీవు పట్టణములలో నివసించుచు, ఘనులమధ్యమున మెలఁగుచు, నీవిద్యా
బుద్ధులభివృద్ధిఁ గావించుకొనుము. ఇవిగో నీకుఁ గొన్ని రూపాయలు. వీనిని
దారిబత్తెమునిమిత్తముంచుకొని విశాఖపురికిఁ బోయి, భోగరాజు కామే
శ్వరరావుగారను నాన్యాయవాదియొద్దకుఁ బోయి, యీజాబునిమ్ము.

అతఁడు నీకు సదుపదేశము నిచ్చును. నీముందు నడవడి యెట్లుండవలెనో చెప్పును. వెళ్ళుము. నరసింహరాజునకు మాత్ర మొక కమ్మ వ్రాసి యుంచి పొమ్ము. ముందు నీస్థితి నీవెన్నఁ డనుకొనని యంత గొప్పదిగా మారును. "

ప్రభాకరుఁడు విశాఖపురికిఁ బోయెను. కామేశ్వరరాయునికిఁ గమ్మ యందిచ్చెను ఆపెద్దలేఖ నతఁడు చదివికొని ప్రభాకరునితో నిట్లనెను. "నీయజమానుఁడు నిన్ను వృద్ధిలోనికిఁ దేఁదలఁచినాఁడు. నీయంతరంగశుద్ధినిఁ గనిపట్టి నీపైఁ గరుణఁబూనినాఁడు. నీవిప్పటినుండి ఘనులలోఁ జరింపుము. వారివర్తనముల వేషభాషల నేర్చికొనుము. వారివలె నన్నిటియందు నలవాటు నొందుము. నీకు సాలునకుఁ బదివేలరూపాయలిత్తును. నీయిచ్చవచ్చినరీతి దానిని సద్వినియోగము చేయుము. నీపూర్వచారిత్ర మెవ్వరితోఁ జెప్పకుము. నేటినుండి సుగుణవర్మయను నామధేయమును దాల్పుము. నీకా పదివేలును నాయొద్దనుండి వచ్చుచున్నవని నేను జెప్పుమన్నంతవఱకు నెవరితోఁ జెప్పకుము తఱచు నాకుఁ గాన్పించుచు, సందేహముల నివారణముం జేసికొనుచు నుండుము "

ఆసుగుణవర్మ దూరదేశమందుండి తనమేలుఁ గోరువారు చెప్పినట్లు చరించుచుండెను. అప్పుడప్పుడు కరవింద స్మృతికి వచ్చినప్పుడతఁడు, వాడిపోయిన గులాబిపూరేకలను గన్నుల కద్దుకొని తృప్తిపొందుచుండెడువాఁడు. కొంతకాలము గడచెను. వెంకటపతి యొకతెను రహస్యముగాఁ బెండ్లియాడి యుండియు నెట్టులరవిందను మోసముచేసి తనవలలో వైచికొనఁబోయెనో, యెట్లు శోభనాద్రి వానినడతఁ గనిపట్టి కాపాడెనో, కామేశ్వరరావువలన వినెను. తన రక్షకుఁడైన శోభనాద్రి భూపతిరాజేయని మూవలఁ దెలిసికొనెను. భూపతిరాజు మరణము, అరవిందకు రాజ్యప్రాప్తి, మున్నగు సంశయములం గూర్చి విని, కామేశ్వరరావువలదని

నను వినక కాండేగ్రిగులకువచ్చి కోటయావరణములోని పూఁదోఁటయం
దుఁ దిరిగెను. ఒకపొదచాటుననుండి వెంకటపతి కడపట నరవిందతోఁ
బలికిన పలుకు లాలకించెను. వెంకటపతి ‘ నీవొకప్పుడు నీహృదయ
మునందు నాపయినొందిన యనురాగమిఁక నెప్పుడు బ్రతుకఁజాలని
రీతిగా మృతినొందినదా?’ యని యరవింద నడుగుటయు, నామె ‘ ఆ.
చచ్చినది. ఎప్పటికి బ్రతుకదు’ అని మార్పలుకుటయు నాకర్ణించి సంత
సించెను. ఆదుష్టుఁడరవిందకుఁ గీడు సేయఁబోవఁగా వానిని దీవ్రముగాఁ
గొట్టి యామెను గాపాడి, దాసీజనమునకప్పగించి, సంతోషముగా. దన
దారినిఁ బోయెను.

అతఁడాప్రకాశరాయరామచంద్ర వెంకటపతిరాజుల మాయా
జాలములోఁ గొట్టుకొనుచున్నప్పుడు సయితము, తనమీఁద నేరము ప్ర
బలముగా మోపఁబడినప్పుడును, వాగ్దానమును జెల్లించి తన కెట్లు పది
వేలు వచ్చుచున్నవో చెప్పకుండెనుగదా! అప్పటి యతని చర్యవిని
కామేశ్వరరావ యతనిని దోఁచినవారిలోఁ దన సత్యచారిత్రముం
జెప్పవచ్చుననెను.

దొంగపాచికల వివాదముతీరిన తరువాత నానందరావు తనకూఁ
తును వానికిచ్చి పెండ్లి సేయు నుద్దేశమును వానికడ వెలిఁబుచ్చెను. అ
తఁడు తనహృదయమిదివఱకే యొకరి కర్పింపఁబడెననియు, నన్యులకు
మరలనీయఁబడదనియుఁ జెప్పెను నాఁటినుండియు నానందరావు కూఁతు
తో నతని నన్నఁగా భావింపుమనియే యాజ్ఞాపించి యున్నాఁడు. అట్టి
భ్రాతృభావమే యాతఁడు విదేశములకేఁగి మరలి వచ్చినప్పుడామోహి
నిబాయి యాతనియెడఁ జూపినది.

అవల నతఁడు కామేశ్వరరావు నుపదేశమునుబట్టి విదేశయాత్ర
చేసి, లోకజ్ఞానము మెండుగా గ్రహించి, సద్గుణము, మానసబలము

బెంచుకొని వచ్చెను. అరవిందాదేవి కప్పుడే పదునెన్మిదవయేఁడు నిండఁ బోవుటచే నామెతో సమాగమమాత్రనికిఁ గలుగఁ జేయవలెనను తలంపునఁ గామేశ్వరరావు నరసింహరాజును విశాఖపురి కొకనెపముంగల్పించి రావించెను. అతనితో నరవిందయు వచ్చునని యతఁడెఱుంగును. అతఁడు దేశయాత్రచేసి వచ్చినదినముననే కామేశ్వరరావు 'నాయనా! నీవు భూపతిరాజు కోర్కెప్రకారమన్నియు నెఱింగి వచ్చితివి. ఇఁక నరవిందను వివాహమాడుటే మిగిలియున్నది. నీవీరూపముతోనే యుండి యీపేరితోనే యీమె నునను నాకర్షింపుము' అని యతనితోఁ జెప్పెను. అతఁడటులొనర్చెను.

అరవింద సహజముగా సుగుణశర్మకును మోహినికిని వలపుగలదని నమ్మినది. అతని సుగుణగణములఁ దిలకించినతరువాత నామెకును వానియందు దైవప్రేరితమైన ప్రేమకుదురుటచేఁ దన్నాతఁడు వివాహమాడఁడేమోయని భయపడినది. అంతట సర్వగుణపరిపూర్ణయౌ నరవిందయు మోహినిపై నించుక యసూయఁజూపినది. కాని యది యెట్టివారలకైన సహజముగాఁగల్గును. అది యామెలోపముకాదు. ప్రకృతిలోపమే. ఆమెకు సుగుణశర్మపైఁ బ్రేమ మతింత హెచ్చుటకు న్యాయవాది మోహినీసుగుణశర్మలయుద్వాహముంగూర్చిసూచనముగా నరసింహరాజు చెవిలో నూఁదెను. అతనినుండి యరవిందవిని పరితపింపఁదొడఁగెను. కామేశ్వరరావుపన్నిన పన్నుగడయంతయు సంపూర్ణజయముంగాంచెను. చిరకాలమునుండి ప్రభాకరునిపై నరవిందవహించిన యనురాగము, సుగుణశర్మపైఁ దిరిగినది. అదియు నతఁడు ప్రభాకరుఁడేయై యుండునని కలిగినయనుమానముచేత జనించిన యనురాగమే. మఱియొకటికాదు. తుద కాయావనుఁడు సుగుణశర్మయునుగాక, ప్రభాకరుఁడునుగాక, చిత్రముగా సాలూరుయువరాజుగామాఱెను. ఆశ్చర్యము!

పాఠకులారా! ఇప్పుడరవింద సుఖముగానున్నదా? ఆమెహృదయ

మెట్టులుండెనో మీరే యోజింపుఁడు. ఇఁక నామె యెఱుకతచెప్పిన సోదెయంతయు నిజమేయని నమ్మనచ్చునా? సోదెలు నిజమేయని తలఁపవచ్చునా? అంతయు నెఱవేఱినది. తిరిగితిరిగి ప్రభాకరుఁడు. పురలందనయరవిందనే పరిగ్రహించెను. పూర్వకరుకిప్రభాకరునకును, ప్రకృతపు యువరాజప్రభాకరునకు నెంతిభేదమున్నదందురు? ఏమి యతని రూపము! ఏమి యతనిగుణములు!

తరువాతి వారిరువురొకచోటఁ గూడి మాటలాడుకొనుచున్నప్పుడు వారియానంద మేమనిపర్ణింతును! నాఁడు తానువాఁడిన గులాబిపూవు నామెకుఁ జూపి 'ప్రాణేశ్వరీ! దుఃఖములలోనున్నప్పుడు నన్నిదియే యోదార్చినది. కష్టములనున్నప్పుడిదే హెచ్చరించినది. ఈ యైదారువారములనుండియు నిదియే నాకాశనుబుట్టించినది. వేయేల, ఇదియే నాజీవములఁగాపాడినది' యని యతఁడు పలికినప్పుడామె కపోలదర్పణముల నుండి యానందబాష్పములు జాలువాఱెను.

మఱుచటిదినమునఁ బ్రాతఃకాలమున సందడియును మహానాదములు బయలుదేఱె. సాలూరునకుఁ బోయిరి. ప్రభువు, ముందుగనే పుత్త్రుని యాగమనమునకు సర్వము శృంగారముఁ జేయించి యుంపుఁడని పౌరుల కాజ్ఞఁబంపెను. సాలూరునందాబాలగోపాలమును యువరాజు దేవేరితో వచ్చెనని గొప్పయుండుగఁ జేసికొనిరి.

---

ఇరువదిమూఁడవ ప్రకరణము.

పరిసమాప్తి.

ఒకనెల గడచెను. అరవిందకుఁ బందొమ్మిదవ పుట్టినదినము వచ్చెను. నాఁటియుదయమునఁ బ్రభాకరుఁడు మహామోదసంధాయకుఁడై, సౌమ్యతేజస్సమన్వితుఁడై కనుపట్టెను. నాఁడేయరవింద పెదతండ్రి

యలనాఁడిచ్చిన యెఱ్ఱని పెట్టెనువిప్పి యందేమున్నదో చూచుకొనవల సియున్నది. ఆమె భూపతిరాజు నానతిప్రకార మాపెట్టెను గుఱించి తండ్రితోనైనఁ జెప్పలేదు. జగన్నాథవర్మ కాఁబోవుకోడలి కానాఁ వమూల్యరత్నాభరణాదులు బహుమానమొసంగి, బీదలకన్నప్రదాన ములుచేసి. దేవాలయములయందుఁ బూజలుసల్పి, గొప్పయుత్సవముఁ జేయించెను. నరసింహరాజునట్టియుత్సవములే చేయవలసినదనికాండ్రె గులకు వర్తమానమంపెను. అరవింద యరవిందవలెను. ప్రభాకరుఁడు ప్రభాకరునివలెను నుండిరి. పగటిభోజనమునకుఁ బూర్వమే యరవింద శుచియై యొక యేకాంతస్థానమునఁ గూర్చుండి యాపెట్టెతాళమును దీసి, యందుంపఁబడిన కొండపల్లి కాగితపుమడతనెత్తి, యందలి యక్షరసౌష్టవమునుబట్టి యది తన పెద్దతండ్రిచే లిఖియింపఁబడెనని తెలిసికొని, యిట్లు చదువనారంభించెను—

"కన్నతల్లీ! నీవు నాయాజ్ఞఁజెల్లించి నీకుఁ బదునెన్మిదవయేఁడు నిండువఱకు నీపెట్టెవిప్పవనియుఁ, బందొమ్మిదవ వర్షంతినాఁడు నేను నీయెదుటనుంటిననియు భావించియే నీతోఁ జెప్పుచున్నాను. వినుము. మనుష్యునకు సాధ్యమైనయత్నములన్నియు జలిపి నీకు సర్వవిధముల జయము చేకూరుటకు నేఁటివఱకుఁ బనిచేసితిని. అన్నియు భగవత్కృ పవలనఁ బరిపూర్ణత్వముఁ నొందినవి. మొదటనుండియు వెంకటపతి నీకుఁ దగినవరుఁడు కాఁడని గ్రహించితిని. మఱియు సంకోచుఁడు, వేనవేలుసద్గు ణములు గలవాఁడు నీపయిఁ బవిత్రానురాగము నిల్పెనని తెలిసికొం టిని. వెంకటపతి యెన్నఁటికి నీకేలుపట్టఁజాలఁడనియుఁ, గాలక్రమమున నిమది వాకర్షించి నిన్నుఁ బ్రభాకరుఁడే వివాహమాడుననియు నాకు నమ్మిక గలదు.

అమ్మా! నీస్వభావమంతయుఁ బరీక్షించి చూచితిని. ఎట్లు నీక ప్పుడప్పుడు చాపల్యముకలుగుచుండెడిదో, ఎట్లునీసహజసద్గుణస్వభావము

దానిని జయించి నిన్నుఁగాపాడుచుండెడినో నేను గంటిని. మొదటినుం
డియు నాయనంతరమున నీవే నారాజ్యమేలవలయునని కోరికఁగలవాఁడ
నై, నీయౌదార్యాది ఘనగుణముల నెఱిఁగినవాఁడనై యుంటచే నీవా
ణెనిగ్రహించువాఁడుకూడ నీకు నన్ని తెఱఁగుల ననుకూలుఁడు కావలె
నని నాసంకల్పము నేనేనేక దేశములఁ దిరిగితిని. లోకజ్ఞానము నొందుగ
నార్జించితిని. నాయనుభవమును బట్టిచూడఁగా బ్రిభాగకుఁ డించుక
మోటుశరీరముగలవాఁడయి నాగరికత యెఱుఁగనివాఁడై యున్నను
నాని నరములలోఁ బ్రవహించు శక్తియు ఘనతరమై పవిత్రమైనదని
నాకు స్ఫురించుచున్నది. ఎప్పటికైన నాని ఘనతరసత్కులీనత బయ
లుపడకపోదని నాయూహ. ఒకవేళ నట్లుకాకపోయి నాని నీతిగుణ
ములకయిన నీవు నానిని బరిణయమాడవచ్చును.

బిడ్డా! నీకొకటి వెల్లఁబుచ్చెదను, ఈవాక్యములు చదువక పూ
ర్వమును నీవు శంకించియే యున్నావు. అయినను చెప్పెదను వినుము.
నేను మున్నొక యెఱుకతచే చిన్ననాటకమాడించితిని. అది యాంతయు
ముందుగా నామెకుఁ జెప్పి నాలుగుసారులు నేనుబరీక్షించిన దేసుమీ.
అది చమత్కారముగాఁ జేసితిని. జరగఁబోవునదంతయు మున్ముందు
నీకుఁ దన్మూలమునఁ దెలియఁబఱచుట మేలని యెంచి యట్లొనర్చితిని.
అంతయు నీమేలునుగోరి యేసుమా చేసితిని అమ్మా! నాదితప్పుపని
యా? సరియైన పనియా?—

తనయా! ఏది యెట్లున్నను నిన్ను భగవంతుఁడు సర్వదా కాపాడి
శుభంబులొసఁగునని నాకు విశ్వాసమున్నది. ఏనొకవేళ నాయుపదేశ
ముల ననుసరింపకుండవలెనని బుద్ధిపుట్టినఁ దల్లీ, నీమనస్సాక్షి యెట్లు
నీకాజ్ఞయిచ్చునో యట్లు మెలంగుము. నీవెప్పుడు ఋజుమార్గవర్తినివై
యుందువని నాకు నిండునమ్మికగలదు. వెంకటపతి యెన్నఁడును నీయొ
క్షికలోఁ బడఁడని మఱియు నమ్ముచున్నాను, అమ్మా! ఈలేఖ నీవా

గాఁ దలంపకుము. ఉపదేశమని యెఱుఁగుము నీసహజనిర్మలచిత్తవృత్తినిఁబట్టియే చరింపుము. నీకు సర్వమంగళము లొడఁగూడుఁగాక.

ఇట్లు,

నిరంతరమును నీమేలుఁగోరు

నీపితృవ్యుఁడు,

భూపతిరాజు"

అరవింద యీజాబును ముగించి శోకమాపుకొనలేక చాలసేపు దుఃఖించెను. ఎట్లా మహానుభావుని సంకల్పములన్నియు సిద్ధించెనని యాశ్చర్యపడెను. కాని, ప్రత్యక్షముగాఁ జూచి సంతసించుటకాతని కాయుష్యలేకపోయెనని ఏగచెను. ఆజాబును దండ్రికి నెయ్యురాండ్రకుఁ జూపించి పెద్దతండ్రిని వేనోళ్ళఁగొనియాడెను. కాని దానిని దన మనోహరునికిమాత్రము వివాహమగునటకుఁ జూపింపకుండెను ?

అరవిందా ప్రభాకరులకు వివాహముహూర్తము నిర్ణయింపఁ బడినది. పెండ్లి తిరుపతి వేంకటేశ్వర సాన్నిధ్యమునఁ జేయ నిశ్చయించిరి. బంధువులు, మిత్రులు, రాజకీయోద్యోగులు, దాసదాసీజనములు కూడ నేతేర సాలూరురాజు, నరసింహరాజును వధూవరులతో బయలు దేఱిరి. మధ్యమధ్యగ్రామముల యందాఁగుచు నృత్తగీతవాద్యాది వినోదములం దేలుచు, విడిసినచోట్ల నెల్ల సర్వవర్ణములవారికిని దృప్తిగా సంతర్పణములను జేయుచు, వివాహమునాఁటికి, దిరుమలను జేరిరి. ముహూర్తము ప్రాతఃకాలమున నైదుగడియలకని పెద్దలునిర్ణయించిరి. మంగళవాద్యారవంబులతో, విప్రాశీర్వాద ధ్వానములతో నత్యంతవైభవమున నరవిందా ప్రభాకరులకుఁ బరిణయమయ్యెను. ఆదేవర నాశ్రయించుకొనియున్న యోగి యోగినీజనులెందఱో వేడుకఁ జూడవచ్చిరి. ఎన్నఁడట్టి వైభవముఁగని యెఱుంగకపోవుటచేతను, వారల నెల్ల తేఁడు

ప్రత్యేకమాహ్వానముం జేసియుంటచేతను నాగేంద్రుడును వివాహమంట
పము నలంకరించియుండిరి. పురోహితులు చెప్పిన స్వస్తివచనములతో వధూవరుల
పితృపితామహ ప్రపితామహాదుల గోత్రనామధేయములు జెప్పుచుం
డిరి. సాలూరుభూకాంతుండైన జగన్నాథవర్మ పేరు వినంబడినతోడనే
యోగినీజనమునొక్కరుత 'హా! నాథా' యని మూర్ఛనొందినది.
ఆయాక్రందనధ్వని విని యెల్లరు నామెసమీపమునకుం జని శైత్యోప
చారములు సల్పిరి. కొంతవడికి నామె తెలివొంది దగ్గఱనున్నవారిని
'అయ్యా! ఆసాలూరు రాజుగారెచటనున్నారు?' అనెను. వారాతనిం
బిలుచుకొనివచ్చిరి. తోడనే యామె మనోదుఃఖమునుబట్టలేక 'హా! హృద
యేశ్వరా' యని యాతని గౌగిలించుకొని యేడువసాగెను. వెంటనే
యతండు కంఠధ్వనినిబట్టి యామె నానవాలుపట్టి 'హృదయేశ్వరీ! నీవే?'
యని సంతోషదుఃఖ సమ్మిళితాశ్రుపూరంబుల వెడలార్చెను. పెండ్లివా
రందఱు నక్కడికివచ్చిరి. రాజు తనభార్యయైన జగదంబ యీమెయే
యని తెలిపి, యామెపాదములపై కొమరుని గోపాలుని మ్రొక్కించెను.
ఆయానందము సందర్భములు వర్ణించుటకన్న జదువరులు నూహింపుడ
నుటయే మేలని తోంచి మానితిని.

నాండు జగదంబ కాశిని విడిచి నడచిపోవుచుండి పోయి యోగినిని చేరి
కాషాయవస్త్రధారణముం జేసి సన్యాసినియై దేవప్రసాదమును దిను
చుం గాలక్షేపముం జేయుచుండి యచ్చోటనే యుండిపోయెను. పరమే
శ్వరుని కృపవలన మరల నామెకలియు భాగ్యము కలిగినది. వివాహా
నంతర మందఱును సాలూరికేగిరి. మహోత్సవములు వర్ణనాతీత
ములైనవి జరిగెనని వచింపనక్కఱలేదు. ఒకశుభముహూర్తమున
జగన్నాథవర్మ పుత్రునికిం బట్టాభిషేకము నొనర్చి తానును భార్యయు
సదా ఈశ్వరధ్యానచిత్తులయి కాలముగడపుచుండిరి. ప్రభాకరుండు
సాలూరు కాండ్రేగుల రాజ్యములకు రాజై ప్రజలను బిడ్డలవలెం జూచు

ముఁ జిరకాలమేగెను. నరసింహరాజింతకుబూర్వమే స్వస్థదేహుఁడై యుండెను. సుతకడనుండి యెడతెగని సౌఖ్య మనుభవించుచుండెను. పూర్ణయామాత్యుఁడు కాండ్రేగుల రాజ్యకార్యముల నైపుణ్యముతో నెఱపుచు రాజదంపతుల యాజ్ఞప్రకారము సర్వమాచరించుచుండెను.

వెంకటపతి మాలతితో యేనామునకుఁ బోయియుండెను. అతఁడచ్చట మఱల నొకనికి ఘాత తలపెట్టఁగాఁ బట్టుపడి రహస్యముగా వధింపఁబడెను. మాలతి మఱియొక ధనికుఁడగు వర్తకుని లంకించుకొని రంగూనునకుఁ బోయెను.

మోహినీబాయి సాలూరుపాలుని జ్ఞాతివర్గములోనివాఁడగు విక్రమదేవుని వివాహమాడి సాలూరుకోటలోనేయుండి ప్రభాకరమహారాజుచేతను నరసింహామహాదేవిచేతను దగినమన్ననల నందుచుండెను. రాగమ్మ సుబ్బమ్మగారులు వారికి దగినవరులఁ బెండ్లియాడి సుఖముండిరి

చదువరులారా! నాపనిముగిసినది. ఇందలిమంచిచెడ్డలను గ్రహించుభారము మీకు వదలితిని. అదృష్టదేవతాప్రభావమునుజక్కఁగా గ్రహింతురుగాక.

సంపూర్ణము.

